# సాహిత్య వ్యాసాలు

డాక్టర్ కొలకలూరి ఇనాక్






సి. ఎల్. ఎస్. బుక్ షాప్
స్టేషన్ రోడ్, హైదరాబాద్ 500 001

# పరిచయం

కథలద్వారా, నవలద్వారా కొలకలూరి ఆంధ్ర పాఠకులకు సుపరిచితుడు. రేడియో నాటికలు, కవితలు, గేయాలు తదితర సాహిత్య ప్రక్రియలన్నీ 'కొలకలూరి'కి కరతలామలకము లయ్యాయి. నేటి సాహితీ జగత్తులో ఒక్కొక్క శిఖరాన్ని అధిరోహిస్తూ, కీర్తి ప్రతిష్ఠతలను పతాక స్థాయిలో పెంచుకుంటున్న రచయిత శ్రీ కొలకలూరి ఇనాకు. వారిని గురించిన ప్రత్యేక పరిచయం అనవసరం.

క్రైస్తవ వాఙ్మయ సమాజం (సి.ఎల్.ఎస్.) వారు ఆంధ్ర భాషకుచేస్తున్న సేవావిశిష్టత సాహితీ పరులకందరికి తెలుసు. భాషాపరంగా పాఠక లోకానికి మేము అందిస్తున్న అనర్ఘ రత్నాలలో ఇదొక మేలిరత్నం.

దాన్ బాబు,

సంపాదకుడు.

# కృతజ్ఞత

'సాహిత్య వ్యాసాలు' రచించటానికి ప్రోత్సహించిన కీ. శే. శివలెంక శంభుప్రసాద్ గారికీ, 'వ్యావహారిక భాష – గిడుగు రామమూర్తి' వ్యాస సృష్టి చేయించిన ఆచార్య కోరాడ మహాదేవ శాస్త్రిగారికీ, కృతజ్ఞుణ్ణి!

ఈ వ్యాసాలు ప్రచురించిన భారతి, ఆంధ్ర దిన పత్రిక, ఆంధ్ర ప్రభ సచిత్ర వారపత్రిక, ఆంధ్ర క్రైస్తవ కళాశాలా పత్రిక, ప్రసారం చేసిన ఆకాశవాణి హైదరాబాదు, సంపాదకులకు అధికారులకు కృతజ్ఞుణ్ణి!

'ముసలమ్మ మహాత్యాగం–బుక్కరాయ సముద్రం' రచనంలో మిత్రుడు పాలగిరి వేణు తోడ్పాటుంది. ఈ వ్యాస భాషలోని ద్వైవిధ్యం, రచనా కాలంలోని దూరం సహృదయులు గ్రహిస్తారని ఆశిస్తున్నాను.

ఈ వ్యాసాలను పుస్తక రూపంలో ముద్రించిన సి. యల్. ఎస్. వారికి నా కృతజ్ఞతలు.

'కొలకలూరి'

# అంకితం!

కీ. శే. శివలెంక శంభుప్రసాద్ గారికి

# విషయ దర్శనం

# ‘కుమార సంభవం’లో సౌందర్యం

వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ.

ఈ కాళిదాస శ్లోకం వినగానే పార్వతీ పరమేశ్వరులు వాగర్థాలులా ఉన్నారన్న విషయం భావితమై, అర్ధనారీశ్వర తత్త్వాంతర్యం స్ఫురించినట్లై, శివశివులు వాగర్థాలయినచోట వెల్లివిరిసిన సౌందర్యం దర్శించాలన్న అభిలాష కలగటం సహజం. అందుకు వెంటనే గురుకు వచ్చేమార్గం ‘కుమార సంభవ’ కావ్యం. పార్వతి శివుడికోసం తపస్సుచేసి, శివుణ్ణి భర్తగాపొంది, తల్లి అయిందాకా వర్ణితమయిన ఈ కావ్యంలో రతిమన్మథుల దాంపత్య జీవితమూ గోచరమవుతుంది. శివపార్వతుల జీవితం అక్షరమయినట్లే రతిమన్మథుల జీవితమూ, ఈ కావ్యంవల్ల చిరంజీవి అయింది. వాక్కూ, అర్థమూ కలసి మెలసి ఉన్నట్లుగా, విడదీయ వీలుకానట్లుగా శివపార్వతులు కాని, రతి మన్మథులుగాని ఎలా ఉన్నారో, ఆసంసక్తతలోని ఆసంయుక్తతలోని, ఆ దాంపత్యంలోని సౌందర్యం ఏమిటో చూడాలనుకోవటం ఆసక్తియుతం, ఆశాసహితం.

ఈ ‘కుమార సంభవ’ కావ్యంలో మహర్షకవి కాళిదాసు నిక్షిప్తంచేసిన పారమార్థిక తత్త్వం ఏమయినా కానీ, భగవంతుడి ప్రకృతి ప్రకటనంలోని ఆంతర్యం ఏమయినాకానీ, ఈ కావ్యాన్నిగూర్చి, నాటినుంచి నేటిదాకా, ఆలంకారికులు, మేధావులు పల్కిన మహోత్తమ విషయాలు ఏమయినాకానీ, సహృదయుడు కావ్యపఠనం ముగించింతర్వాత కలిగే అనుభూతి విశేషమే ఆలోచింపవచ్చు.

కావ్యగత అలౌకికదృష్టి అటుంచి, లౌకికంగా ఆలోచిస్తే ‘కుమార సంభవ’ కావ్యం ఒక ఉత్తమ ధర్మబోధకం. అది దాంపత్యధర్మం. ఈ ధర్మం సర్వ మానవ సహజం. ఆలంకారికుల మాటలకేం? ఈ విషయంలో వాళ్ళమాటలు వాళ్ళతోనే ఉంచవచ్చు. వాళ్లు పాక్షిక సాంఘిక సత్యాలకు లాక్షణికులు. సృష్టిలో ఏ ధర్మమయినా నాటినుంచి నేటిదాకా సాగిరావటంతో శిథిల

మయితే కావచ్చుకాని దాంపత్యధర్మం మాత్రంకాదు. ఈ దాంపత్యధర్మ సౌందర్యానికి పరిపూర్ణాక్షర రూపం 'కుమార సంభవం'. ఈ దాంపత్య శోభ—దాంపత్య సౌందర్యం నిండిన సృష్టికంతటికీ మకుటాయమానంగా సంకేతంగా ఉన్న తత్త్వం అర్ధనారీశ్వరత్వం. సృష్టిగతమైన శృంగార జీవితానికి ప్రతీకగా దాంపత్యధర్మానికి పతాకగా సంప్రదాయముద్రతో ప్రకాశించేది రతిమన్మథ జీవితం. 'కుమార సంభవ' కావ్యంలో ఈ అర్ధనారీశ్వరత్వం, రతిమన్మథజీవితం వాగర్థాలులాగా వాల్లభ్యసౌందర్యం ఎలా ప్రదర్శింపబడ్డయో పరికించవచ్చు.

ఈ కావ్యంలో కన్యఅయిన పార్వతి తల్లి అయిందాకా ఉన్నకథా భాగమూ, భార్య అయిన రతి భర్తృవియోగ వ్యథ పొందేదాకా ఉన్నకథా భాగమూ, ఒకపూర్ణసత్యం తెలుపుతాయి. దాంపత్య సౌందర్యంలో స్త్రీ విషయకంగా చూస్తే పార్వతి జీవితం ఈ పూర్ణసత్యంలో ఆది దశ, రతి జీవితం అనంతరదశ. రతి పార్వతుల జీవితాలు వ్యష్టిగా అసంపూర్ణమయినా, సమష్టిగా ఒక పూర్ణ దాంపత్య సౌందర్య ప్రదర్శకమయ్యాయి. భర్తను కోరుకొనే కన్య జీవితం మొదలుకొని, భర్తగతిస్తే శోకించే స్త్రీ జీవితందాకా ఒక పూర్ణజీవితం—భారతీయ స్త్రీ జీవితం—ఆ జీవిత దాంపత్య సౌందర్యం ప్రదర్శించే కావ్యం 'కుమార సంభవం.'

ఈ దృష్టితో ఈ కావ్యం పరికిస్తే పార్వతి కన్యగా, ప్రేమికగా, తపస్వినిగా, భార్యగా భిన్నరూపాలలో గోచరిస్తుంది. రతి భార్యగా భర్తృవియోగినిగా ద్యోతకమవుతుంది. స్థూలంగా కన్య—భర్తృవియోగిని అయిందాకా మధ్య జీవితంలోపొందే అన్ని దశలను—పూర్ణజీవితాన్ని ఈ కావ్యంలో చూడవచ్చు. శివ సంబంధి కథాభాగంలో భగవల్లక్షణాలు అధికంగా, మానవధర్మం అల్పంగాను, మన్మథ సంబంధకథా భాగంలో మానవధర్మం అధికంగా, భగవద్ధర్మం అల్పంగాను గోచరించినా, స్థూలదృష్టికి, కాళిదాసు ఈ కావ్యం అలౌకికధర్మ ప్రరోచనకంటే లౌకికధర్మ ప్రరోచనకు; భగవంతుని లీలా ప్రస్తావనకంటే మానవధర్మ ప్రస్తావనకు; ఉద్దేశించినట్లు గోచరిస్తుంది. అందువల్ల ఆ మహర్షికవి ఈ కావ్యంలో ప్రత్యక్షీకరించిన మానవ వాల్లభ్య సౌందర్యదీప్తి గమనింపవచ్చు.

పార్వతిలో కవి ప్రదర్శించిన సౌందర్యం రెండువిధాలు. ఒకటి బాహిర సౌందర్యం. ఇది శరీరగతం. దీనికి యౌవనం, అలంకారాలు, ఆభిజాత్యం దోహదంచేశాయి. రెండు ఆంతర సౌందర్యం. ఇది హృదయ

గతం. దీనికి తపస్సు, పట్టుదల దోహదం చేశాయి. ఈ సౌందర్య ద్వయం ప్రప్రథమంగా పరిశీలనార్హం.

యౌవనారంభంలో రాశీభూత సౌందర్యాధి దేవతగావున్న పార్వతిని నఖశిఖ పర్యంతం కాళిదాసు వర్ణించాడు. పాదాది కేశాంతం పరిపూర్ణ విగ్రహంగావున్న పార్వతి అలంకృతగా సంచరించే సమయం బాగా వర్ణింపబడింది.

అశోక నిర్భర్త్సిత పద్మరాగ మాకృష్ట హేమ ద్యుతి కర్ణికారమ్
ముక్తా కలాపీకృత సిన్దువారమ్ వసన్త పుష్పాభరణం వహన్తీ.

పద్మరాగాలు కాక అశోక పుష్పాలూ, బంగారు నగలుకాక కొండగోగు పూలూ, ముత్యాలుకాక వావిలి పూవులూ—అన్నీ వసంత పుష్పాలే ఆభరణాలుగా ధరించి,...పర్యాప్త పుష్పస్తబకా వనమ్రా సంచారిణీపల్లవినీ (లతేవ) నిండు పూగుత్తులతో వంగినదై, చిగుళ్లుకలదై, సంచరించుచున్న తీగలాగా పార్వతి తపోన్ముఖి అయి శివసేవార్థం హిమవంతుని అనుజ్ఞతో వచ్చింది.

ఈ అభరణాల మాటకేంగాని, పార్వతి అవయవవర్ణనం జరిగినప్పుడే—పార్వతిని దేవతగా భావించేవాళ్లకు బాధకలుగుతుంది. దేవత శరీరవర్ణనం ఇంత విచ్చలవిడిగా పచ్చిగా చేయటం న్యాయమా, కాళిదాసు ఔచిత్య భంగం చేయలేదా అని అనిపించవచ్చు. సంప్రదాయజ్ఞుల దృష్టిలో కుమారసంభవ కావ్యప్రయోజనం ఏమయినా, పార్వతిని కాళిదాసు దేవతగా భావించలేదు. అందువల్ల పైవర్ణనం దోషంకాదు. సామాన్య స్త్రీగా పార్వతిని భావించాడు. కాదంటే మానుషధర్మం పార్వతిలో ప్రతిష్ఠించాడు. అందుకే ఆమె అవయవవర్ణనం దోషంకాదు. పైగా శారీరక సౌందర్యం—అవయవ నిర్మాణానికి ఆభరణాలంకారానికీ పరిమితంగా వర్ణించటానికి వీలుకలిగింది. పార్వతి హిమవంతుని కూతురు. ఆయన నగాధిరాజు. దేవతాత్మతో శోభించే పృథివి మాన దండంవంటి మహాత్ముడు. అటువంటి తండ్రికి తగిన కూతురై, కోరినవరుణ్ణి సంపాదించుకోవటానికి అనుమతిపొంది బయలుదేరిన పార్వతి ఆభిజాత్య శోభితఅయింది.

పార్వతి శారీరక సౌందర్యం ప్రాబంధికం. ఆ సౌందర్యం ఆభరణాలతో ద్విగుణీకృతం అయింది. పద్మరాగాలు, బంగారం మౌక్తికాలు బదులుగా వసంతపుష్పాలు తాల్చి, పూలతో చిగుళ్లతో కదిలే పల్లవించిన తీగలాంటి పార్వతి వపుఃచారుత కాళిదాసు సుందరంగా భావించాడు. ఈ అలం

కారాలతో ఈ స్థితిలో సౌందర్యం తరంగితమయ్యే తన్వీ, పార్వతి పర
శ్వరుడి ఎదుట ప్రణమిల్లింది. శంకరుడు దీవించాడు. ఆమె వ్రీడావ
అయింది. జితేంద్రియుడైన త్రినేత్రుడు మనోవికారం పొందాడ
కారణం పరికించాడు. కాముడు కంటబడ్డాడు ముక్కంటి మూడోకం
నుండి మహాగ్నికీలలు జ్వలించాయి. కాముడు కాలిపోయాడు. శివుడ
భూతగణంలో చేరిపోయాడు.

పార్వతి నిరాశాతాడిత అయింది. పరాభవం తెలుచుకొని కుమి
పోయింది. ఈ పరాభవం తన శారీరక సౌందర్య పరాభవంగా భావించింద
సంచలించింది. అందుకే, ...

వ్యర్థం సమర్థ్య లలితం వపురాత్మన శ్చ

సుందరమయిన తన దేహం అర్థ విహీనంగా భావించింది. ఆ ఆలో
చనతో పార్వతి హృదయం శూన్యమయింది. అప్పుడు, ...

శూన్య జగామ భవనాభిముఖీ కథంచిత్

ఏమీ తోచక ఎలాగో ఇంటిముఖం పట్టింది.

కాళిదాసు తన సౌందర్యసంభావనంలో ఒక ఉన్నతకోణం ఇక్కడ
ప్రదర్శించాడు. తిరస్కార పరాభవాగ్నితో దందహ్యమానమయిన పార్వతి
హృదయంలో బాహిర సౌందర్యాతీత సౌందర్య దృష్టినిలిపాడు. ఆ
సమయంలో, ...

నినిన్ద రూపం హృదయేన పార్వతీ

పార్వతి రూపం–సౌందర్యం హృదయపూర్వకంగా నిందించింది. ఈ
శారీరక సౌందర్యం సమున్నతంకాదు అన్నభావం కవి ప్రతిష్ఠించాడు. అంద
చేతనే పార్వతి ఈ సౌందర్యంకంటే ఉత్తమమైన సౌందర్యస్థితి పొంద
గోరింది.

ఇయేష సాకర్తు మవన్ధ్య రూపతాం
సమాధిమాస్థాయ తపోభిరాత్మనః

నియమాలతో ఏకాగ్రతను అవలంబించి, అవంధ్య సౌందర్యం పొందాలని
వాంఛించింది.

బాహిర సౌందర్యం చ్యుతం. అంతర సౌందర్యం అచ్యుతం. తన
హృదయం శివచిత్తం జయించాలి. శరీరం జయించలేకపోయింది. కనుక
తపస్సు తప్పనిసరి. కాబట్టి కఠిన తపశ్చర్య కుపక్రమించింది.

కృతాభిషేకాం హుతజాతవేదసం
త్వగుత్తరాసఙ్గవతీమధీతినీమ్,
దిదృక్షవస్తామృషయోఽభ్యుపాగమ
న్నధర్మవృద్ధేషు వయస్సమీక్ష్యతే

స్నానంచేసి, హోమంచేసి, నారచీరె పైటవేసుకొని, స్తుతి పాఠాదికం పఠిస్తూవున్న పార్వతిని మెచ్చి మునులు ఆమెను దర్శించటానికి వచ్చారు. ధర్మవృద్ధ అయిన పార్వతిని సందర్శించటంలో ధర్మవృద్ధులయిన మునులు వయస్సును పట్టించుకోలేదు.

పార్వతి తపశ్చర్యవల్ల కృశించింది. శారీరకశోభ తగ్గింది. సుందర వసనాలు ఆమె ధరించలేదు. మునివృత్తిలోవుంది. భూషణాలు అలంక రించుకోలేదు. పూలు తాల్చలేదు. నిరలంకారంగావుంది. అయినా ఆమె మునులను ఆకర్షించింది. పిన్నవయస్కురాలయిన పార్వతిలోని ఈ సౌందర్యంలో ప్రేమలేదు, లజ్జలేదు. దురభిమానంలేదు. గౌరవం ఉంది. అందుకే పెద్దలయిన మునులు దర్శించే స్థాయిని పొందింది.

ఇప్పటికామెలో హృదయసౌందర్యదీప్తి సృజించాడు కాళిదాసు. ఇక ఆ సౌందర్య విజృంభణం మాయావటువుతో పార్వతి సంభాషణం. ఈ హృదయస్థితిలో ఆమెకు శివుడిలో లోపాలు కనిపించవు. అందుకే ఆమె...

మమాత్ర భావైక రసం మనఃస్థితం
నకామ వృత్తిర్వచనీయ మీక్షతే

'నా మనస్సు శృంగారాసక్తితో శివునియందే లగ్నమయింది. నన్నాక్షే పించి ప్రయోజనంలేదు. స్వేచ్ఛాప్రవృత్తిగలవాళ్లు నిందను లెక్కించరు' అని మాయావటువుతో పలకగలిగింది.

ఇప్పటికి పార్వతి హృదయం పరిపూర్ణమయింది. తను శారీరకంగా శివుణ్ణి తనవరుణ్ణి చేసుకోలేకపోతే, తపస్సుతో సాధించగలననుకొంది. పరమేశ్వరుడు ఈ తపస్సుతో తన హృదయేశ్వరుడు కావటం తథ్యం అనుకొంది. అందువల్ల ఇక ఆమెలో శంకలేదు. భయంలేదు. అనిశ్చితత్వంలేదు. అపనమ్మకం లేదు. ఈ స్థితికి చేరుకొన్న పార్వతి హృదయం పూర్ణ సౌందర్య శోభితం. ఆపైన వర్ణితమయిన శృంగార జీవితం ఈ ద్వివిధ సౌందర్య సమాశ్రితం.

వివాహపూర్వ పార్వతీ పరమేశ్వర పరస్పరాకర్షణ రసమయంగా చిత్రించి, శృంగార జీవితస్థితి శోభానహంగా రసబంధురంగా నిర్వహించిన

మహాకవి కాళిదాసు, దాంపత్య జీవిత ప్రారంభపు వరద ఒత్తిడితగ్గి కలక స్వచ్ఛమయిన వాల్లభ్యప్రవాహస్థితిని రతిమన్మథుల వృత్తాంతంతో స సుందరంగా ప్రసాదించాడు.

శివతపో భంగంచేసి, కామప్రకోపం రేకెత్తించటానికి వసంతుడితో ( ద్వితీయుడైవచ్చిన మన్మథుడు శివకోపాగ్ని జ్వాలలకు కాలి భస్మమైపోయాడ ఆ విలాపంలో వాళ్లగతం వర్తమానం వ్యక్తమయ్యాయి. రతి విలాపం( దాంపత్య జీవితాంతస్సారం, స్త్రీపురుష ఏకీకృతరూపం, స్త్రీపురుష అద్వై( స్థితి తెలిశాయి. శివకోపానలంవల్ల భస్మీభూతమయిన మన్మథుని ఆకృతిచూచి . .

'అయి జీవితనాథ జీవసి'

'ప్రాణేశ్వరా జీవించి ఉన్నావా'

అని మూర్ఛతేరినరతి మొట్టమొదటి ఈ మాట పలుకుతుంది. ర మన్మథుణ్ణి జీవితనాథుడు అనటం వాళ్ల అన్యోన్యతా పరాకాష్టకు చిహ్న( మన్మథుడు జీవితనాథుడై, జీవించివున్నావా అన్న ప్రశ్నకు హేతు( కావటం కాళిదాస ఉక్తి వైశిష్ట్యం. కాళిదాసు, పురుషుడు స్త్రీప్రాణ అన్నభావం రతి విలాపంలో తెలిపాడు. ఆ పరిదేవనలోనే . . .

క్వనుమాం త్వదధీన జీవితాం

వినికీర్య క్షణభిన్న సౌహృదః.

నీ అధీనమైన జీవితం ఉన్న నన్ను ఎక్కడ పారవేసి క్షణంలో చెలని వదులుకొన్నావు అని రతి గతమన్మథుణ్ణి అడుగుతుంది. నీ అధీనజీవిత( అనటంలో స్త్రీ జీవితం పురుషాధీనంగా వుంది అని సామాన్యంగా భావించట( కాదు. నీ అధీనమైన నా జీవితం అని రతి అనటం వైశిష్ట్యం. స్త్రీ త( పురుషుడికి అధీనంగా చేసుకొన్న జీవితం కలిగింది కావటం—అత్యుత్తమ దాంపత్య సౌందర్యం.

రతి మన్మథుణ్ణి జీవిత నాథుడని భావించింది. అతని అధీనమయిన జీవితం కలిగిండి అయింది. అందువల్లనే . . .

'హృదయే వససి'

హృదయమందు కాపురమున్నావు . అని మన్మథునిచేత గౌరవింపబడింది. మన్మథుని హృదయంలో హృదయమయింది. ఇప్పుడు ఆ హృదయానికి ఆ హృదయమే జీవితనాథత్వం కలిగివుంది. ఆ హృదయానికి ఆ హృదయమే

అధీనజీవితం కలిగింది అయింది. పురుషుడి హృదయంలో వసించే రతి, ఆ స్త్రీ ప్రాణం అధీనం చేసుకొని పాలించే మన్మథుడు అన్యోన్యాశ్రితులయి, అవినాభావ సంబంధంతో ఏకమయినస్థితిలో అద్వైతమేకాని, ద్వైత మెక్కణ్ణుంచి వస్తుంది. ఈ స్థితిలో...

'మదనేన వినా రతిః క్షణమాత్రం కిల జీవితా' మదనుడు లేకుండా క్షణ మాత్రమయినా రతి జీవించివుందికదా అనేనింద నాకువద్దు అని ఆమె వాపోయింది. ఈ పరిదేవనంలో మన్మథునితో అద్వైతమయిన తనకు ద్వైతం సిద్ధించటం భరించలేకపోయింది. జీవించినా మరణించినా స్త్రీకి భర్తతోనే అస్తిత్వం అన్న సందేశం వినిపిస్తుంది.

స్త్రీ జీవిత నాథుడయిన పురుషుడు, తన అధీనంలో ఆమె జీవితం దాచు కొన్నవాడు, ఆమెను తన హృదయంలో నిలుపుకొన్నవాడు గతిస్తే, తనతోనే ఆమె గతించినట్లు భావింపబడాలని అందువల్ల తనుగతించినట్లే రతి తలంచింది. స్త్రీ పురుష విషయికమయిన, శృంగార సంబంధమయిన, దాంపత్య విషయికమయిన, ఈ అద్వైతం, ఈ ఏకత్వం విశిష్ట సౌందర్యం, సౌందర్య పరాంకోటి.

స్త్రీ బాహిరాంతర సౌందర్యాలతో వాంఛించిన వాల్లభ్యంతో ఐక్యమై, భిన్నతను కోల్పోయి, అద్వైతంపొందితే కలిగిన సంతానం తారకాసుర సంహార సమర్థమయిన కుమారస్వామి యంతటి ఉత్తమస్థితి పొందుతుంది.

'కుమారసంభవ' కావ్యంలో కాళిదాసు ప్రతిపాదించిన ఈ వాల్లభ్య సౌందర్యం, నిరంతరం, శాశ్వతం, వాంఛనీయం, ధార్మికం అయిన మానవ తేజస్సు ప్రతిబించిన ఆదర్శం.

[ఆకాశవాణి, హైదరాబాద్ '65].

# అవతారిక

అవతారిక లక్షణములు స్థూలముగా గమనించుటకే ప్రయత్నముద్దిష్టము. ఆధునిక యుగ సాహిత్యమునకు పూర్వము ప్రవర్తిల్లిన పురాణ ప్రబంధాది కావ్యములలో అవతారికలు ప్రపంచితములు. ఆంధ్రభాషా స్రవంతి పుట్టుకకు స్థానము మహిమాన్విత సంస్కృత హిమాలయమని విజ్ఞులలో కొందరి యూహ! అది అవాస్తవమని సంస్కృత సాహచర్యముతో తెనుగు భాష సుసంపన్నమయి విస్తరిల్లినదనుట వాస్తవమనువారును సంస్కృత కావ్యాలలో అవతారికలు లేకపోవుటవలన, ఈ అవతారిక రచనము ఆంధ్ర సాహిత్యములో నూత్నదశ అనియు, ఇది స్వతస్సిద్ధమనియు, దేశతత్త్వ నిరూపకమనియు, తెలుగు సంస్కృత జన్యముకాదనుటకొక యంశమనియు పలుకవచ్చును. ఆంధ్రేతర ద్రావిడభాషలలో అవతారికలు నాతి ప్రస్ఫుటములు.

సంస్కృత నాటక సంప్రదాయములో నాంది, ప్రస్తావనలు అతి విస్తృతములు. వానిలో నిష్టదేవతాస్తుతి యుండును. సూత్రధారుడు నటి సంభాషణములో నాటక ప్రశస్తి, ప్రసక్తి. నాటకకవి (కాల) నామ వంశ సంబంధిత్వాది ప్రశంసనము, కథా పరిచయము ఋతువర్ణనము, పాత్ర ప్రవేశ సూచనము మున్నగునవి యుండును. ఏతత్కారణమున ఆంధ్ర కావ్యావతారికలను, సంస్కృత నాటక నాంది ప్రస్తావనల ప్రసక్త విషయము రూపాంతరమున ఉపయోగపడినదని భావించునవకాశము లేకపోలేదు. కాని, నాంది ప్రస్తావనల రూపము వేరు. అవతారికల ఆకారము వేరు. రెండును రెండు త్రోవలలో అందాల అలంకారాలు. కాగా ఏ ప్రభావ ప్రమేయములేని ఆంధ్రావతారికలు తెనుగు సాహిత్య ప్రత్యేకతా ప్రదర్శకములు.

వాగనుశాసనుడైన నన్నయ ఆంధ్రీకరించిన భారతము తెలుగులో ఆది కావ్యము. నన్నయ ఆదికవి. ఆదికవి రచించిన ఆదికావ్యము అనువాదము. అది అటుంచి ఆదికావ్యములో ఆద్యము దేవతాస్తుతి. అది సంస్కృత శ్లోకము. సంస్కృత నాటక నాంది శ్లోకము, నియమబద్ధ రచనము, దేవతా

స్తుతి సమన్వితము. నన్నయ ప్రారంభ శ్లోకము మార్గ సంప్రదాయ నాటక నాందిని స్ఫురింపజేయుచున్నది.

## కృతిపతి వంశవర్ణనము – ఒక సూచన:

నన్నయ భారతావతారికలో దేవతాస్తుత్యనంతరము కృతిపతి వంశ వర్ణనమున్నది. ఆపైననే నన్నయ జీవిత విశేషములు ప్రసక్తములు. ఆంధ్ర కావ్యము లన్నింటియందును కృతిపతి వంశవర్ణనము సర్వసాధారణము. కృతిపతి ప్రసక్తితోపాటు కృతికర్త వంశవిశేషములు పెరిగినవి. అవతారికలలో నున్న ఇతర లక్షణముల మాట కాదుగాని, కృతిపతి వంశవర్ణనము తలచిన అవతారికలు ఇందుకొరకే ఉద్దిష్టములాయని ఆశంకకలుగుట సహజమే! ఎందువలననగా ఆ వర్ణన మంత దీర్ఘము. దీనికి కారణమూహ్యము.

కృతిపతి సాధారణముగా రాజు. రాజు అధికారి. ధనాధిపతి. కృతికర్త సాధారణముగా బీదవాడు. అధికారము రాజువలె లేనివాడు. ప్రతిఫలాపేక్ష లేనిపని ప్రపంచములోనే ప్రాణియు చేయదు. కావ్యఫలముతో జీవితమును వెళ్లబుచ్చు ప్రయత్నము చేయువాడు కవి. పారమార్థిక ప్రయత్నమిట అప్రసక్తము. రాజు కవికి అగ్రహారమొ, హారమొ, ఊరక ఎందుకిచ్చును? కవిత చెప్పినందుకు అన్నచో నెందరో కవిత చెప్పిరికదా అని ప్రశ్నముదయించును. వారిని బహూకరించని రాజు ఈ ప్రత్యేక కవినే ఎందుకు పోషించెను? తన వంశవర్ణనము, తన వర్ణనము చేసెను గనుక పోషించెను. ఎందరు కవులీపని చేసిన నందరినీ పోషించెను.

రాజు పోషించెడివాడు. కవి కృతిపతి వంశవర్ణనము రాజు గుణకీర్తనము చేసెడివాడు. ఈ వర్ణనము స్తుతిరూపముగా ప్రారంభములో ఈషన్మాత్రము. తదనంతరము విస్తృతము. ఆంధ్ర కావ్య ప్రపంచములోని ఈ అవతారికలు రాజుల, కవుల మధ్య వర్తిల్లిన ఆర్థిక, హార్దిక సంబంధములకు ప్రతీకలు, రాజ్య, కవితా విషయముల అధికారౌన్నత్యములకు పతాకలు.

ఏది ఏమయినను, ఆంధ్రజాతి చరిత్రకాని, ఆంధ్ర కవుల చరిత్రకాని స్పష్టముగా నిర్ణయించుటకు మార్గాంతరములు మృగ్యములయినప్పుడు అవతారికలుపాదేయములు. అవతారికలు లేకపోయినచో జాతి చరిత్ర విషయము నందును, సాహిత్య చరిత్ర సంగతియందును అంధయుగము అవిభాజ్యముగా కొనసాగుచుండెడిదనుమాట వాస్తవమే కదా!

## ఇష్టదేవతా స్తుతి :

కృతిపతి వంశవర్ణనమె కాక, అవతారికలలోని విశేషములు పరిశీలనార్హములు. అవతారికారంభములో ఇష్టదేవతా స్తుతి ఉభయతారక ధర్మము. కవుల కరాల రామణీయకమో, గంటాల కమనీయతయో తెలియదు కాని, దేవతలవర్ణన సందర్భమునకు వీరికి శృంగార విషయమైన తలంపు పోదు. అది కాల మాహాత్మ్యమో, అభిరుచి ఆంతర్యమో అనవగాహము.

దేవతాస్తుతి సంస్కృత కావ్యకోటియందును కావ్యారంభమున తప్పనిసరి, ఆంధ్ర కావ్యాలలోను అది ప్రసిద్ధమే! మగణము మంగళ ప్రదమగుటవలన కావ్యారంభ పద్యము మగణ యుక్తముగానుండుట సంస్కృతాంధ్ర సంప్రదాయ సామాన్య మయినది. ఇష్టదేవతాస్తుతిలో సంగీత సాహిత్య సరస్వతికి ప్రథమ తాంబూలము — కాకున్న — అధిక గౌరవము నిర్ణీత మయినది. ఏ కవి ఏ దేవతనయిన స్తుతింపకపోవచ్చును కాని, సరస్వతి స్తుతి మాత్రము సర్వకవి సమూహముచేత ఆచరింపబడుట యుచితమే.

హరిహర హిరణ్యగర్భ పద్మోమావాణీపతుల స్తుతియు, గజాననుని షడాస్య, సరస్వతి, పార్వతి స్తుతి నన్నయ భారతావతారికలో గలదు. నన్నెచోడుని కుమారసంభవమునందును శివుడు, విష్ణువు, బ్రహ్మ, జనగణ నాథుడు, షణ్ముఖుడు మొదలగు వారి స్తుతి కలదు. ఇట్లే ఇతరాంధ్ర కావ్యములయందును ఇష్టదేవతాస్తుతి యున్నది. త్రిమూర్తుల స్తుతి, సరస్వతీ లక్ష్మీ పార్వతుల స్తుతి, విఘ్నేశ్వర స్తుతి ఇష్టదేవతా స్తుతియందలి సారాంశ ముగా చెప్పవచ్చును. ఈ స్తుతి కావ్యరచనము నిర్విఘ్నముగా జరుగుటకు, సృష్టి స్థితిలయకారులయిన త్రిమూర్తులు వారి సతులు, అనగా సతీసమేతు లయిన త్రిమూర్తులు కావ్య కన్యకావిర్భావమునకు దోహదము చేయుదురు గాక యని కవిచేయు ఆకాంక్ష ధర్మసమ్మతమే కదా!

భారతమునందు ఇష్టదేవతా స్తుతి విశాలము కాదు. కుమార సంభవమునందు లక్ష్మీస్తుతి లేదు. సూర్యస్తుతి యున్నది. మనుచరిత్రలో లక్ష్మీస్తుతి లేదు. పార్వతిస్తుతి యున్నది. వసుచరిత్రలో పార్వతిస్తుతి ప్రత్యేకముగా లేదు. ఆంజనేయ స్తుతి యున్నది. భాగవతమున దుర్గస్తుతి యున్నది. కాలక్రమ మున అవతారికాభాగముగా పార్వతి స్తుతి నిలచిపోయినది.

ఇష్టదేవతాస్తుతి అవతారికలలో ఆవిర్భవించుటకు కవ్యుద్దేశము కావ్య రచనము నిర్విఘ్నముగా సాగవలయునని కావచ్చును. కాని కాలక్రమమున

ఇష్టదేవతాస్తుతి కవికిని, కావ్యమునకును శుభము కలిగింపవలయుననను ఉద్దేశముతో కాక, కృతిపతికి సమస్తైశ్వర్యములు దీర్ఘాయురారోగ్య సంపాదనమునకు ఉద్దిష్టము. కృతిపతి కృతికర్తకు పోషకుడు గనుక, కృతిపతి సర్వసుఖాలతో, శుభాలతో నున్నప్పుడే కవికి కావ్యరచనమునకు నిర్విఘ్నత. కనుక కావ్యరచనమునకు నిర్విఘ్నత, ఇష్టదేవతాస్తుతి రూపములో, కోరినను, కృతిపతికి శ్రేయము కోరినను పిండితార్థము కావ్యనిర్విఘ్నతయే! నన్నయాదులు కావ్యనిర్విఘ్నతకు, పెద్దనాదులు కృతిపతి శ్రేయమునకు ఇష్టదేవతాస్తుతి చేసి, నిర్విఘ్న కావ్యరచనము కాంక్షచేసిరి.

## గురుస్తుతి:

విద్యాదాతయయిన గురువును కావ్యారంభ శుభసమయములో స్తుతించుట సత్సంప్రదాయము. నన్నెచోడుడు గురువగు జంగమ మల్లికార్జునుని స్తుతించెను. నన్నెచోడునకు గురువు ఇష్టదైవము. పెద్దన గురువగు శఠకోప యతిని స్తుతించెను. నన్నయ సహాధ్యాయియయిన నారాయణభట్టు ప్రశంస చేసెను.

## కృతిపతిత్వము:

కృతిపతిత్వమున రెండు విభిన్న ధోరణులు అవతారికలవలన అభివ్యక్తమగుచున్నవి. రాజాశ్రయముపొంది కావ్యరచనముచేసి రాజును తన కృతికి పతిని కావించుట ఒక రీతి. మనుజేశ్వరాధములకు కావ్య మంకితము చేయరాదని భగవంతుని కృతిపతిగాజేయుట ఇంకొక రీతి. రెండును రెండు ధ్రువాలు, విభిన్నాలు. తారతమ్య నిరూపణము అవసరమే!

## సుకవిస్తుతి:

సుకవిస్తుతి ఆంధ్ర కావ్యావతారికలలో నున్నది. కావ్యరచనచేసి, లబ్ధప్రతిష్ఠుడైన కవి కావ్యము, కవితాలోకములో కాలిడిన పథికునకుపాదేయము. అందుకొరకే కవులు తత్పూర్వ కవుల స్తుతించుట, లేక పేర్కొనుట ఆరంభమయినదనవచ్చును. కావ్యరచనా విధానములో పూర్వ కవి మార్గములో కవనమారంభించు కవి పూర్వకవి స్తుతిచేయుట యుచితమే! కాని భాషను వ్యాకరించిన మనీషి, గాసటబీసటగానున్న భాషకు దారిచూపిన మహోద్ధరుడు ఆదికవి ఏ పూర్వకవిని స్తుతింపగలడు? ప్రత్యేక వ్యక్తిత్వము, ప్రత్యేక వైశిష్ట్యమున్న నన్నయ పూర్వకవి స్తుతి చేయలేదు.

ఆంధ్ర కావ్యావతారికలలో సంస్కృత కవులు స్తుతి పాత్రులైరి. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి, మాఘుడు, మయూరుడు, భారవి ఆదిగాగల కవులు ఆంధ్ర సుకవిస్తుతిని పొందిరి. కవిత్రయమును, అర్వాచీనాంధ్రకవులు, కవిత్రయమునుండి ప్రబంధకవులవరకున్న వీరిని, తదనంతర కవులు స్తుతించిరి.

నన్నయ భారతావతారికలో సంస్కృత కవి స్తుతిలేదు. కుమార సంభవావతారికలో భవభూతి, మాఘుడు, మయూరుడు స్తుతింపబడలేదు. కాశ్మీరదేశ పండితుడు—ఉద్భటుడు—స్తుతింపబడెను. నన్నయ స్తుతి లేకపోవుట గమనార్హము. భాగవతమున శుకయోగి నుతింపబడెను. ఎఱ్ఱన ప్రశంసలేదు. మనుచరిత్రావతారికలో వాల్మీకి వ్యాసులును, కవిత్రయమును నుతింపబడిరి. వసుచరిత్రలో దండి స్తుతింపబడెను. ఎఱ్ఱన ప్రశంసలేదు. కాని, శ్రీనాథుడు, సోముడు, భాస్కరుడు స్తుతింపబడిరి. అర్వాచీనకవులు, కవిత్రయములోని ఎఱ్ఱనను చిన్నచూపు చూచిరి.

## కుకవి నింద:

కుకవుల నింద ఆంధ్ర కావ్యావతారికలలో ఒక అవశ్య సన్నివేశము. ఆత్మస్తుతి, ఆత్మనింద, పరస్తుతి పరనింద పనికిరావని ధర్మఘోష. ఆత్మస్తుతి స్వశక్తి నిరోధకము. క్వాచిత్కముగా స్వశక్తిపోషకము. ఆత్మనింద స్వధర్మ బాధకము. ఎడనెడ స్వసర్మ ప్రేరకము. పరస్తుతి ఆత్మ ప్రలోభ ప్రదర్శకము. అప్పుడప్పుడు లాభదాయకము. పరనింద ప్రమాదకారకము. అడపతడప ప్రయోజన ద్యోతకము. ఏమయినను స్థూలముగా ఆత్మస్తుతినిందలు, పరస్తుతినిందలు అనుచితములు. కుకవి నింద పరనిందతుల్యము. తుల్యమన నేల! పరనిందయె! నిందింపబడినవాడు ఎమ్మెకానలేని నిర్భాగ్యుడైనచో నిందించువానికి స్వేచ్ఛ. నిందితుడు గతజీవియయిన మరి యధికముగా స్వాతంత్ర్యము. నిందింపబడినవాడు బ్రతికియున్నచో, దోషసహిత కావ్య కర్త కనుక తలెత్తలేడు, మాటాడలేడు. బ్రతికియున్న కుకవి బాగోగులు పట్టించుకొను ఓపిక ప్రజలకుండనవసరములేదు. గతించిన కవి కుకవి యయిన గుర్తుంచుకొను నావశ్యకమును సున్న. ఆయా యనేక కారణముల ఏకరూపము కుకవి నింద. అది నిరాఘాటము.

ఇతరులను కుకవులనుటవలన, తను సుకవి యగునను నమ్మకముతో కవులు చిత్రవిచిత్రముగా నిందా జైత్రయాత్ర సాగించిరి. కుకవి నిందలో ఆ

కుకవి పేరు చెప్పక నిందించుట అక్రమములోని క్రమత. కుకవి నిందవలన, తమ కవితాధర్మములను భంగ్యంతరముగా పరోక్షముగా కవులు తెలిపిరి ప్రతిభాశాలియయిన కవి ఆత్మస్తుతికాని, పరనిందకాని—స్వకవితా ధర్మస్తుతి కాని, పర కవితాధర్మనిందకాని—చేయనక్కరలేదనుట ఉచితమే! లెక్కకు రాని కావ్యజాలములో తన గ్రంథము కలసిపోవునేమోయను భయముతో మరియొక కవికంటే కావ్యముకంటే, తను, తన కావ్యము ఆధిక్యమును కలిగి యున్నట్లు భ్రమపడుటకు బుద్ధిపూర్వకముగా చేయు ప్రయత్నము, ఆత్మ వంచన, అవధ్యతిక్రమణ, కుకవి నింద.

నన్నయ పరస్తుతికాని పరనిందకాని చేయలేదు. నన్నెచోడుడు మార్గ కవులను, సుకవికృతులలో తప్పులెన్ను కుకవులను, రసగ్రహణ పారీణులు గాని పాఠకులను కవితా విశేషములు తెలియని యజ్ఞులను నిందించెను. పోతన ఎవరిని నిందింపలేదు. భట్టుమూర్తి, పెద్దనలు కుకవిని నిందించిరి. ఆంధ్ర కావ్యావతారికలలో కుకవి నిరసనము బహుళము.

## కావ్యరచన హేతువు:

అవతారికలలో మరియొక విశేషము కావ్యరచనహేతువు నుగ్గడించుట. ఈ హేతువు ద్వివిధములుగా నున్నది. స్థూలముగా కావ్యరచనమునకు కారకులు రాజు, భగవంతుడు. విష్ణువుకానివాడు పృథివీపతి కాలేడన్నది అంగీకరించినచో, భగవంతుడు కావ్యరచనకారకుడు. అప్పుడు భగవంతుడు ప్రత్యక్షముగా—అనగా ఏ అవతారరూపములోనో, పరోక్షముగా—అనగా ఏ రాజు రూపములోనో కావ్యరచనమునకు ప్రోత్సాహము నిచ్చువాడగు చున్నాడు.

రాజు కవిని ఆస్థానమునకు పిలపించి, కావ్యధోరణి వివరించి రచన చేయుమని కోరుట యొక పద్ధతి. భగవంతుడు, కవి నిద్రయందుండగనో, కవితా తపస్సముద్రములో మునిగియుండగనో ప్రత్యక్షమై కావ్యరచనా ప్రోత్సాహమిచ్చి ఆ కావ్యము తనకు అంకితము చేయుమని కోరుట మరియొక పద్ధతి. ఏది ఏమయినను రాజు అయినను, భగవంతుడయినను కవిని కావ్య రచన చేయుమనుట, అంకితమిమ్మని యర్థించుట సర్వకావ్య సామాన్యముగా గోచరించుచున్నది.

నేటి కవులను కొందరిని చూచియయినను, నాటి కవులు అనేకులు రాజాశ్రయముకొరకు యత్నించిన తీరుతెన్నులు గమనించియయినను, అర్థించిన

దెవకో ఆలోచించి చూడవలసిన అవసరమున్నట్లు గోచరించుచున్నది. రాజో భగవంతుడో అర్థించెననుటకంటే, కవి అర్థించెననుటే బహూచితముగా తోచును. కవి తన కావ్యమును తీసికొని రాజునొద్దకు పోయి, ఇది నా కావ్యము మీరు విని నచ్చినచో, అంకితముకొని నాకు ఆర్థికదోహదము చేయుమనుటయే తగినట్లుగా భావింపబడుచున్నది. రాజు అరసికుడయినను, కావ్యాంకిత మక్కరలేనివాడయిన మరియొక రాజును అర్థించుట జరుగ వచ్చును రాజులెవరు కావ్యాంకిత కాంక్ష చేయనప్పుడు తత్కావ్యము దైవాంకితము చేయుట సామాన్యకవుల విషయముల సత్యముకానగును.

నన్నయను, రాజరాజనరేంద్రుడు భారత మాంధ్రీకరింపుమనియే కోరి యుండవచ్చును. తిక్కనకు, మతసామరస్యము కోరు మానసిక కల్లోల స్థితిలో కలలో శివకేశవులు ఒక్కమూర్తిగా కనిపించియే యుండవచ్చును. కాని ఆపైన వెలసిన అన్ని ఆంధ్రకావ్యముల కర్తలకు కలలో దేవుడు కనిపించు టయో, రాజు కావ్యరచన చేయుమని ప్రార్థించుటయో, జరిగెనన్నచో ఆలోచింపవలసియే యుండును.

నన్నెచోడుడీ రెండు పద్ధతులలో నేదియు నవలంబింపలేదు. పోతనకు రామభద్రుండు కలలో ప్రత్యక్షమై, 'మన్నామాంకితంబుగా శ్రీ మహా భాగవతంబుఁ దెనుంగు సేయుము. నీకు భవబంధంబులుఁ దెగు' నని అరసున్న లతో గసడదవ సరళాదేశములతో ఆనతియిచ్చెను. వసుచరిత్రావతారికలో తిరుమలరాయ ప్రభువు భట్టుమూర్తిని కావ్యము రచింపుమని కోరినట్లుగలదు. శ్రీ కృష్ణదేవరాయలు పెద్దనను శిరీష కుసుమ పేశల సుధామయోక్తులకావ్యము వ్రాయుమని కోరినట్లు మనుచరిత్రావతారిక తెలుపుచున్నది.

ఆదికవుల మాట అటుంచి, అనంతర కవుల విషయములో ఈ కావ్యరచన హేతువులగూర్చి పరిశీలించినచో ఈ కవులందరును సంప్రదాయబద్ధులనిపించును. ఆదికవుల అనుభవము అనంతరకవులకు సంప్రదాయమయినది. ఈ కావ్యరచన హేతువులు ఆదినుండి ఆధునిక యుగమువరకు సంప్రదాయానుసారుల అవతారికలలో రెండువిధములుగనే సాగుచు వచ్చినవి. సంప్రదాయ తిరస్కార సముచిత బుద్ధులకు ఆధునికకవులు అవాస్తవముగా—చారిత్రకముగా మానసికముగా—ఈ కావ్యరచన హేతువులు భావించి, వానిని త్యజించుటయే కాక, నూత్న కావ్యరచనహేతువుల నన్వేషించుట ప్రారంభించిరి.

## కథాసూచన:

అవతారికలలో తత్కావ్య కథా సూచనముండుట మఱియొకయంశము. సంస్కృత నాటక నాందీప్రస్తావనలయందు కథా సూచనమున్నట్లు అవతారికలో కావ్యకథా ఘట్టములు స్థూలముగా దెలుపుట సామాన్యమయినది.

నన్నయ భారతమున కథాప్రస్తావన అవతారికానంతరము గలదు. నన్నెచోడ కుమారసంభవమునందు షష్ఠ్యంతముల తరువాత కథయందలి ముఖ్య భాగములు చెప్పబడినవి. శ్రీ మహాభాగవతమునందును కుమారసంభవములో చెప్పబడినట్లే యున్నది. కథ స్వల్పమయిన ప్రబంధాదులయందు క్వాచిత్కముగా, కథ అధికమగు పురాణాదులయందు విస్తృతముగా కథా సూచన ముండుట గమనార్హము.

## షష్ఠ్యంతములు:

ప్రత్యవతారికయందును షష్ఠ్యంతములు, ఏ సువిశేషమున్నను లేకున్నను, ఉండును. షష్ఠ్యంతమనగా షష్ఠీవిభక్తి ప్రత్యయము అంతిమందుగలది. షష్ఠ్యంతము పద్యరూపము, భక్తిపూర్వకము, గౌరవపూర్వకము అయి యుండును. ఆంధ్ర కావ్యావతారికాంతర్భూతషష్ఠ్యంత రచనావిధానమే ఉదాహరణ వాఙ్మయమునకు బీజమని తోచుచున్నది.

సంస్కృతమున చతుర్థ్యంతరూపమునకు సమానముగా ఆంధ్రమున షష్ఠ్యంత విధాన మారంభమయి యుండవచ్చును. సంస్కృతమున చతుర్థ్యంతము సమష్టికి సమన్వయము. సమష్టినుండి వ్యష్టిని చేరుచున్నది. గ్రహింపబడుచున్నది. ఆంధ్రమున షష్ఠ్యంతము వ్యష్టికి సమన్వయము. వ్యష్టినుండి సమష్టిని చేరుచున్నది. గ్రహింపబడుచున్నది. సంస్కృతమున సమష్టి ఆంధ్రమున వ్యష్టి, జీవితములోవలె, సాహిత్యమున ప్రతిబింబించినవి.

నన్నయ భారతావతారికలో తప్ప, కుమారసంభవ, శ్రీ మహాభాగవత, మను, వసు చరిత్రల యవతారికలన్నిటియందును షష్ఠ్యంతములున్నవి.

## కవితాధర్మములు:

కవులు, అవతారికలో కవితాధర్మములను, కవిత్వముపై తమ అభిప్రాయములను తెలుపుట కలదు. కవులందరును ప్రత్యక్షముగనో పరోక్షముగనో తమ కవితాధర్మములను వెల్లడించుచునే వచ్చిరి. త్రికాలాబాధితములయిన, సర్వకవిజన సమ్మతమయిన ధర్మములు ప్రతిపాదింపబడకపోలేదు.

నన్నయ తననుతాను నానారుచిరార్థసూక్తినిధి యని తెలుపుకొనెను. ప్రసన్న కథాకవితార్థయుక్తితో అక్షరరమ్యతతో తన కవితనుగూర్చి చెప్పెను. నిర్వచనోత్తర రామాయణములో కవితాధర్మములు చెప్పికొనిన తిక్కనలోని ఔద్ధత్యము సోమయాజియై భారత రచనాకాలములో మానసికస్థితికి అనుకూలముగా అలతి యలతి పదములతో కాహళి సంధించినరీతిగా, 'నా నేర్చిన భంగిచెప్పి వరణీయుడనయ్యెద భక్తకోటికి' ననెడి విధముగా పలుకులతో తగ్గి సౌమనస్యస్థితి ఏర్పడి కవితాధర్మ నిరూపణము జరిగినది. మార్గదేశి కవితావిభేదములు చెప్పి, తన కవిత్వము దేశియని, మార్గకవితను నిరసించి, వస్తుకావ్యమునెడ ప్రీతి చూపి, భావములు సరళములుగా నుండవలయుననియు, అష్టాదశవర్ణనలు అలంకారయుతముగానుండి, నవరసములు కావ్యమున కలుగవలయుననియు, నన్నెచోడుడు కుమారసంభవావతారికలో తెలిపెను. కవులందరును తమ కవితావైశిష్ట్యమును తెలిపికొను యత్నము చేసిరి.

## కృతికర్త, కృతిభర్త:

కృతి కన్య. కృతికర్త తండ్రి. కృతిపతి భర్త. నన్నయ్య తండ్రిగా యుండి కుమార్తెను రాజరాజ నరేంద్రునికిచ్చి ఆదర్శ వివాహము జరిపించెను. 'కుమారసంభవము'నకు జంగమ మల్లికార్జునుడు భర్తయయ్యెను. కృతిభర్తలు సాధారణముగా దేవుడు కానిపక్షములో రాజులు. మహమ్మదీయ ప్రభువులును కృతిభర్తలగుట గమనార్హము.

కవి స్వవిషయముకన్నను కృతిభర్త వంశవర్ణనము అడ్డుమాకలు లేకసాగిన విశేషము, కృతిభర్తవంశము, జీవితము, వ్యక్తిత్వము, ఆస్థానము ఇత్యాది ప్రసక్తి గోరంతలు కొండంతలు. ఎడనెడ కవి జీవితాదులును తత్తుల్యములు.

భారతావతారికలో రాజరాజనరేంద్రుని స్వరూపస్వభావములు సాక్షాత్కారమగునట్లుగా చెప్పబడినది. నన్నయ దినచర్య, ఆస్థానములో స్థానము, వ్యక్తిత్వము మున్నగునవి తెలుపబడినవి. కుమారసంభవములో నన్నెచోడుని కులగోత్రములు, రాజ్యపాలనము వంశవర్ణనము గలవు. కృతిపతి జంగమ మల్లికార్జునుని వంశవర్ణనము లేదు. భాగవతమునందు పోతన వంశవర్ణనము మాత్రమే కలదు. మనువసు చరిత్రాదులలో రాజు వంశవర్ణనమే సుదీర్ఘముగా సాగినది. తదనంతర కావ్య ప్రపంచమున అధికముగా కృతిపతి అల్పముగా కృతికర్త విషయములు విస్తృతములు. ఏవంశ విధమయిన వర్ణనము క్రమ

క్రమముగా సంప్రదాయమయినది. ఈ వర్ణనములు దేశ చరిత్రమునకు, కవి చరిత్రమునకు ఉపయుక్తమయినవనునంశము మేలుగా స్వీకరింపబడినను, పరస్తుతి, ఆత్మస్తుతి గోచరించి, జాతికి వ్యవస్థయున్నచో, ఈపక్షాత్రా వధ్యతిక్రమణముగా, అవ్యవస్థయున్నచో పరిహార్యముగా, భావింపబడును.

ఐహికమును, ఆముష్మికమును అయిన ధర్మరూపములెరిగిన ఆంధ్ర కవులు ఆ క్రమమునే పాటించిరి. రాజును ఇంద్రుడు చంద్రుడు అని స్తుతించుటలో ధర్మద్వయ నిర్వహణమును భావించిరి. తన ఔన్నత్యము తాను తెలపోయుటలో వాస్తవము వ్యక్తము కాదనియు, అభిమానదూషితమయిన కృతిపతి వంశవర్ణనము ఏతత్కాల ప్రయోజనకారియు, అనంతరకాలమున అంతగా ప్రయోజనముండునది కాదనియు కవులు భావించినట్లు గోచరముకాదు.

ఈ ప్రయత్నము ఆంధ్ర కావ్యావతారికలలోని భిన్న విశేషములకు దిక్ ప్రదర్శనము. అవతారికలపై సంస్కృత ప్రభావము బహ్వల్పము లేదన్నను దోషములేదు. ఆంధ్ర సాహితీ ప్రత్యేకతకిది పరమ నిదర్శనము. చారిత్రక దృష్టితోనిది మిక్కిలి వాంఛనీయము. జాతి వ్యక్తిత్వ దృక్పథములోనిది అవశ్యాలోచనీయము. అధునాతనాంధ్ర కావ్య సమూహములో నీ యవతారికలు చ్యుతమగుట సంఘము పొందిన పరిణామచైతన్య ప్రదర్శకము.

(ఆంధ్ర క్రైస్తవ కళాశాలా పత్రిక' 59)

# అమరావతీ ప్రాశస్త్యం

అమరావతి అతి ప్రాచీనమయిన పుణ్యక్షేత్రం. ఇది గుంటూరు ఉత్తరంగా కృష్ణాతీరంలో శిథిల సమూహం. శాతవాహనుల కాలంనుంచి అమరావతి ప్రసక్తి చరిత్రలో ప్రస్ఫుటమవుతుంది. ఆంధ్రుల గర కారణంగా రాజధాని అయి విలసిల్లింది. ఆనాడు ఆంధ్రదేశం స్వర్గంగానూ అమరావతి ముఖ్యపట్టణంగానూ ఉండేవి. కర్మకారులు కమక రాష్ట్ర పేరుతో శాతవాహనులకు సామంతరాజులుగా ఉండి ఆంధ్రదేశం పాలించిన దినాలలో వేల్లగిరీ స్తూపాలతో పాటు అమరావతిలో బౌద్ధశిల్ప ఆధిక్యాన్ని ఆర్జించింది.

కృష్ణానదిలో స్నానం, అమరేశ్వరస్వామి పూజ, బౌద్ధస్తూపాలు దర్శించటం అమరావతిలో ప్రత్యేకతలు. కాశీకివెళ్లి గంగలో స్నానంచేసి పూజలు జరిపితే కలిగేపుణ్యం, కృష్ణలో స్నానంచేసి దీపారాధనచేస్తే కలుగు తుందని ఇక్కడివారు భావిస్తూ ఉంటారు.

కృష్ణానది నిండుగా, గంభీరంగా ఒడ్డులు తాకుతూ ప్రవహిస్తున్నప్పుడు నౌకావిహారం హృదయంలో ఉల్లాసమూ, మనస్సులో భక్తీ రెంటినీ కలిగిస్తుంది. ఆ ప్రాంతంలో కృష్ణ కోపతాపాలకు అవకాశంలేదు. పడవ మీద నడి ఏటిలోపోయి, క్షేత్ర ప్రాకారాలవైపు చూస్తే కలిగే ఆనందమూ, మంజుల మానసంలో తృప్తీ స్వచ్ఛంగా ఉంటాయి. పడవ షికారు తరువాత స్నానంచేసి తడిబట్టలతో దేవదర్శనం చేసుకొని ప్రతి ప్రాకారంలోనూ ఉన్న ఇతరేతర దైవసందర్శనం ముగించుకుంటారు యాత్రికులు.

బౌద్ధ స్తూపాలు అమరేశ్వర దేవాలయానికి కొంచెం దూరంగా ఉంటాయి. వాటిని దర్శించటం ఉత్సాహంగా ఉంటుంది. స్తూప నిర్మాణంలో ఉన్న శిల్పకళ జగత్తుకు భిక్షపెట్టినస్థితి స్పష్టంగా కనబడుతూ ఉంటుంది. ఆ శిల్పాల పుట్టు పూర్వోత్తరాలు, వెలుగులోకి, ఎలావచ్చింది తెలుసుకోవాలని కోర్కె కలుగుతుంది.

## చరిత్ర:

రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అమరావతిని రాజధాని చేసుకున్న తర్వాత జనం ఇళ్లు కట్టించుకోవటానికి రాళ్లు కావలసి పురాతనమయిన దిబ్బలు అనుకోకుండా త్రవ్వించటంతో 'దీపాలదిన్నె' వెలుతురులోకి వచ్చింది. దీనితో బౌద్ధ స్తూపం శతాబ్దాల తరబడి మరుగు పడింది. త్రవ్వినవాళ్లకు దాని విలువ తెలియకపోవడంతో చాలా భాగం దుర్వినియోగం అయింది.

మెకంజీ (1797) ఆ శిల్పాలుచూచి, విలువ గుర్తించి, పత్రికలలో వ్యాసాలు వ్రాసి, ప్రాచుర్యం ప్రసాదించాడు. అప్పటినుండి వాటి అభివృద్ధి ప్రారంభమయింది. అంతటితో శిల్పకళ చిందులాడుతూ ఉండే రాళ్లు కొన్ని కలకత్తా చేరాయి. మరికొన్ని మచిలీపట్టణం వెళ్లాయి. మద్రాసుపోయిన శిల్పాలలో కొన్ని ఇంగ్లాడు, ఆపైన అమెరికా ప్రయాణం చేశాయి. ఆ శిల్పాల తీరుచూచి ఫెర్గుసన్ అనే ప్రఖ్యాత చరిత్రకారుడు, విమర్శకుడు వ్రాసి ప్రచురించిన గ్రంథంతో అమరావతి శిల్పకళకు ప్రపంచ ఖ్యాతి లభ్యమయింది. బౌద్ధాంధ్ర శిల్ప చక్రవర్తుల మతదృష్టివల్లనే కాక కళాసృష్టివల్ల మాత్రమే వాళ్ల శిల్పాలకు విశ్వవిఖ్యాతి కలిగింది.

## స్తూప స్వరూపం:

ఇప్పుడు అమరావతిలో ఉన్న స్తూపం ఉత్తమ కళాభాగాలు పోగా మిగిలిన స్వరూపం. దీనిని మెకంజీ పునర్నిర్మించాడు. స్తూపం పాలరాతి కట్టడం. ప్రాచీనతా శిల్పప్రశస్తి తెలియని వెంకటాద్రి నాయుడు పని మనుష్యులు, పాలరాళ్లను పగలగొట్టి కాల్చి సున్నం చేసుకొన్నారని వదంతి, స్తూపంమీద ఉన్న బొమ్మలు ఆధారం చేసుకొని ఆనాటి ఆంధ్రుల వస్త్రాలు, ఆభరణాలు, అలంకారాలు తెలుసుకోవచ్చు.

స్థూలంగా స్తూపం రూపం ఇలా చెప్పుకోవచ్చు. ఒక పెద్ద వృత్తంలాగా గుండ్రంగా గోడ ఉంటుంది. దానికి నాలుగుపక్కలా సింహద్వారాలు ఉంటాయి. దానిలోపల ఎత్తుగా బోర్లించిన అర్ధగోళం ఆకారంలో 'అండము', దాని అంచులమీద చుట్టూ వేదికలు నిర్మింపబడి ఉంటాయి. వేదికను ఆనుకొని సింహద్వారాలకు ఎదురుగా నాలుగు 'ఆయక వేదికలు' ఒక్కొక్క దానిపైన ఐదు ఆయక స్తంభాలు ఉంటాయి. ఆయక స్తంభాలు

ఆంధ్ర బౌద్ధమత స్తూప విశిష్టతలు, వృత్తానికీ, అండానికీ మధ్య ప్రద, పథం ఉంటుంది. అర్ధగోళంపైన 'హర్మిక', ఆపైన 'ఛత్రం' ఉంటాయి

ప్రతి పాలరాతిమీద బుద్ధుని జీవితానికి సంబంధించినవీ, పూర్వ జ సంబంధించినవీ కొన్ని ఘట్టాలు చిత్రింపబడ్డాయి. హీనయానమూ, మ యానమూ రెంటికీ ఆధిక్యం ఉంది. ఈ శిల్పకళ దాదాపు క్రీస్తు పూర్వ రెండువందల సంవత్సరాల నాటిదని విజ్ఞులు ఊహిస్తున్నారు.

మార్దవం, సౌకుమార్యం ఈ శిల్పాల విశిష్టత. ఈ స్తూపాలపైన ి రచనలో స్త్రీ చిత్రాలు వినూత్నాలు. ఒక స్త్రీ శిల్పంతో పోలికక, మరొకటి లేనేలేదు. స్త్రీపురుషుల చిత్రాలు అనుగుణ భావస్ఫోరకా జీవకళ చిప్పిలుతూ ఉన్నాయి.

ఆ కాలంలో భారతీయ శిల్పకళకు అమరావతీకళ శిరోభూషణమ అంతేకాక ప్రపంచానికే భిక్షగా, శిల్పంలో 'అమరావతీ రీతి' అని ఒ సంప్రదాయం ఒకటి ఏర్పడిందని విజ్ఞులు తెలుపుతున్నారు.

## ధరణికోట:

శాతవాహనుల రాజధాని ధాన్యకటకం. అది ఇప్పటి ధరణికోట. అమరావతికి అరమైలు దూరంలో ఉంది. అప్పట్లో అమరావతి ఐశ్వ నిలయం ఆంధ్ర శౌర్యానికి ఆలవాలం. బౌద్ధుల శిల్పకళకు ఆకర ఆనాడే ఆంధ్రుల ఔన్నత్యం అన్ని దేశాలకూ అర్థమయింది.

శాతవాహనులు బౌద్ధమత ప్రచారం చేసినా, హైందవ ధర్మానికి ఆ పట్టయిన అమరావతి క్షేత్రం చెక్కుచెదరకుండా ఉండటంతో వా పరమత సహనత ప్రత్యక్షంగా కనబడుతూ ఉంటుంది.

ఆ కాలంలో అమరావతిలో ఒక విశ్వ విద్యాలయం ఉండేది. ధాన్య కటక విశ్వవిద్యాలయంలో (శ్రీ పర్వత విద్యాపీఠం అని దానిపేరు.) చతుష్ష కళలు నేర్పబడేవి. వివిధ దేశాలనుంచి విద్యార్థులు వస్తూ ఉండేవాళ్ల లలితకళలు ప్రాముఖ్యం పొందాయి. అందులోనూ శిల్పానికి ఆధిక్య ఉంది. బౌద్ధమత ప్రచారానికి అనుగుణంగా శిల్పకళ అభివృద్ధిపొందిం ఆ కళానైపుణ్యం చరిత్రకు అతీతంగా ప్రతిబింబించింది.

నాగార్జునుడి ఆచార్యత్వంతో విశ్వవిద్యాలయం నడుపబడిన సమయంలో తయారైన శిల్పకళా ఖండికలు ప్రపంచకీర్తి నార్జించుకొన్నాయి. పుర

తత్వజ్ఞులు నాగార్జునసాగర్ త్రవ్వకాలలో వెలుగులోకి తెచ్చిన శిల్పాలు ఆనాటి శిల్పజ్ఞతను చాటుతూ ఉన్నాయి.

శాతవాహనుల రాజ్యపాలన కాలంలో బౌద్ధమతం ఉన్నత శిఖరాల నధిగమించటంతో హైందవ ధర్మానికి ప్రతీకగా నిలచిన అమరావతి క్షేత్ర పశస్తి, ప్రజల ఆదరాభిమానాలు అడుగంటి క్షీణించిపోయింది.

శాతవాహనులపాలన అంతరించింది. బౌద్ధం తగ్గిపోయింది. ధాన్య కటకం రాజధాని కాకుండాపోయింది. అమరావతి నిర్మానుష్యమయింది. కొద్దిగానో ఏమో జరుగుతున్న పూజలు పూర్తిగా నిలిచిపోయాయి.

## ధాన్య కటకం:

బౌద్ధకాలపు శిల్పాచార్యుల సిద్ధహస్తాలలో రూపొందిన కళాసామగ్రిలో స్తూప నిర్మాణ మొకటి. ఈ స్తూప నిర్మాణాలలో అమరావతీ స్తూప శిల్ప సౌందర్యం దేశదేశాలూ కొనియాడదగినది. త్రిజగన్మోహనమైనది. ఆ ప్రాకారపుగోడ, ఆ స్తూపపు అండాకృతిలో చిత్రించిన లతలు, ఎనలేని విగ్రహాలు, అధిష్ఠాన చిత్రాలు, ఊర్ధ్వ పటచిత్రాలు చూస్తుంటే ఆనాటిది దైవశిల్పం అంటే అతిశయోక్తి కాదేమో! చైత్య శిలాఫలకాలమీద కొలువు దీరియున్న బుద్ధమూర్తి, ఆయనను పరివేష్ఠించిన ఆ పరివారము యథార్థంగా ఆ కాలపు బుద్ధుని ధర్మసభను స్మరింపజేయవచ్చు, ఒక యక్షిని తీర్చి దిద్దటానికే మన ఆంధ్రశిల్పి తన జీవితాన్ని ధారపోసి ఉండవచ్చు. ఇది అంతాది సౌందర్యపు పోత! చివికి జీర్ణించిన ఈ శిల్పఖండాలు ఎంతో శిల్పో దంతాన్ని చాటుతున్నాయి.

సముజ్వల చరిత్రకు పంటపొలమైన అమరావతి క్రీ. శ. నాల్గవ శతాబ్దము నుండి బౌద్ధమతంలోవచ్చిన తాంత్రికపద్ధతి కారణంగానూ, వైదిక మత ప్రాబల్యం కారణంగానూ జీర్ణస్థితికివచ్చింది. శాతవాహనుల రాజ్యమంతరించి, పల్లవులు, విష్ణుకుండినులు, చాళుక్యులు, వాకాటకులు మొదలగు వంశముల వారు వైదికమతాన్ని ప్రేమించి ప్రచారం చేశారు. మళ్లీ వర్ణవ్యవస్థ అర్థరహితమైన తరతమ భావం ప్రజల్లో రేకెత్తి బౌద్ధ యుగంనాటి ఆ విజ్ఞాన వైభవం, కళాసంపత్తి, వీరవిక్రమం, ఆ సంస్కృతి అన్నీ సన్నగిలి పోయినాయి. ఏడవ శతాబ్దములో హూయన్‌త్సాంగ్ అనే చీనా యాత్రికుడు వచ్చేటప్పటికే ధాన్యకటకం వైభవం క్షీణదశలో ఉన్నట్లు తెలుస్తున్నది.

## చరిత్రగతి:

కోటకేత రాజు ధరణికోటను రాజధానిగా చేసుకొని ఆంధ్రదేశం పరిపాలించిన కాలంలో అమరావతి తిరిగి ప్రతిష్ఠపొందింది. ఆ రాజ్యం క్షీణించటంతో క్షేత్రం మళ్లీ పతనం చెందింది.

ఆ పైన కొండవీటిని రెడ్డి రాజులు పరిపాలించినప్పుడు పునః ప్రతిష్ఠ జరిగింది. అనవేమారెడ్డి స్వామివారిని సందర్శించి నిత్యనైవేద్య దీపారాధన ఏర్పాటు చేశాడు.

అప్పటికి అమరావతి హైందవులకు పుణ్యక్షేత్రమై, ఉత్తమస్థాయి సంతరించుకొని, ఆంధ్రదేశంలో పవిత్ర పుణ్యతీర్థమై, భారతావని అంతటిని ఆకర్షించే స్థితిని అందుకుంది.

విజయనగర సామ్రాజ్యం పరిపాలించిన విద్వత్కవి, కవి పండిత పోషకుడు, రాజకవి, కవిరాజు అయిన శ్రీ కృష్ణదేవరాయలు అమరావతిని దర్శించి పూజించటంతో క్షేత్ర మాహాత్మ్యం మరో బంగారురంగు శృంగా రించుకొంది.

## వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడి కాలం:

తురుష్క దండయాత్రల కారణంగా చెలరేగిన మత కలహాలలో అమరావతి క్షేత్రలక్ష్మి అడుగంటింది. హంద్రికం పెద్దప్ప అమరేశ్వర స్వామి వారి ఆలయం రక్షించేభారం స్వీకరించాడు.

ఇప్పుడు కనులపండువుగా అమరావతి క్షేత్రం కనిపించే ఆకారం కల్పించిన మహానుభావుడు రాజా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు. ఆయన సంస్థానాధీశుడు తన రాజధాని చింతపల్లినుంచి అమరావతికి మార్చుకొన్న ఉదంతం ఒకటి ఉంది. ఆ మార్పువలననే అమరావతి అభి వృద్ధి చెందింది.

అరణ్యంలోని చెంచులు పల్లెలలోని ప్రజలకు తీరని బాధలు కలిగిస్తున్నారు. రక్షణ భారం కారణంగా రాజు వారిని వధించక తప్పలేదు. దానిమూలంగా ఆయన మనస్సు వ్యాకులమయింది. అన్నపానాదులు రుచించకుండా పోయాయి. కలలో శివుడు ప్రత్యక్షమయి, చింతపల్లినుంచి రాజధాని అమరావతికి మార్చుకొని, అక్కడ నివసిస్తూ తనను పూజిస్తే పాపపరిహారం అవుతుందని ఆదేశిస్తాడు. ఆలాగే ప్రభువు నిర్వర్తించాడు.

హైందవ మతం అవలంభించిన ఎందరో పుణ్యాత్ములు పూనుకొని బాగు చేయించగా అభివృద్ధి చెందుతూ వచ్చిన అమరావతిలోని అమరేశ్వరాలయం, ఏ మతం తాకిడికి చెక్కు చెదరకుండా నిలబడిందీ అంటె అందుకు కారణం స్వామి వారి ప్రత్యేకతేనని ప్రజల విశ్వాసం. భారతదేశమతాలయిన హైందవ బౌద్ధమతాల కాలంలోనే కాక భారతీయేతరమయిన మహమ్మదీయ మతం రాజ్యపాలన చేసిన సమయంలోనూ అమరావతికి ఆటంకం కలుగలేదు. పైగా అర్చన అందుకుంది.

హైదరాబాదు నవాబు అయిన నాజరుద్దౌలా ముఖ్యమంత్రి చందులాల్ అమరావతి పుణ్యక్షేత్రం దర్శించి నిత్యనైవేద్య దీపారాధనకు నవాబుచేత కొంత భూమి ఇప్పించాడు. అంతకుముందే నవాబుకు స్వామి వారు కలలో దర్శనమిచ్చారట.

పై చరిత్రకు క్షేత్రంలో శాసనాధారాలు ఉన్నాయి.

## అమరేశ్వరాలయం:

క్షేత్రం అంతా పది ఎకరాల విస్తీర్ణంతో ఉంటుంది. ప్రాకారాలు సమబాహు చతుర్భుజాలులాగా ఉంటాయి. నాల్గు ప్రక్కల నాల్గు ద్వారాలు ఉన్నాయి. అవి ఒకదానికొకటి ఎదురుగా తిన్నగా ఉన్నాయి. క్షేత్ర నిర్మాణంలో గొప్పతనం ఏమిటీ అంటే వాస్తు శాస్త్ర పరిజ్ఞానం ఉన్న వ్యక్తుల కళా విశిష్టత కనబడటం.

కాలక్రమంగా కళ్యాణ తిలకం దిద్దుకుంటూ దినదినమూ ప్రవర్ధమానమౌతున్న వందలాది యాత్రికులతో విలసిల్లుతూ వచ్చిన అమరావతి కృష్ణానది దక్షిణ భాగంలో ఒడ్డునే–గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలో ఒక చిన్న గ్రామంగా నేడు ఉంది.

అమరేశ్వర దేవాలయం పంచప్రాకారాల పరివేష్టితం అంటారు. కాని మూడు ప్రాకారాలే స్పష్టంగా కనబడుతూ ఉంటాయి. ఆ ప్రాకారాలలో అనేక దేవ దేవతాగణం పూజలందుకుంటూ ఉంటుంది.

గాలిగోపురం చుట్టూ పది ఆమడల దూరం కనిపిస్తుంది అంటారు. అది చాలా ఎత్తుగా ఉంటుంది. అది మొదటి ప్రాకారంలో ఉంది. మొదటి ప్రాకారంలో ప్రణవేశ్వరుడు, శంకరాచార్యుడు, కాశీవిశ్వేశ్వరుడు, అన్నపూర్ణాదేవి, ఉమామహేశ్వరుడు, దత్తాత్రేయులు, జ్వాలాముఖి అమ్మ

వారు, అగస్త్యేశ్వరుడు, పార్థివేశ్వరుడు, సోమేశ్వరుడు, నాగేంద్రుడు మహిషాసుర మర్దని అమ్మవారు, కోసలేశ్వరుడు వీరభద్రుడు ఉన్నారు.

ప్రతి దేవునికి పూజలు చేస్తూ, నమస్కరిస్తూ, ముందుకు నడుస్తూ ఉంటే . మొదటి ప్రాకారం పూర్తయిపోతుంది. పచ్చని గరిక మీద తెల్లని మంచు తుంపురులు వెండి తుంపులులాగా మెరుస్తూ ఉంటాయి. అక్కడ నడుస్తూ ఉంటే శరీరం పులకరిస్తూ ఉంటుంది. వాయువీచికల్లో దోబూచు లాడుతూ తిరిగే పరమాత్మ సమాశ్లేషం కారణం అయి ఉండవచ్చుననుకొనే యాత్రికులూ వుంటారు.

రెండో ప్రాకారంలో విఘ్నేశ్వరుడు, కాలభైరవుడు, కుమారస్వామి, హనుమంతుడు, గణపతి కాక శమీవృక్షం కూడా ఉండటం చూడవచ్చు.

ఈ ప్రాకారం మొదటి దానికంటే చిన్నది. ప్రతి దేవుని ఎదుటా ప్రార్థనచేసే పద్ధతి, అందుకు అవసరమయిన శ్లోకాలు ఉన్నాయి. భగవంతుని గురించి ఆలోచించే మనస్సుకంటే అక్కడ కలిగే తన్మయీభావం హృదయానికే బాగా గుర్తు ఉంటుంది. పరమాత్మ సన్నిధిలో ఆత్మపొందే అనుభూతి పరంపరలు ఆ ప్రాంతంలో కలుగుతూ ఉంటాయి.

మూడో ప్రాకారంలోని ఆవరణం మొదటి రెండు ప్రాకారాలకంటే చిన్నది. అయితే ఎత్తుగా ఉంటుంది. చల్లని నీడలు ప్రసాదించే చెట్లు, ఆహ్లాదం కలిగించే కృష్ణవేణి తరంగాలు, ప్రాకారాలలో పచ్చని గరిక, అన్నిటికంటె దైవదర్శనంతో హృదయంలో కలిగే భక్తిభావం, అనుభావ, విభావాలలో అభివృద్ధిచెంది, రసస్థితి సమీపిస్తూ అమరేశ్వర దర్శనంతో పరాకాష్ఠ నందుకుంటుంది.

అందులో మల్లేశ్వరస్వామి, విశ్వేశ్వరుడు, వేణుగోపాలస్వామి, నాగేంద్రుడు, చండేశ్వరుడు, కాళహస్తీశ్వరుడు, నందీశ్వరుడు ఉన్నారు. వారికి పూజలు జరుగుతూ ఉంటాయి. అక్కడ ముఖ్యమయిన విధి కృష్ణవేణిని ప్రార్థించటం. మరొకటి నవగ్రహాల పూజ.

అమరావతి యాత్రకు పోవటమంటే అమరేశ్వరస్వామి పూజకోరకే. ఆ పూజ ఇక్కడే జరుగుతుంది. భస్మం ధరించి అమరేశ్వర ప్రార్థన, ఆపైన జ్యోతిర్లింగ స్తోత్రం ఒక్కసారే జపించాలి. తరువాత సమీపంలో ఉన్న బాల చాముండిక అమ్మవారిని దర్శించాలి.

ఏనాడో పుణ్యక్షేత్రంగా వెలసిన అమరావతి క్రమక్రమంగా పరిణామం పొంది అనేక దేవతలకు ఆలవాలమయింది. అందువల్ల అమరావతి పూర్వ చరిత్ర, క్షేత్రం పుట్టుక గమనించాలి.

## క్షేత్ర చరిత్ర :

అమరులు నివసించిన ప్రదేశం కావటంవల్ల ఆ ఊరికి అమరావతి అని వాడుకకలిగింది. అమరులు స్వర్గంలోని అమరావతి విడిచిపెట్టి ఆంధ్ర దేశంలోని అమరావతిలో ఎందుకు నివసించారూ అంటే అందుకొక పూర్వ గాథ ఉంది.

పూర్వం తారకుడికీ, ఇంద్రుడుకీ చాలా సంవత్సరాలు యుద్ధం జరిగింది. అందులో దేవసేనలే ఓడిపోయాయి. దేవతలు భయపడి పారిపోయి శ్రీ మహావిష్ణువు శరణుజొచ్చారు.

శివభక్తుడైన తారకుని చంపలేననీ శంకరునే ప్రార్థించటం కర్తవ్యమని శ్రీ మహావిష్ణువు తెలియజేశాడు. అప్పుడు అందరూ ఈశ్వరుని దగ్గరకు వెళ్లి ఆయనను పూజచేశారు.

ఈశ్వరుడు తన భక్తుని తాను చంపలేననీ, దుష్టత్వంకలిగి ఉన్నాడు కాబట్టి చనిపోవాలనీ, అందుకు తన అంశలో జన్మించిన కుమారస్వామిని సేనాపతిగా చేసి తారకునితో యుద్ధం చేయమని తెలియచేశాడు.

యుద్ధం జరిగింది. వేలాది రాక్షస సైనికులు మరణించారు, కుమారస్వామి బాణప్రయోగంవల్ల, ఎంతసేపటికీ తారకాసురుడు చనిపోకపోవటం గమనించి కుమారస్వామి 'శక్తి'ని ప్రయోగించాడు. అప్పటికీ తారకుడు మూర్ఛపోయి తిరిగి బ్రతికాడే కాని మరణించలేదు.

దేవతలు కైలాసపతికి ఈ విషయం తెలియజేశారు. తారకుడి కంఠంలో శివలింగం ఉందనీ, అందులో అతని ప్రాణాలు ఉన్నాయనీ అది భిన్నం చేస్తే అతను చనిపోతాడనీ, భిన్నమయి పడిపోయిన శివలింగం శకలాలు పెరుగుతూ ఉంటాయనీ, వాటిని ప్రతిష్ఠించి దేవతలు పూజించాలనీ, అప్పుడు మాత్రమే పెరగటం ఆగిపోతుందనీ శివుడు చెప్పాడు.

మహేశ్వరుడి వాక్పరిపాలనచేసి కుమారస్వామి తారకుని కంఠంలోని శివలింగాన్ని ఛేదించాడు. అయిదు శకలాలయి భూమిమీద పడ్డాయి. అవి పడిన తావులు క్షేత్రాలయ్యాయి. పంచారామాలుగా ప్రసిద్ధిపొందాయి.

అందులో పెద్దదయిన శకలం పడినతావులో ప్రతిష్ఠచేసి, పూజలు చేస్తూ దేవతలు నివసించటంవల్ల ఆ క్షేత్రానికి అమరావతి అని పేరు కలిగింది.

అమరావతిలోని స్వామి వారి నామధేయం అమరేశ్వరుడు. ఆ పేరు వినగానే ఇంద్రుడు గుర్తుకు వస్తాడు. అయితే ఇంద్రుడి ప్రస్తావన ఏమీ లేదు. ఏమీ లేకపోనూ లేదు. జ్యోతిర్లింగ ప్రతిష్ఠ చేసింది ఇంద్రుడు. అయితే దేవుడు ఈశ్వరుడు. అమరులకు అమరత్వం కలిగించిన ఈశ్వరుడు ఈశ్వరుడై ప్రతిష్ఠ పొందటంవల్ల ఆ స్వామి వారిపేరు అమరేశ్వరుడుగా రూపొందింది.

మూడు ప్రాకారాలు కలిగిన అమరావతి పుణ్యక్షేత్రంలో, త్రిమూర్తులలో మూడవవాడైన శివునికి, సృష్టి స్థితి లయలలో మూడవ దాని అధినేత అయిన శివునికి సంబంధించిన శ్రీ అమరేశ్వర స్ఫటిక లింగం పదమూడు గజాల ఎత్తుగలది, మూడు అడుగుల కైవారంతో మూడు అంతస్తుల పైనున్న గర్భాలయంలోకి చొచ్చుకుపోయి ప్రకాశిస్తూ ఉంటుంది.

కోటి కొక్క దేవుడుగా ముక్కోటి దేవతలకు ప్రతినిధులుగా ముప్పది మంది దేవతలు అమరావతి పుణ్యక్షేత్రంలోని మూడు ప్రాకారాలలోనూ ఉన్నారు.

స్వామిని అభిషేకం చేయటానికి భక్తులు మెట్లెక్కి పైకి వెళ్తారు. పది ఇరవైమంది ఒకేసారి అభిషేకం చేయటానికి అవకాశం ఉంది. స్వామి శిరంపైన మానవుల పూజ, పాదాలపైన దేవతల పూజ జరుగుతుందని ప్రతీతి. ఉత్తరంగా ఉన్న చిన్న ద్వారంనుంచి దేవతలు వచ్చి స్వామిని పూజించి వెళ్తూ ఉంటారని ఒక నమ్మకం.

ఎన్నో వందల సంవత్సరాల క్రిందట జన్మించి, చరిత్ర తాకిడికి తట్టుకొని, ఒకనాడు ప్రపంచంలో ప్రఖ్యాతిపొంది, ఉత్తమ జనసమూ, ఉన్నత ఆకర్షణమూ, కలిగి, విశిష్ట క్షేత్ర మాహాత్మ్యంతో విలసిల్లి, అభివృద్ధిపొందిన అమరావతి పుణ్యస్థలి, ఈనాడు నామ మాత్రంగా మిగిలిపోయి, ఏదో జరుగక తప్పదన్నట్లు, దీపారాధన జరుగుతూ, కొడిగట్టే స్థితికివచ్చి యాత్రికుల సంఖ్య దినదినానికి తగ్గిపోతూ, క్షీణించిపోతూ ఉన్నది. ఈ సమయంలో ఆంధ్రులు తమ నాగరికతకూ, సంస్కృతికీ, సభ్యతకూ, సంస్కారానికీ చిహ్నమయిన అమరావతిని పునః ప్రతిష్ఠ చేసుకొని నిత్య నైవేద్య దీపారాధన విధివిగా జరిపించుకోవాలని కోరుకోవాలి.

[ఆంధ్ర ప్రభ సచిత్ర వారపత్రిక '62]

# ముసలమ్మ మహాత్యాగం—బుక్కరాయసముద్రం

ఆంధ్రదేశంలో క్షేత్రసంపదతో పసుసమృద్ధితో శిల్పకళా శిథిలాలతో పరిఢవిల్లి, అనంత సంపదలకు ఒకప్పుడు నిలయమైన అనంతపురంలో 'బుక్కరాయసముద్రం' పవిత్రత్యాగానికి ఆత్మార్పణకు ప్రత్యక్ష సాక్ష్యంగా నేటికీ జీవనదానం చేస్తూవుంది.

బుక్కరాయ సముద్రం అనే తటాకం మూడువందల ఎకరాల వైశాల్యం కలిగి, పల్లపుభూమిలో పచ్చని పైరులతో బంగారం పండిస్తూ ఆనంద సంపాదకంగా వుంది. ఈ తటాకం బుక్కరాయసముద్రం అనే గ్రామానికి, అనంతపురానికి మధ్య పౌర్ణమినాటి వెన్నెలప్రవాహంలా విశేష సంపదల్ని కురిపిస్తూ ప్రజలను పరవశింపజేస్తూవుంది.

## తటాకనిర్మాణ చరిత్ర:

ఈ బుక్కరాయ సముద్రం పూర్వం అనంతసాగరం అని అనబడుతుండేది. ఈ తటాక నిర్మాణానికి కారకుడైన వ్యక్తి చిక్కప్ప ఒడయారు. చిక్కప్పకు ఐదేళ్లున్నప్పుడు, అతని తల్లి మేళమ్మ, భర్త వియోగంవల్ల రోజులు గడవక, స్వగ్రామమైన 'వోరూరు'ను విడిచి బ్రతుకుతెరువుకోసం దేశాటనం ప్రారంభించింది. బుక్కరాయల చేతిమీదుగా దోగాడుతున్న విజయనగర సామ్రాజ్యంచేరి, పంపానదీతీరమందు కోదండరామస్వామి కోవెలలో చిక్కప్పను నిద్రపుచ్చి భిక్షాటనానికి వెళ్లింది మేళమ్మ.

ప్రభాతప్రభాకరుడి వెచ్చని కిరణాల ప్రభావమేమిటోగాని చిక్కప్ప మాత్రం ప్రశాంతంగా నిద్రపోతున్నాడు. దగ్గరలోనున్న వల్మీకంలోంచి నాగసర్పం బుసలుకొడుతూ వచ్చి అతన్ని చూచి, శాంతించి, అతనికి ఎండ తగలకుండ తన పడగ గొడుగుపట్టడం చూచిన, 'నాగాభోగి' అనే పాముల వాడు చిక్కప్ప అదృష్టజీవిత భవిష్యత్తును మేళమ్మకు ఆమె భిక్షాటనంనుంచి తిరిగివచ్చిన తర్వాత తెలిపాడు. ఆ తరువాతనే మేళమ్మ బుక్కరాయల ఆస్థానంలో పరిచారికగా చేరింది.

అనేక సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు తురుష్క ప్రభువు దగ్గర్నుంచి వచ్చిన లేఖ నిండు సభలో రాజ్యాంగవేత్తలకు బుక్కరాయలు చదివి వినిపించాడు. మరునాడు సమాధానం వ్రాయవలసిన ఈ లేఖ కనిపించకపోయింది. బుక్కరాయలు ఆందోళన చెందుతున్న సమయంలో ఏక సంథాగ్రాహి యువకుడు, తనకు అంగరక్షకుడు అయిన చిక్కప్ప, తను సభలో విన్న విన్న లేఖార్థాలను వున్నవున్నట్లుగా అప్పచెప్పి రాయలవారి ప్రశంసలను పొందాడు. బుక్కరాయలు మేళమ్మను పరిచారికను తొలగించి చిక్కప్పకు గౌరవప్రదమైన మంత్రిపదవియిచ్చి సత్కరించాడు. ఇది జరిగిన కొంత కాలానికి బుక్కరాయలు తన పేరిటను, ప్రియసతియయిన అనంతమ్మ పేరిటను, రెండు పట్టణాల్ని నిర్మించాలనుకొని ఆ మహాకార్యాన్ని నిర్వహించటానికి చిక్కప్పను నియోగించాడు. బుక్కరాయసముద్రం, అనంతసాగరమని పిలువబడుతూవచ్చిన అనంతపురం పట్టణాలను, తన మేధాసంపత్తితో చక్కగా నిర్మించడంవల్ల బుక్కరాయలు చిక్కప్పనే ఆ గ్రామాలకు పాలెగారుగా నియమించాడు.

## తటాక చరిత్ర:

చిక్కప్ప ఈ అధికారం పొందింతర్వాత ప్రజల జీవిత సౌకర్యాలను, పరిస్థితులను, అర్థం చేసుకోనేవాడవటంవల్ల పశువులకు, పంట పొలాలకు, యేటిపాడవును నీటిబాధ తప్పటంకోసం తటాకాల నిర్మాణానికి పూను కొన్నాడు. ప్రజాశ్రేయస్సుకోసం నిర్మించిన తటాకాలలో మొదటిది బుక్కరాయసముద్రం. ఇది బుక్కరాయ సముద్రం అనే గ్రామానికి, అనంతపురానికి, మధ్యలోవుంది. ఈ తటాకం కాలాంతరంలో అనంత సాగరం అని పిలువబడుతూవుండేది. బుక్కరాయలు పేరిట, అనంతమ్మ పేరిట, నిర్మింపబడిన పట్టణాలకు మధ్య ఏర్పాటు చేయబడిన తటాకం కొంతకాలం బుక్కరాయ సముద్రం అని, మరికొంతకాలం అనంతసాగరమని పిలవబడడం ఎంతయినా సముచితం. చిక్కప్ప నిర్మింపజేసిన రెండవతటాకం నాగసముద్రం. ఇది భవిష్యత్తును తెలిపిన నాగాభోగి పేరిట పెనుకొండ దగ్గరలో నిర్మింప బడింది.

బుక్కరాయసముద్రం (తటాకం) శాలివాహనశకం 1286 లో నిర్మింప బడింది. అనంతపురానికి పది క్రోసుల దూరంలో వున్న 'కంబుదిగి' గ్రామ సమీపంలో శ్రీస్వామి కొండల్లోంచి పుట్టి, ప్రవహించే పాండునది (పండ

మేరు) బుక్కరాయసముద్రంలోకి వచ్చి చేరుతుంది. వర్షం బాగా పడి నప్పుడు, తటాకం పూర్తిగా నిండితే పరిసరాలకు మూడేళ్లవరకు ఏలాటి నీటి కొరతా పూర్వం వుండేదికాదు. వర్తమానంలో చెరువు పూడిపోవటంవల్ల ఏ యేటినీరు ఆ యేటికి సరిపోతూవుంది.

## పూర్వ చరిత్ర:

చిక్కప్ప ఒడయారు క్రీస్తు శకం 1343–1379 మధ్యకాలంలో అనంతపురాన్ని పరిపాలించాడు. ఆపైన హండే కుటుంబానికి చెందిన హనుమప్ప నాయుడు పరిపాలించడంవల్ల అనంతపురానికి హండే అనంతపురమనే పేరు కలిగింది. ఈ హండే వంశీయులు అనంతపురాన్ని క్రీస్తుశకము 1788 వరకు పాలించారు. అనంతమైన అలజడి, అనంతపురం, బళ్లారి ప్రభువులకు, జరిగింతర్వాత టిప్పుసుల్తాన్ హండే వంశీయులందరిని హతమార్చాడు. కాని సిద్ధప్పనాయుడు ఏలాగో తప్పించుకొని క్రీ. శ. 1799 లో టిప్పుసుల్తాన్ మరణించాక అనంతపురాన్ని స్వాధీనం చేసుకొని నిజాం నవాబుకు సామంతుడయ్యాడు. మన్రో ప్రిన్సిపల్ కలెక్టరయేదాకా క్రీస్తు శకం 1860 వరకు అనంతపురాన్ని 'హండేవంశం' పరిపాలించింది.

(పై చరిత్రకు ఆధారం అనంతపురం గజిటర్)

బుక్కరాయసముద్రం (తటాకం) తూర్పుగట్టుగావున్న కొండ దేవర కొండ. వివిధ ఫల, పుష్ప వృక్షాలతో నిండి కనులపండువగా వుంటుంది. ఈ కొండమీదవున్న వెంకటేశ్వరస్వామికి, కొండమీదరాయుడని జనంలో వాడుక. ఈ ఆలయాన్ని కట్టిచ్చినవాడు చిక్కప్ప. అతడే ఈ విగ్రహాన్ని తిరుపతినుంచి తెచ్చి ప్రతిష్ఠించి పూజలు జరిపించాడట. దూరంగావున్న తిరుపతి వెంకటేశ్వరుని దర్శనం చేసుకోలేనివారు ఇక్కడి స్వామిని దర్శించి పూజలుచేస్తే ఆ స్వామి దర్శనంవల్ల కలిగే పుణ్యం తప్పక కలుగుతుందని జనం భావిస్తారు. విగ్రహం వెనుకనుంచి ఒక సొరంగంవుంది. అది విజయనగరం దాకా వుందని ఒక నమ్మకం.

## గార్గేయ ఆశ్రమం:

తటాకానికి ఉత్తరంగా గార్గేయాశ్రమంవుంది. గార్గేయముని శిష్యులు తమ గురువుపేరిట ఈ ఆశ్రమాన్ని నిర్మించారట ఈ ఆశ్రమం కొండలో తొలవబడింది. ఈ ఆశ్రమ శిలాఫలకలమీద విన్యస్తమైన శిల్పం కాలం

తోఁడికి మరుగుపడిపోయినా, ఇప్పటి సన్యాసులు ఆ స్థలాన్ని నివాస యోగ్యంగా చేసుకొనడంవల్ల మార్పులు కలిగినా శిల్పకళా ఛాయలు మిగిలే వున్నాయి. అమరావతి శిల్పరీతి, హంపీ కళాక్షేత్రంలోని శిల్పనైపుణ్య పద్ధతి అల్పంగా ఇక్కడ కనిపిస్తూవుంటాయి ఈ ఆశ్రమంలో ఒక సొరంగంవుంది. అది ఋష్యశృంగ పర్వతాలవరకు వుందని ఒక నమ్మకం. దీనినిప్పుడు 'గవి-మఠం' అని పిలుస్తారు. గార్గేయాశ్రమం ప్రక్కనే ఒక శివాలయంవుంది. శివాలయానికి ముందువున్న కోనేరు పూడిపోయిన స్వరూపం మాత్రం కనపడుతూవుంటుంది. దీని నిర్మాణపద్ధతి చాలా ప్రాచీనమయింది. చిక్కప్ప ఈ ఆలయాన్ని నిర్మించినతర్వాత బుక్క రాయలకు తెలిపితే ఆయన సంతుష్టి ప్రకటించినట్లు శాసనస్థమైన ఆధారాలు వున్నాయట.

శివాలయంమీద వున్న శిల్పకళ అంతా శిథిలమయింది. నందీశ్వరుడి విగ్రహం నామమాత్రంగా వుంది. ఈ శిథిలాలే శిల్పనిర్మాణ, దక్షతను, కళానైపుణ్యాన్ని చాటుతూవున్నాయి. శివాలయంలో పూజలు యథావిధిగా జరుగుతున్నాయి. ఈ శివాలయానికి చుట్టూవున్న చిన్నచిన్న రాళ్లుకూడా శిల్పకళా వైభవానికి ప్రత్యక్షసాక్ష్యం పలుకుతున్నాయి.

తటాకపు ఉత్తరపుగట్టుమీద వున్న విఘ్నేశ్వరాలయం చిక్కప్ప నిర్మించాడు. విఘ్నేశ్వరుని విగ్రహం నిలువెత్తువుంది. విగ్రహం తిలకించిన హృదయం పులకించిపోయే ఉన్నత శిల్పవిన్యాసం, భక్తిభావ ప్రేరితంగా ద్యోతకమవుతూవుంది. ఈ విగ్రహం నిత్య ధూప, దీప, నైవేద్యపూజల్ని అందుకొంటూవుంది. ఈ మధ్య ఈ ఆలయం బాగా ఉద్ధరింపబడి పరిసర ప్రాంతం విహారస్థలంగా చేయబడివుంది.

## ముసలమ్మ మహాత్యాగం:

ఇప్పటికి ఎనిమిది తరాలకు పూర్వం బుక్కరాయసముద్రం (గ్రామం) పెద్ద రెడ్డిగా బసిరెడ్డి వుండేవాడు. ఈ బసిరెడ్డి కడగొట్టు కోడలు ముసలమ్మ. ఈమె ఈడేరని బాలిక. తల్లిచాటు బిడ్డకు, బాల్యంలో వివాహంకాగా పుట్టినింటికివచ్చిన చిన్నారి ముసలమ్మ. ఈమెను యౌవనవతిగ 'ముసలమ్మ మరణము' అను కావ్యం వ్రాసిన సర్ కట్టమంచి రామలింగారెడ్డి ఈ క్రింది ఉదాహరణతో భావించినట్లు కన్పించును.

లేగమై నాకుచు లీనమై మెడమలం
చిన గోవుఁబిండెడు వనరుహాక్షి
బొండు మల్లెలతోట పూవులు గోయుచు
వనలక్ష్మియననొప్పు వనజగంధి.

అమాయకురాలైన ముసలమ్మ మూర్తిదాల్చిన దైవత్వంలా గోచరించేది తన జీవం తటాకజీవనానికి అర్పించి, ఆ ప్రాంతంలోని ప్రజలకు జీవితాన్ని ప్రసాదించింది.

సుమారు 250 సంవత్సరాలకు పూర్వం ఒకానొక వర్షాకాలంలో వరుణ దేవుడి కరుణార్ద్ర హృదయం కరిగి భూదేవితనువుపై ప్రవహించింది. ఎప్పుడూ కురవని వర్షం ఆ యేడు కురిసి, ఎప్పుడూ నిండని బుక్కరాయసముద్రం నిండి నీరు గట్లు తాకుతూవుంది. అప్పుడది—

చలదుత్తుంగ మహోగ్ర భంగపటలీ సంఘట్టనారావ; ము
జ్జ్వల కులాగ్రనటత్తరంగరవ; మంచన్మధ్యభాగభ్రమి భృ
త్కల సంపాతి మహోర్మికా నికర నిర్ఘోషంబునుంగూడగా
నలరుక ఘోరసరస్సు దిగ్విదళనవ్యాపారపారీణమై'

(సర్ కట్టమంచి రామలింగారెడ్డి—ముసలమ్మ మరణము)

వుంది. అంతేకాక—

లీలలోలత్తరంగ మాలా
డోలావిహారణఖేలాప్రముదిత
జాలాపాదపు హేలా విలసిత

(డా॥ చిలుకూరి నారాయణరావు—ముసలమ్మమరణంపై గేయకవిత)

. . . అయింది. అధికంగా కురిసిన వర్షంతో ప్రవహించే పాండునది తాకిడికి చెరువుగట్లు తట్టుకోలేకపోయాయి. తెగిపోయే స్థితికి వచ్చాయి. గట్టులన్ని మొరవలై జలం అనంతపురంలోకి ప్రవేశిస్తూవుంది. జలం అధికమై జనం విభ్రాంతులయ్యారు. ఇళ్లూ, వాకిళ్లు, నీళ్లతో నిండిపోయాయి. శోకదేవత ప్రళయనృత్యం చేస్తూవుంది. బీభత్సమైన వాతావరణం కమ్ముకుంది. ప్రజలు ఇష్టదేవతలకు మొక్కుకొంటున్నారు. అందిన జంతువును బలి చేస్తున్నారు. గంగ ఆవేశాన్ని తగ్గించేందుకు స్త్రీలు పూజలు చేస్తున్నారు. అప్పుడొక ముసలి స్త్రీ పూనకంతో—

గంగాభవానినరో, నే
గంగాభవానినరో

అంటూ కేకలు పెట్టింది. ఆమెను గంగాభవానిపూని నరబలికావాలని కోరింది. వీటన్నిటికి మారుగా గట్టు మళ్లీ గుమ్మడపడింది. గండీని చూచి ప్రజలు భయపడ్డారు. గంగ నరబలి కోరిందని తెలియగానే ఎవరూ ఎవరికి కనిపించకుండ ఎటంటే అటే వెళ్లిపోయారు. అనంతపురంలో మనిషి మునిగే నీరు వచ్చేసరికి పట్టణం నిర్మానుష్యం అయింది. గొడ్డుగోదా నీళ్లలో కొట్టుకుపోతున్నాయి. అప్పటికి బుక్కరాయసముద్రం మొలబంటి మునిగింది.

బసిరెడ్డికోడలు ముసలమ్మకు లోకం తెలియదు. మాయ, మర్మాలు తెలియవు. ఏది ఆలోచితమో, ఏది అనాలోచితమో తెలియదు. అత్త మామలకు అణకువగా, పెద్దలకు మర్యాదగా, వుండేది. గంగాభవాని నరబలి కోరుతున్నట్లు విని సంచలించిపోయింది. ఏ భగవదంశ ముసలమ్మలో వుందోకాని, ఆమె హృదయ సముద్రంలోంచి, ఏ స్వచ్ఛమైన సుధ వెలువడిందో కాని, ఆమె ఆలోచనకు అతీతమైన ఏ భావనగుండెలు పులకరింప చేసిందో కాని, ఆమె గంగాభవానికి ఆహుతియేందుకు సిద్ధమయింది. ఆ పసి ప్రాణికి మృత్యువు అంటే తెలియదు. ఆమె అత్తదగ్గరకు వెళ్లి మృత్యువంటే ఏమని అడిగితే ఆమె గగ్గోలెత్తిపోయింది. అత్తమామలు ఏంచేయాలో తెలియకముందే—

ముసలమ్మప్పుడు - ముస్తాబయ్యెను
మొగమున పసుపును - సొగసుగ నలదెను
అడుగులదా - పారాణిని పూసెను
కుంకుమ నుదుటను - కుదురుగ నిలిపెను
కన్నులనిండా - కాటుకదిద్దెను
పసుపుచీరనొస - సరిగా కట్టెను
మొగ్గలరవికను - నిగ్గుగ తొడిగెను
కొంగుచు నడుముకు - కూర్చి బిగించెను
కూడదీసి తన - కురులను దువ్వెను
గొప్పగనొప్పగు - కొప్పును చుట్టెను
కొప్పున జాజులు - కొల్లగ తురిమెను
గన్నేరులు కం - ఠమున ధరించెను

కరముననొక సుర – కత్తినిబట్టెను
నిమ్మపండునా – కొనకున గుచ్చెను
చేతులగంధం – చెలువుగపూసెను
కాళ్లను గజ్జెలు – ఘల్లున కట్టెను
ఆదిశక్తి అప – రావతారమన
ముస్తాబయినది – ముసలమ్మ. . .

అపుడు జనమంతా కంగారుపడుతున్న సమయంలో నిర్వికల్పమైన స్థితి ఏర్పడి ఉన్నప్పుడు ముసలమ్మ–అపరశక్తిలా ఉన్న ఆ ముసలమ్మ–సిద్ధపడి దిక్కులు చూడకుండా తల వంచుకొని దైవ నిర్ణితమైన బలిపశువులాగా గండీపడినవైపు నడువసాగింది. ప్రజలు ఆమె వెంట నడుస్తున్నారు. ఆమె నెమ్మదిగా గండీలోనికిపోయి• • •

అమ్మల్లారా! అయ్యల్లారా!
అన్నల్లారా! తమ్ముల్లారా!
అక్కల్లారా! చెల్లెల్లారా!
సెలవియ్యండి – పోయెదను
కరుణగలిగె – గంగమ్మకునాపై
కడుపున పెట్టుక – కాపాడును మీ
కభయంబిచ్చిం - దాతల్లియునిక
చల్లగ ఇండ్లకు – తరలండి!
ననుమరువకుడీ – నాయనలారా!
సెలవియ్యండీ – తల్లుల్లారా!
అని కత్తిని – హస్తమునంగొని
కడుపున పొడుచుక – పడెనచట• • •

ఆపైన ప్రజలంత రాళ్లు, ఇసుకవేసి గండీనిపూడ్చారు.

పంటపొలాలకు, ప్రజాకోటికి, ప్రాణభిక్ష పెట్టటంకోసం, ప్రాణం అర్పించిన అమాయకప్రాణి; పరులశ్రేయస్సుకోసం తన జీవితం త్యాగం చేసిన ధన్యజీవి ముసలమ్మ.

ప్రజాక్షేమంకోసం చిక్కప్ప ఒడయారుచేత నిర్మింపబడిన బుక్కరాయ సముద్రం (తటాకం) ప్రజలకుపయోగపడకుండాపోయే తరుణంలో ప్రాణ దానం చేసి పునఃప్రతిష్ఠకు కారణభూతురాలయిన ముసలమ్మ జీవితం అనేకులను

కావ్యరచనకు ప్రోత్సాహపరచింది. ముసలమ్మ జీవిత చరిత్ర గల 'అనంతపుర చరిత్రము' అనే గ్రంథం ఒకానొక త్రిలింగ దేశీయునిచే వ్రాయబడి "బ్రౌన్" దొరగారిచే ప్రకటింపబడినది'. డాక్టరు చిలుకూరి నారాయణరావు, సర్ కట్టమంచి రామలింగారెడ్డి 'ముసలమ్మ మరణము'ను గూర్చి కవితాగానం చేశారు.

ఆంధ్ర సాహిత్యంలో విషాదాంత కావ్య రచనావిధానం ఆంగ్ల సాహిత్య ప్రభావానికి పూర్వం లేదు. పూర్వపు తెనుగు సాహిత్యంలో మరణంతో ఏ రచనా అంతంకాదు. సమష్టికోసం తన ప్రాణాన్ని త్యాగం చేసిన 'ముసలమ్మ' జీవిత కథను కావ్యంగా వ్రాసిన సర్ కట్టమంచి రామలింగారెడ్డి కావ్యంలో ముసలమ్మ మరణించటం కథావాస్తవిక దృష్టితో జరిగింది. ఈ పుణ్య కథ ఆంధ్ర సాహిత్యంలో ప్రప్రథమ విషాదాంత శ్రవ్య కావ్యరచనకు దోహదం చేసింది. విషాదాంత కావ్యరచన చేయాలన్న ప్రత్యేకవాంఛ కవికి లేనప్పటికినీ, ఈ కథావస్తువును స్వీకరించటంవల్ల 'ముసలమ్మ మరణము' కావ్యం తొలి విసాదాంత శ్రవ్య కావ్యమయింది. ఈ కావ్యమునుగూర్చి, ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతము ఇరువదియవ శతాబ్ది ఉదయింపనున్న వేగుబోకలో నక్షత్రమువలె మనసారస్వతాకాశమున నవ్యకాంతులతో నావిర్భవించిన నూత్నాంధ్రకావ్యము 'ముసలమ్మ మరణము.' (పేజీ 162 ముసలమ్మ మరణము—గౌతమ వ్యాసములు) అనియు 'అధునిక యుగమున... మరణాంతములను... శ్రవ్యకావ్యములలో... ప్రవర్తింపజేసినవాడు శ్రీరామ లింగారెడ్డియనియు, నాయూహ'. (పేజీ 163) అని పల్కుట గమనార్హం.

శ్రీ శ్రీవాత్సవ ఈ కావ్యం 'కవితా సంప్రదాయములను, వర్ణన విధానములను, కవి సమయములను పూర్తిగా మార్చి, ఒక విప్లవమునకు అంకురార్పణ చేసినది.' [పేజీ 203, ఉషఃకిరణాలు] అనడం అత్యుక్తిగా అనిపించే అవకాశంవుంది. శ్రీ కురుగంటి—సీతారామయ్య 'ఈ కావ్యం క్రమక్రమంగా జనాదరణ పొందటం గమనించదగింది'గా పేర్కొంటే, డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' అనే పరిశోధన గ్రంథంలో 'భావ కవితోద్యమ మింకను బాగుగా ప్రచారమునకు రాక పూర్వమే ఆంగ్ల సాహిత్య ప్రభావమున భావకవిత్వమునకు మార్గదర్శకముగా' వెలుగొందినదనడం వాస్తవం.

డాక్టర్ సి. నారాయణరెడ్డి 'ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు, ప్రయోగములు' అనే పరిశోధన గ్రంథంలో 'వస్తువు విషయ

ములో కథను మరణాంతము చేయుట విషయములో మాత్రము కించిన్న వ్యతను సంతరించుకొన్న మాట వాస్తవము.' [పేజీ 156.] అని తెలపడం గుర్తింపవచ్చు.

ఏది ఏమైనను ముసలమ్మ మరణాన్నిగూర్చి పలువురు కవి పండితులు అక్షరాలోచన చేయటం; అందులో 'ముసలమ్మ మరణము,' కావ్యం ఆధునిక ఆంధ్ర సాహిత్యంలో భావకవితా ప్రారంభానికి 'వేగుచుక్క' గాను, ప్రథమ విషాదాంత కావ్యంగాను శాశ్వతమైన స్థానం పొందటం ఆ మహాత్మురాలి చరిత్ర పవిత్రతనూ త్యాగాన్నీ నుతించటమే.

కొండమీద రాయుడి దయా దృక్కులతో, శివాలయంలోని శివుని తత్త్వ సమీక్షతో, గార్గేయాశ్రమంపైగా వీచేగాలి పవిత్రార్ద్ర స్పర్శతో, విఘ్నేశ్వరస్వామి ఆర్ద్ర నయనాల ఆశీర్వాదంతో, ముసలమ్మ కట్టమీద జరిగే పూజాబలంతో, ప్రవర్తించే బుక్కరాయసముద్రం (తటాకం) రాయ లేలిన రతనాల సీమగానే కాక త్యాగులేలిన త్యాగసీమలో జీవనభాగంగా, ముసలమ్మ జీవితానికి అంకితమై ఆమె పుణ్యచరిత్ర కలకాలం యావదాంధ్రం గానం చేస్తుంటే వింటూ ప్రాంతీయ ప్రజలకూ, పాడిపంటలకూ, జీవన మిస్తూ, కళ్యాణ ప్రదాయిగా వుంటుంది.

[ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక '62]

# 'ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు, ప్రయోగములు' – పరిశీలన

ఈ గ్రంథం ఆంగ్లశీర్షిక ట్రెడిషన్ అండ్ ఎక్స్పరిమెంట్ ఇన్ మోడర్న్ తెల్గు పొయిట్రీ.

సాధారణంగా పరిశోధన వ్యాసాలు ప్రచురించటం ఆ మధ్యజరిగేది కాదు. ఈ మధ్య జరుగుతూవుంది. ఇది మేలు.

సహజంగా పరిశోధన వ్యాసం విస్తృతంగా సాగే రచన. ముద్రణలో మూల్యం అధికంగా ఆశించేతీరులో జరుగుతుంది. ఇది అలాగే అయింది.

గుంటూరులో ఘనంగా జరిగిన ఆర్థికసన్మానం, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ఆర్థిక సహాయం, ఈ గ్రంథముద్రణకు తోడ్పడ్డాయి.

ఇంతకాలమూ, ఆంధ్రదేశంలో ప్రముఖకవిగా, సినీమాపాటల కవిగా అనేకులు డా. సి. నారాయణరెడ్డి ప్రతిభా సంపద గుర్తించారు.

ఈ గ్రంథం తిలకించి అనేకులు ఈ వ్యాసకర్త పరిశోధన పాటవం చూచి కవి విమర్శకుడుగా రూపొందితే ఎంత ఉత్తమ విమర్శన వాఙ్మయం అభివృద్ధి కాగలదో తిలకించి ముగ్ధులవుతారు.

సినీమా పాటలకర్తగా అందరకూ తెలిసిన డా. సి నారాయణరెడ్డి, కవిగా రసజ్ఞుల అభిమానం చూరగొన్న డా. సి. నారాయణరెడ్డి విమర్శకుడుగా సాహిత్య నిర్మాతల మనః ఫలకంమీద చెరగని ప్రభావం చూపి, ఆ విధంగా అన్ని మానసిక దశలలోని ఆంధ్రుల అంతరంగంలో చోటు చేసుకొన్న డా. సి. నారాయణరెడ్డి సాహిత్య సామర్థ్యం సాశ్చర్యంగా పరికింపదగింది.

పరిశోధనాంశం బహ్వల్పం. స్వీకరించి అనంతంగా పరికించటం — పరిశోధించటం ఒకకోవ. విస్తృత విషయం స్వీకరించి ప్రత్యంశ పరిశీలనం సమగ్రంగా నిర్వహించటం మరొకకోవ. ఈ రెండవ కోవకు చెందిందే ఈ గ్రంథం.

ఆధునికాంధ్ర కవిత్వం శతకోటి దేవాలయాల పుణ్యక్షేత్రం. ఒక్కొక్క గుళ్లో ఒక్క కొంకాయకొట్టినా, కొట్టించినా చేతుల నొప్పిపుట్టేంత పని.

ఇంతపని కవితా హృదయం ఉండి, కవిత్వం వ్రాసే హృదయం ఉండి డా. సి. నారాయణరెడ్డి నిర్వహించటానికి ఎలా సాధ్యమయిందని చూచే వాళ్లకు—నిజం—ఆశ్చర్యం కలుగుతుంది.

ఈ పరిశోధన విషయం విస్తృతి సామాన్యదృష్టికే అనంతంగా గోచరిస్తుంది. పరిశోధనాదృష్టికి ఇంకా అధికంగా కనిపిస్తుంది. అటు వంటిది ప్రత్యంశం అతిజాగరూకతతో నిర్వహించటం కష్టసాధ్యం. విమర్శ కులు ఆ కష్టం గుర్తిస్తారు.

భావకవిత్వం, ప్రణయకవిత్వం, అభ్యుదయ కవిత్వం, దేశభక్తి కవిత్వం ఇలా ఎన్నోవిధాల చూడదగిన ఆధునికాంధ్ర కవిత్వం పలువురు పరిశోధింప వలసిన విషయం. దేశభక్తి కవిత్వంగూర్చి ఇప్పుడొకరు పరిశోధిస్తున్నట్లే. తదితర ఆధునిక కవిత్వంగూర్చి అనేకులు పరిశోధింపవచ్చు. ఇంత విస్తృత విషయం, సృజన విమర్శన వాఙ్మయ సవ్యసాచి డా. సి. నారాయణరెడ్డి పరిశోధించడానికిగల అర్హత ఎం. ఏ. డిగ్రీవల్ల వచ్చిందికాదు. కవిగా స్థానం సంపాదించుకోవటానికి చేసినకృషిలో ఈ రచయితకు ఆధునికాంధ్ర కవిత్వంకొట్టిన పిండి. దున్నినభూమి. అందువల్ల ఈ ప్రయత్నం చక్కగా పండిన పిండివంట. బాగా పండినపంట.

మొదట సంప్రదాయ నిర్వచన ప్రయత్నం ప్రాచీన భారతీయవైదిక దృష్టితో జరిగింది. సంప్రదాయచ్ఛాయ సాహిత్యంపై ఎంతవరకువుందో పరికించబడింది. ఒక సంప్రదాయ శిథిలంపై మరొక సంప్రదాయం తలెత్తట మంటే తత్సంప్రదాయ తిరస్కారణం జరిగిందనేకదా అర్థం. అంటే సంప్రదాయంలో ప్రయోగం జరిగిందని భావన. ఆపైన సంప్రదాయంపై జరిగిన ప్రయోగాలు పరిశీలింపబడ్డాయి.

రెండవ ప్రకరణంలో కవి కవితశబ్దార్థ స్ఫూర్తి సంస్కృతాంగ్ల నిర్వచన దీపికలతో తారతమ్యదృష్టితో పరిశీలింపబడింది.

మూడో ప్రకరణం ప్రాచీనాంధ్ర కవిత్వంలో నూత్నప్రయోగ దృష్టితో సాగింది. నన్నయనాటినుంచి వేమన కాలంవరకు, కవులలో నూత్నదృష్టి, కవితలో క్రొత్త ప్రయోగాలు, స్థాలీపులాక న్యాయంగా

పరిశీలింపబడ్డాయి. పందొమ్మిదో శతాబ్దం అధునికతకు ఎటువంటి అవకాశం ఇచ్చిందో చూడబడింది.

నాల్గో ప్రకరణ నవ్యకవిత్వ మహోదయ పరిశీలనం. ఆధునిక కవితకు కట్టమంచి 'ముసలమ్మ మరణం' వేగుచుక్క అయితే తిరుపతి వేంకట కవుల సాహితి తొలి వెలుగు. తరువాతనే ఈ మహోదయం. ఇందులో ఆధునిక కవితావిర్భావహేతువులు తల్లక్షణాలు, యుగకర్త నిర్ణయ ప్రయత్నం, కాల్పనికోద్యమం పరిశీలింపబడ్డాయి.

భారతదేశంలో మత సంప్రదాయంలో జరిగినంత ప్రయోగం ఇంకెక్కడా ఏమతంలోనూ జరగలేదేమో ననిపిస్తుంది. అనిపించటం వ్యక్తిగతం. మతం భయంయొక్క రూపాంతరం అనుకొనే నాకు ఇంతభయం ఇంకెక్కడలేదేమోననీ అనిపిస్తుంది. హిందూమతం దాన్నుంచి బౌద్ధమతం, జైనమతం, సిక్కు, పార్సీ, వైష్ణవ, శైవ, హీనయాన, మహాయాన మహమ్మదీయ మతం క్రైస్తవమతం పిచ్చిభయం—భారతదేశంలో మతవిషయక ప్రయోగం అత్యధికమయింది. మతప్రయోగంగూర్చి డా. సి. నారాయణరెడ్డి అల్పంగా స్పృశించి వదిలివేసినట్లు అనిపించింది. సమగ్రంగా మతసంప్రదాయ ప్రయోగ పరిశీలనకు ఈ గ్రంథంలో అవకాశం తక్కువ కావటమే అందు క్కారణం కావచ్చు.

అయిదో ప్రకరణంలో ఆధునిక కవితకు ఇద్దరు యుగకర్తలుగా చెప్పటానికి ప్రయత్నం జరిగింది. ఆధునికాంధ్ర కవిత్వయుగకర్త నిర్ణయ ప్రయత్నం అనేసరికి అనేకాన్ని ఏకంగా భావించినా, ఏకాన్ని అనేకంగా భావించినా, తిరుపతి వేంకటకవుల ప్రసక్తి తప్పనిసరి అనిపిస్తుంది. అదిలేదు. శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీశ్రీ వాళ్లనుగూర్చి ఆలోచన జరిగిందా అనే అనిపిస్తుంది. అదిలేదు. ఆ యిద్దరు యుగకర్తలు గురజాడ రాయప్రోలు. గురజాడ కవిత్వం అంతా నాకు నచ్చదు. ఆ నచ్చిందే చాలా బాగా నచ్చింది. రాయప్రోలు కవిత్వం శ్రీ విశ్వనాధ, శ్రీ జాషువా శ్రీ నారాయణరెడ్డి కవిత్వంలాగా హాయిగా నేవుంది. రాయప్రోలు కవిత్వంలో ఇంత వైశిష్ట్యంవుందా అని నాకు ఇంతకు పూర్వం అనిపించలేదు. ఈ గ్రంథం చదివిన తరువాత రాయప్రోలు కవిత్వం చదువుకోవలసిన దృష్టి భిన్నంగా ఉండాలనిపించింది. ఈ దృష్టితో రాయప్రోలు చాలా విశిష్ట కవిగా, కాదూకూడదూ అంటే ఆధునిక యుగకర్తగా అనుకొనేటంత లోతుగా డా. సి. నారాయణరెడ్డి చేసిన పరిశోధన ప్రశంసాపాత్రం.

రాయప్రోలు ప్రభావం నేటి ఆంధ్ర గద్యపద్య రచనలపై ఎంతో ఉందని పిస్తుంది. సాహిత్యంలోనే కాదు సమాజ భావనలో వ్యవస్థలో ఆ కవి ప్రభావం మహోన్నతమయిందే అనీ తలంపు కలుగుతుంది. పనిలో పనిగా అమలిన శృంగారంగూర్చి చెబుతూ ప్లెటానిక్ లవ్‌ను గురించి వ్యాసకర్త చేసిన వివరణ విపులంగావుంది.

ఆరో ప్రకరణం భావకవిత్వం. భావకవిత్వ నిర్వచనంగా పలువురు ప్రకటించిన అభిప్రాయాలు ప్రవచించటం జరిగింది. సామాన్య లక్షణా న్వేషణమూ జరిగింది. ప్రణయ కవిత్వం, ఆత్మాశ్రయ కవిత్వం స్థూలంగా కాదు, సూక్ష్మంగా పరిశీలన పొందాయి. దేశభక్తి కవిత్వం, సాంఘిక వాతావరణంనుంచి, జాతీయాభిమానం ఊతగా, ఆంధ్రోద్యమం అండగా శౌర్య, ఐశ్వర్య, కళా, క్షేత్రప్రశస్తులు తోడ్పడగా ఎలా ఆవిర్భవించిందో తెలుపబడింది. ప్రకృతి కవిత్వంయొక్క పరమరమణీయ దర్శనంతో పల్లెప్రజల, స్వభావం స్వరూపం, జీవితం స్వచ్ఛందత వివరింపబడ్డాయి. సంఘ సంస్కరణ కవిత్వం సంఘస్థ దోషక్షాళనార్థంపొందిన రూపభిన్నత— కులమూ, మతమూ, స్త్రీపురుష జీవిత విధానాలు సంఘ జీవితంలో దోషాలూ—పరికింపబడింది. భక్తి కవిత్వంలో టాగూర్ ప్రభావ కవితా ధోరణి అనుశీలింపబడింది. స్మృతి కావ్యాలు ఎన్నివిధాల స్మృతులతో (నాయక, సతీ, సుత, ఆప్త ఆది) వెలిశాయో గమనింపబడ్డాయి.

ఏడవ ప్రకరణం, అభ్యుదయ కవిత్వం. ఇందులో భవిష్యద్వాదం, విధ్వంసనవాదం, అధివాస్తవికత, భావి చిత్రవాదం, ప్రతీకవాదం, వామపక్షీయవాదం మొదలగు తిరుగుబాటు తత్త్వ ప్రాచీనతాధునికతా పరిశీలనం జరిగింది. ఆ కోవలో కవుల కవితలూ పరిశోధింప బడ్డాయి. ఈ నూతన అభ్యుదయ కవితా యుగానికి శ్రీ శ్రీ శ్రీ యుగకర్తగా ఆలోచనం జరిగింది. శ్రీ శ్రీ శ్రీ పై సంప్రదాయ ప్రభావం అధికం అన్నధోరణిలో సాగిన రచనా భాగం కొందరిని ఎక్కువగా ఆకట్టుకొంటుంది. అభ్యుదయ కవితోద్యమం సాగిన తీరు సమగ్రంగా చర్చింపబడింది.

అష్టమ ప్రకరణంలో అతినవ్య కవితాధోరణులు తిలకింపబడ్డాయి. ఆధుని కాంగ్ల కవితాధోరణిలో సాగిన రచనలు, చివరకు దిగంబర కవిత్వంవరకు ఇందులో చోటు చేసుకొన్నాయి.

తిరుపతి వేంకటకవుల కవిత్వం ప్రాచీన కవితకు భరతవాక్యం నవీన కవితకు నాంది వాక్యం అని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం ప్రకటించిన

అభిప్రాయం కీ. శే. కట్టమంచి 'ముసలమ్మ మరణం' కు పరిచయం వ్రాసే టప్పుడు తడబాటుపడితే, డా. సి. నారాయణ రెడ్డి దానికి ఇచ్చిన అన్యాయం పరికింపదగింది. ఆధునికాంధ్ర మహోదయానికి వేగుచుక్క— ముసలమ్మ మరణం, తొలి వెలుగు తిరుపతి వేంకటకవుల కవిత్వం.

శ్రీ శ్రీశ్రీ చిన్నయసూరిని గూర్చి నవీనకాలంలో పరిశేషించిన ప్రాచీనుడు అన్నట్టుగానే తిరుపతి వేంకటకవులను గూర్చి అనవచ్చు: ప్రాచీనత, ఆధునికతల ప్రసక్తి అవతల ఉంచి ఆలోచిస్తే తిరుపతి వేంకట కవులు కవితా శిఖరాలు.

ఒక వ్యక్తిని, రచయితను కవిని అగ్రేసరుడని ఎందుకు అనటం? తెలుగు దేశంలో ఉత్తమ కవిత్వం ఆవిర్భవించింది. తెలుగుదేశంలో మహోత్తమ కవులున్నారు అంటె చాలదా? కొంతమందికి చాలదు. అందుకే ఆధునిక యుగకర్త ఎవరు అని అనేకులు చేస్తున్న ప్రయత్నం. ఇందువల్ల ఫలానా వ్యక్తి యుగకర్త అని స్థాపింపబడినా లేకపోయినా పై ప్రయత్నంలో ఆ వ్యక్తి సాహిత్యంమీగ కొంత ఆలోచన, కొంత చర్చ జరుగుతుంది. అది సద్విషయం.

మనదేశంలో దేవుళ్లెక్కువ. నాయకు లెక్కువ. నాయకులు కొంత కాలానికి దేవుళ్లు. ప్రజా మార్ఖ్యం పెట్టుబడి చేసుకొనే ధోరణు లివి. మనకు సాహిత్యంలోనూ ఎవరో ఒకరు నాయకుడుగా ఉండాలి. నాయకత్వ లక్షణాలులేని నాయకులు ప్రత్యల్ప విషయానికి ఫలానా నాయకుడే అభిప్రాయం ప్రకటించాలనే మన ధోరణికి భిన్నంగా భిన్నరంగాలలో భిన్న నాయకులు—నాయకత్వ లక్షణ శోభితులు ఉంటే తప్పలేదేమో!

బెంగాలీ వాళ్లకు టాగూర్ ఉన్నాడు. తమిళులకు భారతి ఉన్నాడు. మనకెవరున్నారు అని వాపోయే వాళ్లున్నారు. ఆంధ్రులు ఎవరికో ఒకరికి పట్టాభిషేకం చేసి సింహాసనం మీద కూర్చోబెట్టి, ఇంటా బైటా పూజలు పునస్కారాలు ప్రారంభిస్తే ఏం? మంచిదే కదా? అనేవాళ్లకు ఏం సమాధానం చెప్పవచ్చు?

ఈ మా కవి మా జాతి కవి జాతీయ కవి అని చెప్పుకోవటం ప్రాథమిక దశ. వీళ్లు మా కవులు. ఇది మా కవిత్వం అని చెప్పుకోవటం అభివృద్ధి సూచకం. ఏకవాక్యత లేనిచోట ఏకవాక్యత సముపార్జనయత్నం హర్షదాయకం. ఏక వాక్యత కుదిరిననాడు అనేకత ఆనంద సంపాదకం. నేటి ఆంధ్ర జీవితం

కవిత్వంలో లాగానే ఏకవాక్యతలేని వ్యవస్థ. కవి ఎవరో కంటె కవిత్వం ముఖ్యం. కవినిగూర్చి కాదు ఆరాధన, కవితను గూర్చి. మాకు ఉత్తమ కవి ఉన్నాడనే కంటె ఉత్తమ కవిత్వం ఉందనగలగటం శ్రేయస్కరం. ఈ మధ్య కలకత్తాలో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సులో 'బెంగాలీ సాహిత్యంలో కవులు పుట్టకుండా చేశాడు టాగూర్' అని అర్థవంతంగా ఎవరో ప్రొఫెసర్ చెప్పినట్లుగా మిత్రులన్నారు.

మాకొక ఉత్తమకవి ఉన్నాడనేకంటే మాకందరో ఉత్తమ కవులున్నారనీ, మా దేశంలో ఒక ధనికుడున్నాడనేకంటె మాకందరో ధనికులున్నారనీ, మా దేశం ధనవంతమనీ, మాకొక తెలివితేటలున్న మనిషి వున్నాడనేకంటే మేమంతా తెలివితేటలు గలవాళ్లం అనగలిగే దశకల సమాజం సర్వ శ్రేష్ఠమయింది.

మాకు ముక్కోటి దేవతలున్నారని గుట్టకొకరూ పుట్టకొకరూ కాకుండా; మాకెందరో నాయకులున్నారని అంతఃకలహాల హాలాహలం విందు పానీయంగా అందించుకోకుండా; మా ఆ ఫలానా నాయకుడు విద్య విషయంలో వైద్యం విషయంలో వ్యవసాయం విషయంలో తుదిమాట చెప్పగల సమర్థుడని గుడ్డిగా నమ్మకుండా; అన్ని రంగాలలో అనేకత వర్ధిల్లటం సంఘానికి వ్యక్తికే ఎప్పుడూ శ్రేయస్కరం. అయితే అది తోవ తప్పకూడదు.

ఒక వ్యక్తి, తన కాలంలో, తదనంతర కాలంలో, ఆంతరంగా, బాహిరంగా తెచ్చిన పరిణామం, సాధించిన అభ్యుదయం దృష్టిపథంలో నిలుపుకొని ఆ వ్యక్తి వ్యక్తిత్వాన్ని ఆ వ్యక్తిత్వ ముద్రగల సమాజాన్నీ చూచి ఆ వ్యక్తిని నాయకుడుగా భావించటం ఉచితం, ఆంధ్ర సాహిత్యంలో యుగకర్త ఆలోచన ఆ తీరులోనే జరగాలి.

ఆధునికాంధ్ర కవిత్వంలో ఇద్దరు యుగకర్తలు ఉన్నట్లుగా డా. సి. నారాయణ రెడ్డి తలంపు. అంటే యుగకర్తలేడని సారాంశం! సాహిత్య రంగంలో ఒక్క కవిత్వం వ్రాసిన వ్యక్తినే యుగకర్త అనాలా! తదితర రచనా ప్రక్రియలలో సిద్ధహస్తుల మాటేమిటి!

అప్పుడా యిద్దరిలో శ్రీ రాయప్రోలుకంటే గురజాడ ప్రముఖంగా కనిపించవచ్చు. గురజాడ రచనా వైవిధ్యం దృష్టితో ఆలోచిస్తే తిరుపతి వేంకటకవులు దీప్తిమంతంగా గోచరింపవచ్చు. సంఘ చైతన్యం, సాహిత్య పరిణామం సాధించినవాళ్లను పరిశీలిస్తుంటే గురజాడకంటే కందుకూరి అధికుడుగా కనబడవచ్చు.

ఒక ఉద్యమం ప్రారంభించినవాడా, పారం చూచినవాడా అధికుడు అని ఆలోచిస్తే ప్రారంభకులయిన వారికంటే పరిణతపొందిన వాళ్లెక్కువగా కనిపించవచ్చు.

అందుచేత యుగకర్త ఎవ్వరన్న విషయంలో ఎవ్వరో ఒక్కరన్న నిర్ణయం అతివ్యాప్తి అనావ్యాప్తి దోషభూయిష్ఠం కాకుండా పోదు. అందువల్ల ఆ ప్రయత్నమే అక్కరలేదు. అందుకే నేమో డా. సి. నారాయణరెడ్డి యుగకర్త లిద్దరు అని చెప్పబూనింది.

డా. సి. నారాయణరెడ్డి ఆధునికకవులలో సముచిత స్థానంలోవున్న సంగతి రసజ్ఞులు గుర్తించిందే. ఆ దృష్టితో ఈ గ్రంథం పరికిస్తే ఆశాభంగం కలుగుతుంది. తనను గూర్చి తాను వ్రాసుకొనటం కొంచెం కష్టమయిన పనే! కవి అయిన ఏ వ్యక్తిని గూర్చి అయినా, కవితా పరిశీలనం చేస్తున్న విమర్శలో సమగ్రంగా వ్రాయకపోతే గ్రంథంలో కించిల్లోపం ఎదురవుతుంది. లోపం అంగీకరించటానికే ఒప్పుకొని ఆత్మస్తుతి పరిహరించిన ఉచితజ్ఞత ఉన్న విమర్శన దృష్టి పరిశోధన పాటవంగల వ్యక్తి డా. సి. నారాయణరెడ్డి.

నలుగురితో నారాయణ అన్నట్లుగా పదిమంది కవులపేర్లు తరతమాలు లేకుండా వ్రాస్తున్నప్పుడు తనపేరు చేర్చి, ఈ కవిని నేను పరిత్యజింపలేదని చిరు హెచ్చరిక చేయగల సామర్థ్యం ఈ వ్యాసకర్తకుంది.

కవితాహృదయం ఉన్న పరిశోధకుడి వ్రాతలో వచనంలో కవిత్వం తొంగిచూడక తప్పదు. ఈ గ్రంథంలోంచి వెలికితీసిన కొన్ని వచన భాగాలు ముద్రిస్తే ఒక చక్కని కావ్యం అవుతుంది. పలుతావుల్లో విమర్శ కవితా స్థాయి చేరుకొంది.

హృదయాహ్లాదకరంగా ఉన్నటువంటి ఈ కవితాధోరణివల్ల ఈ విమర్శ గ్రంథం చదువరులు హాయిగా చదువుకొంటూ పోతారు. వేసవిలో చలివేంద్రంలాగా ఈ విమర్శ రచనలో కవితాధోరణి హాయినిస్తుంది.

పలు విమర్శ వ్యాసాలు గ్రంథాలు చదువరులందరూ చదువలేకపోవచ్చు ఓపిక వున్నా. అయితే ఈ గ్రంథం చదువలేనివారు, ఎవరు ఉండకపోవచ్చు. చదివితే అర్థంకాని సంగతి ఎవరికీ కనుపించకపోవచ్చు.

ఈ గ్రంథం సర్వసమగ్రంగా విషయ వివరణ కలిగించిందా లేదా అంటే కలిగించిందనే సమాధానం చెప్పుకోవాలి. అంతమాత్రం చేత ఏ విధమయిన దోషమూ లేదా అంటే లేదని ఎలా చెప్పగలరెవరయినా! గుణాధిక్యం,

గుణాల్పత్వంవల్ల మంచిచెడ్డలు నిర్ణయింప బడతాయి. ఈ గ్రంథం గుణాధిక్య శోభితం.

పదాలను వ్యావహారిక రూపాలనీ, గ్రాంధిక రూపాలనీ, చిన్నయసూరి వ్యాకరణం ఆధారంగా చెప్పటానికి వీలుంది. ఆ దృష్టితో చూస్తే కొన్ని వ్యావహారిక రూపాలు ఎదురవుతాయి.

ఈ వ్యావహారిక రూపాలకు వ్యవస్థ కల్పింపబడితే భాషాదోషం చూప టానికి వీలుండదు. వ్యవస్థ ఎవరు కల్పిస్తారు? సమర్థులు. ఎవరు సమర్థులు? ఇంత పరిశోధనచేసిన వ్యక్తికంటే ఇంకా భిన్నంగా సమర్థు లెవరుంటారు? ఈ గ్రంథంలోని రూపాలు చాలవరకు భవిష్యదాంధ్రంలో అచ్చమయిన స్వచ్ఛ రూపాలు కావచ్చు.

ఆంగ్ల వాక్యాలకు ఆంధ్ర వాక్యాలు అనువదింపకపోయినా నష్టంలేదు. అనువాదంలో ఉండే కష్ట సుఖాలు పలువురెరిగినసంగతే! అయినా అనువాదం అతివ్యాప్తి అనావ్యాప్తి పొందకుండా చూడవలసిన అవసరం వుంది. ఆంగ్లంలోని వాక్యాలు తెలుగుగా రూపొందిన కొన్నిచోట్ల అనువాదం సుందరంగా లేదు. ఇట్లా చెబితే స్పష్టంగా లేదనుకోవచ్చు. ఉదాహరణ: 73-వ పేజి. 'The impassioned expression, which is in the countenance of all Science—Wordsworth' దీని అనువాదం 'సమస్త శాస్త్రములయొక్క సత్యముల ఆవేశభరితమైన అభివ్యక్తి కవిత్వము.' 'Impassioned expression' అంటే ఆవేశభరితమైన అభివ్యక్తి కాదు. Countenance అంటే సత్యమూ కాదు. ఇది ఒకటి మాత్రమే! ఇటువంటివి అధికం కాదు. సమస్త శాస్త్రములయొక్క సత్యముల అనేకంటే సమస్త శాస్త్ర సత్యముల అంటే సరిపోతుంది కదా! స్పష్టత దృష్టితో వాక్యాలు దైర్ఘ్యం పొందాయి.

రెండు మూడు విధాల గోచరమయ్యే దోషాలవంటివి ఇంత ఉత్తమ శ్రేణి గ్రంథంలో ఎదురయి కించిత్తు బాధ కలిగిస్తాయి కాబట్టి చెప్పవలసి వచ్చింది. అవీ లేకపోతే—అనూహ్యం-ఏ సృష్టి ఉండదు. లోపాలులేని సుందర శిల్పం కంటే లోపాలున్నా ప్రాణంవున్న చైతన్యంవున్న వ్యక్తిని సమాజం కోరు కొన్నట్లే సరస సాహితీపరులు ఈ గ్రంథం ఆనందంగా స్వీకరిస్తారు.

సమస్తాంధ్ర సాహిత్యంలో కవిత్వం ప్రధానభాగం. అందులో ఆధునిక కవిత్వం వైవిధ్య సంభరితం. ఆ కవిత్వంలో సంప్రదాయం ప్రయోగాలు అన్వేషించిన ఈ గ్రంథం తెలుగువాళ్లు అవశ్యం చూడదగింది.

విమర్శకుడికీ పరిశోధకుడికీ ఉండవలసిన భాషాపరిజ్ఞానం విషయగ్రహణ తత్త్వం, వివరించే నేర్పు, మానసిక స్థితి మొదలయిన అన్ని అర్హతలు ఈ వ్యాసకర్త కున్నాయి. ధర్మ పక్షపాతం, నిజాయితీ గ్రంథం చివరికంటా ఈ గ్రంథకర్తను చూపుతూ వుంటాయి

సాహిత్య విద్యార్థులను ఈ గ్రంథం బహువిధాల ఉపయోగపడుతుంది. సాహిత్యవేత్తలను అనుక్షణం వెంట వుండదగింది. పరిశోధకులు పరిశీలింపదగింది.

సినిమా పాటలు ఎంతమందికి ఎంతకాలందాకా గుర్తుండేటట్లు డా. సి. నారాయణరెడ్డి వ్రాసినట్లో ఎవరయినా చెప్పాలి. ఒకనాడు సాంప్రదాయికంగా కవితాసృజనం చేసి, నేడు ప్రయోగం చేస్తున్న ఉత్తమ కవి డా. సి. నారాయణరెడ్డి కవిత్వం కలకాలం నిలిచేది ఎంత సృజింపబడిందో, ఎంతకాలం నిలుస్తుందో కాలమే తేల్చి చెప్పాలి. కాని, ఈ గ్రంథం 'ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు — ప్రయోగములు' తెలుగు కవిత్వపు ఒకానొక దశాపరిణామం వివరించే విమర్శన గ్రంథంగా తెలుగు జీవించి ఉన్నంతకాలం ఉంటుంది.

[ఆంధ్ర దినపత్రిక '69]

# కన్యాశుల్కము – ప్రథమ ముద్రణ

మొట్టమొదటి కన్యాశుల్కము విపుల వ్యాఖ్యాన వివరణతో శ్రీ బండి గోపాలరెడ్డి ప్రచురణ ఈ పరిశీలనకు స్వీకృతం.

కన్యాశుల్కము ఒకనాడు సాంఘిక లోపం. ఈ కన్యాశుల్కం – గురజాడ సృష్టి – సాహిత్యంలో మైలురాయి. వ్యవస్థలో లోపం రూపొందించిన ఈ నాటకం సమాజాన్ని కొంతవరకు హృదయాలను మరింతవరకు ఇంకొంత వరకు క్షాళనం చేసింది. చేస్తుంది.

ఈ నాటకం మొదటి ముద్రణ తేదీ 1-1-1897. రెండవ ముద్రణ 1-5-1909. ఈ మధ్యకాలం దాదాపు పన్నెండున్నర సంవత్సరాలు. ఈ వ్యవధిలో రచయితలో వచ్చిన మానసిక పరిణామం రెండో ముద్రణలో గోచరిస్తుంది. తత్ఫలితంగా అనేకమైన మార్పులు చేర్పులు నాటకంలో చోటు చేసుకొన్నాయి.

'Ninety nine girls were married at the age of five years, forty four at four, thirty six at three, six at two, and three at age of one !—the babies in the last instances carrying a price of from three hundred and fifty to four hundred rupees a head. Strange, as it may sound, bargains are some times struck for children in the womb.' [1]

ఇది కన్యాశుల్కం. కన్యాశుల్కేతి వృత్తం. 'I clothed the play in the spoken dilect.' [2]

ఇది భాష. సజీవభాష. నాటకంలో ప్రయుక్తం. ఈ ఇతివృత్తం, భాష – వీటితో కూడిన హాస్యం కలగలుపుగా ఏర్పడిన త్రివేణి సంగమం కన్యాశుల్కం నాటకం.

ఇతివృత్తం విషయంలో రచయిత అభిప్రాయం మారలేదు. భాష విషయంలో మారింది. హాస్యం విషయంలో మారింది.

కన్యాశుల్కం మొదటి ముద్రణలో భాషకంటే, ద్వితీయ ముద్రణలో భాష, చాలవరకు మాండలికంగా సజీవమయింది. 'There is not much dialectical difference in Telugu generally spoken in the various parts of the Telugu country' అనే గురజాడ అభిప్రాయం ద్వితీయ ముద్రణ నాటికి మారింది. మాండలిక ప్రవిభేదాల ఆంతర్యం — ఆత్మశక్తి — అవగతమయింది.

హాస్యం విషయంలో రెండవ ముద్రణ ఉదాత్తత సముపార్జించుకొంది. ప్రథమ ముద్రణలో హాకర్ పాత్ర అందించే హాస్యం ఆస్వాద్యస్థాయి దాటిందని గుర్తించే కాబోలు మలి ముద్రణలో రచయిత మార్పు చేయటం.

ప్రథమ ముద్రణలో కథ వేగంగా సాగుతుంది. మలి ముద్రణలో సంభాషణలు అధికంగా పెరిగిపోయాయి. నాటకం చకచకా సాగదు. అందుకే ప్రదర్శించేవారు అధికంగా ఎడిట్ చేసుకోవలసి రావటం.

ఇతివృత్తం, భాష, హాస్యం, పాత్రలు రెండవ ముద్రణలో పొందిన పరిణామం అంతింతనరానంత! ఈ రెండవ ముద్రణ నిజంగా మొదటి ముద్రణ మీదే ఆధారపడిందా లేక గురజాడ క్రొత్తగా ఈ రచన చేశాడా అన్నంత విస్తృతంగా పెరిగింది.

ఏ కొద్దిమందికో తప్ప ప్రథమ ముద్రణ ప్రతి చదివే భాగ్యం లభ్యం కాలేదు. అందరూ చదివింది, అధిక ప్రజా హృదయ సమీపస్థమయిందీ, ద్వితీయ ముద్రణ కన్యాశుల్కం.

సాహిత్య జిజ్ఞాసువులు, పరిశోధనా రిరంసువులు, ప్రథమ ముద్రణ రూపం చూడాలని కోరటం వింతకాదు. శ్రీ బండి గోపాలరెడ్డి — బంగోరె — ప్రథమ ప్రతి బహు శ్రమను గుర్తై సంపాదించి, సాహిత్యలోకానికి కానుకగా సమర్పించడం ప్రశంసా పాత్రం.

ఆర్థికంగా, హార్దికంగా, శారీరకంగా, మానసికంగా చేసిన బహు పరిశ్రమ పరిశోధనల ఫలితం ఈ కన్యాశుల్క ప్రతి. శ్రీ బంగోరె కన్యాశుల్కంపై, తద్రచయితపై ఎవరెవరు, ఎప్పుడెప్పుడు, ఎక్కడెక్కడ ఏవి విషయాలు వెలిబుచ్చారో అన్నింటినీ స్వీకరించి తారతమ్యం పరిశీలనచేసి, సద్విషయం సమర్థించి, అసద్విషయం సహేతుకంగా విమర్శించి, పరిశోధనా దృష్టి ప్రపంచించటం; ప్రథమ ప్రతిలో ప్రస్తావించిన ప్రత్యంశం చాలావరకు, సాంఘిక, రాజకీయ, ఆర్థిక సారస్వత సంగతులను సంబంధించిన ఇతరేతర

సమాచారం, బహుదా బహుధా సంపాదించి వివరణాత్మకంగా నాటకానికి జోడించటం; నాటకంలో పేర్కొనబడి అవ్యక్తంగా ఉన్న ఏ అల్పవిషయమయినా ఆధారసహితార్థ వివరణాత్మకం, కాకపోతే, అది విపులంగా వివరించేవరకు శ్రీ బంగోరె చేసిన కృషి ఉత్తమ మార్గంలో సాగటంచూచి; సరసులు, సహృదయులు అయిన సాహితీపరులు సరసంగా ఆనందిస్తారు. కొన్ని సంవత్సరాల కృషి ఫలితంగా ఈ నాటకం ఈ రూపంలో గోచరిస్తుంది. ఈ కృషి, కృషిచేసిన తీరు ఉత్తమ స్థాయిలో జరిగాయి. ఆంధ్ర భాషాచార్యులు[3] ఈ పరిశోధనాత్మక కృషి పి హెచ్.డి. డిగ్రీ పరిశీలనకు సమర్పింపపడగిన స్థాయిలో ఉన్నదని అభిప్రాయం వ్యక్తీకరణచేయటం ఆనందకర విషయం.

'శ్రీ కె. వి. రమణారెడ్డి నుండి పొందిన ప్రేరణతో — శ్రీ ఆరుద్రగారి పర్యవేక్షణలో' ఈ కృషి జరిగినట్లు ఈ ప్రతి అట్టమీదే స్పష్టంగా తెలుస్తుంది. శ్రీ కె. వి. రమణారెడ్డి గురజాడ సాహిత్యమూ, జీవితమూ, జీవిత సాహిత్యమూ గూర్చి చాలా సమగ్రంగా ఆలోచించిన మనీషి! 'గురజాడ వెలుగు జాడ'[4] 'మహోదయం'[5] గ్రంథ రచనతో గురజాడగూర్చి నిరంతరం ఆలోచిస్తున్న పరిశోధనా దృష్టిగల రచయిత రెండు గ్రంథాలలో, మొదటిదానికి, రెండవది విస్తృత రూపం. నూత్న విషయం, నూత్న దృష్టి నూత్నాలోచన చోటు చేసుకొన్న రచన.

ఆదికాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన ఆధునిక కాలంలో గురజాడ మన తెలుగులో మహాకవులు.[6] ఈ అభిప్రాయం పైముగ్గురు అంగీకరిస్తారనేది నిరభ్యంతరాభిప్రాయం. మధ్యకాలం అనకుండా వేమనది ఏకాలమో శ్రీ శ్రీ శ్రీ చెప్పివుంటే కొంతవరకు వేమనకాలం తెలిసివుండేదేమో! అయినా కాలం తెలియకపోతే మాత్రం కలిగే నష్టం ఏముంటుంది?

'కన్యాశుల్కము' నిర్వివాదంగా ఉత్తమ ప్రపంచ నాటకం. ప్రపంచంలో ఏ భాషలోనికి అనువదింపబడినా, ఇది ఆంధ్రుల జీవితమూ, సాహిత్యమూ ఆ భాషలవారికి చూపగల రచన. అందుకే 'సమకాలిక ప్రపంచ నాటకాల్లో గురజాడ కన్యాశుల్కం స్థానం' గూర్చి సముచితంగా శ్రీ బంగోరె చేసిన పరిశీలన, నాటకరంగములో 'కన్యాశుల్కము' గొప్ప ప్రయోగము,[7] అనే అభిప్రాయంతోనూ తదితరాలయిన భిన్నాభి మతాలతో ఏకీభవిస్తుంది. శ్రీ నార్ల ఆమోద ముద్ర లభ్యమయింది.

కథ వేగంగా సాగే ప్రథమ ముద్రణ నాటకమూ, కథాగమనం తగ్గి, నిదానంగా 'ఎవరీ నాటకాన్ని ప్రయోగించినా యిందులోవున్న ప్రధాన యితివృత్తాన్ని విడదీసి, అందుకు విరుద్ధంగావున్న భాగాలన్నిటినీ త్రోసిపుచ్చి ప్రదర్శించే'[8] ద్వితీయ ముద్రణ నాటకమా ప్రపంచ నాటక స్థాయి చేరుకొనేది అని ఆలోచిస్తే క్లైష్ట్యం ఎదురుకావచ్చు. ప్రథమ ముద్రణలో పాత్ర స్వరూప స్వభావ తైక్ష్ణ్యంకంటె ద్వితీయ ముద్రణ కన్యాశుల్కం ఉదాత్తంగా గోచరిస్తుంది. ఏ నాటకమయినా ప్రదర్శనకు అలతి మార్పులు చేయవలసి ఉంటుందనేది నిర్వివాదాంశం. కన్యాశుల్కం అధికంగా మార్చుకోవలసి ఉంటుంది. అయినా అంతమాత్రం చేత, దాని స్థాయికి లోపం లేదనీ ద్వితీయ ముద్రణమే ఉత్తమస్థాయి, ప్రపంచ స్థాయి నందుకొనదగిన స్థాయిగల నాటకంగా భావించవచ్చు.

శ్రీ బంగోరె విపుల వ్యాఖ్యానంతో ముద్రించిన కన్యాశుల్కం అట్ట చూడగానే, ప్రాచీనతా స్ఫురణ గోచరమవుతుంది. 'అభిఘారము' లో శ్రీ ఆరుద్ర గురజాడ విషయంతోపాటు స్వవిషయంకూడా అనుబంధించటం పాఠకులు గమనిస్తారు. తన్మూలంగా నాటకం గూర్చిన చారిత్రక విషయాలూ తెలుస్తాయి.

'మధురవాణి పాత్ర: ఒక పరిశీలన' — ఒక పరిశోధన వ్యాసం. శ్రీ ఆరుద్ర రచన 'పరిశోధన' పత్రికనుంచి పునర్ముద్రితం. 'కన్యాశుల్కం రచన పూర్వోత్తర ప్రతుల పరిశీలన' వ్యాసం శ్రీ అబ్బూరి రామకృష్ణారావు రచన. ఈ రెండు వ్యాసాలలో రెండు ప్రతుల పరిశీలనానంతరం తేలిన ప్రధానమైన మార్పులు చెప్పాలని తలంపే అయినా, పూర్తిగా చెప్పలేదనిపిస్తుంది. ఒక సమగ్ర వ్యాసం, రెండు ప్రతులు పరిశీలించి, చేసిన మార్పులు చూపుతూ తత్ప్రయోజనం వివరిస్తూ వ్రాయవలసిన అవసరం వుంది.

శ్రీ బండి గోపాలరెడ్డి 'ముందుమాటలు' లో గురజాడ పుట్టిన తేదీ చర్చ, ప్రతాప రుద్రీయ, కన్యాశుల్క ప్రాచీనతాలోచన, ప్రపంచ నాటకాల్లో కన్యాశుల్క స్థానం, నాటకంపై వివిధ విమర్శలు, నాటక లక్షణ పరిశీలన, మొదలయిన అనేక విషయాల సవిమర్శకంగా ఉల్లేఖించటం పాఠకులు ఉత్సుకతతో గమనిస్తారు. శ్రీ బంగోరె చేసిన కృషికూడా వ్యక్తమవుతుంది.

మొదటి యంకము—ఇది వ్యావహారిక రూపంకాదు. మొదటి అంకం— ఒకటో అంకం మొదటంకంవంటి రూపం ఏదో ఉండాలి. ఈ పదంమీద

శ్రీ బంగోరె వ్యాఖ్యానం చూడవచ్చు. 'మొదటి యంకము:—ఇది వ్యవహారానికి దూరమయిన సమాసం, చిన్నయసూరిగారి "బాల వ్యాకరణ" బానిసత్వ జనితమైన కృతకమైన గ్రాంథిక ప్రయోగం. "సంధిలేనిచోట అచ్చునకచ్చు పరంబగునపుడు యడాగంబగు" అని బాలవ్యాకరణ సూత్రం.' 'బానిస' పదం దేశ్యమయితే సమాసం ఏమయిందో, 'సంధిలేనిచోట స్వరంబుకంటె పరంబయిన స్వరంబునకు యడాగమంబగు' (సంధి పరిచ్ఛేదం, సూత్రం మూడు,) సూత్రం ఏ విధంగా వ్రాయబడిందో చూచి పాఠకులు ఆలోచిస్తారు.

'భారతదేశంలో మొదట బెంగాల్లో 1780 సంవత్సరంలో మొట్టమొదటిది పత్రిక ప్రచురణ ప్రారంభమైంది—' శ్రీ బంగోరె ఈ అభిప్రాయంకంటె భిన్నమయింది, 'A Study of the History of Telugu Journalism' శ్రీ నార్ల షష్టిపూర్తి సంచికచూచి కలిగివుండే అవకాశం వుంది.

గురజాడ కన్యాశుల్కంలో ఆంగ్లాంధ్ర పద్యాలు చాలా ఉదాహరణలు ఇచ్చాడు. అవి చూచి, వాటి మూలం చెప్పటానికి ఈ బంగోరె ఎక్కువ కృషిచేసి వాటి పూర్తిరూపం రచయితపేరు ఇత్యాదులు సమకూర్చి వ్యాఖ్యానం సుందరంగా చేయటం హర్షింపదగింది.

'నేను నీ కిస్తానన్న మొహరిదుగో పిల్లదాని స్నానం అదీ ఒక్క నిముషములో అయిపోవాలి' అన్నాడు కరటక శాస్త్రి. మీనాక్షి చేతిలో మొహరుంచాడు. దానికి బంగోరె వ్యాఖ్యానం స్నానం చేయించమంటున్నాడేమిటి? స్నానాలదగ్గిర శిష్యుడి అసలువేషం బయటపడిపోదూ! మీనాక్షి కనిపెట్టేయదూ! అందుకు లంచంగా ఈ మొహరం యిస్తున్నట్లా? . . . ఎంత మొహరం లంచంకోసం మీనాక్షి ఆశించిందని భావించినా, కొంప గుండం చేసుకొనే స్థితిలో కరటకశాస్త్రి శిష్యుణ్ణి ఆడ వేషంలో ఆడమనిషిగా ఎలా లుబ్ధావధానుల నెత్తికెక్కించ గలుగుతుంది! అది ఎలా సహిస్తుంది? గురజాడ ఏం భావించాడో ఏమిటో!

గురజాడ సౌజన్యరావు అని వ్రాయబోయి సంజీవరావు అని ఎందుకు వ్రాసినట్లు? అది అచ్చు తప్పయివుంటుందని శ్రీ బంగోరె అభిప్రాయం. మొదట సంజీవరావు అని పాత్రనామం భావించుకొని తరువాత సౌజన్యరావుగా మార్చి అయినా వుండాలి. లేదా సౌజన్యరావు పాత్రసృష్టికి

మూలపాత్ర ఏదైనా సంఘంలో ఉంటే ఆ వ్యక్తి పేరు సంజీవరావు అయి వుంటే అది నాటకంలో చోటు చేసుకొని అయినా వుంటుంది. ఆలోచించవలసిందీ అంశం! అది కాకపోతే లుబ్ధావధాన్లు పేరు పొరపాటున అయినా అలా పలికివుండాలి. లుబ్ధావధాన్లు పొరపాటు పడగలడుగానీ ఇంత పొరపాటు పడతాడా?

'అనుబంధాలు' విస్తృతంగావుంది. ఈ అనుబంధ రచన ఎక్కువగా చేసిన కృషి ఫలితం. 'మై మదర్' పద్యం సంపాదించటానికి శ్రీ బంగోరె చేసిన ప్రయత్నంవల్ల ఈ రచయితపట్టుదల, కార్యదీక్ష, దక్షత పాఠకులకు స్పష్టంగా తెలుస్తాయి.

పరిశోధకుడుచేసిన ప్రయత్న పరంపరకంటె అందించిన సమాచారం పాఠకుడు గౌరవంగా స్వీకరిస్తాడు ప్రయత్న పరంపరవల్ల సానుభూతి పెరుగుతుంది. శ్రీ బంగోరెచేసిన ప్రయత్న పరంపర వివరణ ఈ వ్యాఖ్యానాలలో అధికంగా గోచరమవుతుంది.

వైదిక పదాలు వివరణ చాలా ఉపయోగకరమైన అనుబంధం. చాలా పదాలు ప్రయోగంలో ఉన్నవాటికి, అర్థబోధని కలిగించిందీ అనుబంధం. శ్రీ బంగోరె తెలియని విషయాలు తెలిసిన వాళ్ళదగ్గర తెలుసుకొని తెలియని వాళ్ళకు తెలియ చెప్పకపోతే, ఈ వైదిక పదాలకు అర్థం చాలా మందికి తెలియకపోయేది. పాఠకుడుగా, ఎవరైనా, శ్రీ బంగోరె కృషిని అభినందించి తీరుతారు.

అనుబంధం చివరలో కొన్ని పత్రికలు పూర్వం, కన్యాశుల్కంమీద వెలిబుచ్చిన అభిప్రాయాలు, స్వర్గీయ సి. ఆర్. రెడ్డి అభిప్రాయం, జోడింపబడి ఉండటంచూచి పాఠకులు మొదట్లో కన్యాశుల్కంమీద జనాభిప్రాయం తెలుసుకోగలుగుతారు.

అనుబంధం చిట్టచివర నాటకంలోవచ్చే సామెతలు, ప్రయోగింపబడిన జాతీయాల నుడికారాలు, మాండలిక పదాలు అర్థవివరణతో సమకూర్చబడ్డాయి.

పుస్తకం అట్టచివర రచయిత ఫోటోలు లేకుండా చేస్తుంటారు, చాలమంది రచయితలు. మరి కన్యాశుల్కం ఏఏ దేశీయ విదేశీయ భాషలలోకి అనువదింపబడిందో వివరాలు వ్రాయబడ్డాయి.

శ్రీ బంగోరె కన్యాశుల్కంగూర్చి అన్ని సంగతులు ఇందులో సమకూర్చాలని చేసిన ప్రయత్నం ఆదినుంచి అంతెందాకా స్పష్టంగా గోచరిస్తుంది.

భాషపై రచయిత తనకున్నంత అధికారంలో పరిశోధనా దృష్టితో, సత్యసందర్శనమూ తత్ప్రకటనాభిమతంతో, అత్యంత కృషితో, నిజాయితీతో కన్యాశుల్కం నాటకం బహువిషయ సమగ్రంగా రూపొందించి తెలుగు సాహిత్యానికి మేలుచేసినట్లు మొట్టమొదట కన్యాశుల్కము శ్రీ బంగోరె ప్రతిచూచిన వాళ్లెవళ్లయినా తలుస్తారు. ఇటువంటి ఉత్తమ ప్రయత్నాలు ఎక్కువ గ్రంథాలకూ రచనలకూ లభ్యంకావాలనీ ఆంధ్ర విమర్శన సాహిత్యం అభివృద్ధి చెందాలనీ ఎవరయినా భావిస్తారు.

[ఆంధ్ర దినపత్రిక '69]

1. కన్యాశుల్కం—కొండపల్లి ప్రచురణ 1963.
2. మొదటి ముద్రణ Preface.
3. Dr. G. N. Reddy, M. A., M. Litt., Ph. D., Professor of Telugu, S. V. University, Tirupati.
4. విశాలాంధ్ర ప్రచురణ ఏప్రియల్ రూ. 8·00.
5. ,, మే రూ. 13·00.
6. 'గురజాడ'—శ్రీ శ్రీ విశాలాంధ్ర ప్రచురణ 1959 పుట. 51.
7. 'ఆధునికాంధ్ర కవిత్వము: సంప్రదాయములు, ప్రయోగములు' డా. సి. నారాయణరెడ్డి. పుట 215.
8. గురజాడ శతవార్షిక సంచికలో వ్యాసం 'కన్యాశుల్క రచన' అబ్బూరి రామకృష్ణరావు పుట. 48.

# సాంఘిక నవల—సమాజము

మానవుడు సంఘజీవి. కళాకారుడు తన సృష్టిలో సమాజమును సాక్షాత్కరించుకొని, బాహిర ప్రకృతి మానవాంతర ప్రకృతిని మహిమాన్వితి మొనర్చును. కళాకారుని కోమల హృదయము ద్వివిధ ప్రకృతుల మూలమున స్పందించును. సమాజమునకు దూరముగా కళాతపస్వి మనుగడలేదు. అందుచేత కళాసృష్టిలో ప్రయత్నపూర్వకముగనో, అప్రయత్నముగనో తరతమ భేదములతో ఆ కళాకారుని కన్నతల్లి సమాజము ప్రతిబింబించును.

చతుష్షష్టి కళలలో లలితకళలు ప్రసిద్ధములు. సాహిత్యము పరమోత్కృష్టముగా భావితము. ప్రభాభాసురము. ఇతరేతర సాహితీ ప్రక్రియలలో నవలస్థానము సముచితమయినది. నవలాకారుడు తన నవలయందు ప్రదర్శించినంత సమకాలీన సమాజము మరి ఏ ఇతర ప్రక్రియాదక్షుడును ప్రవచించుట కష్టము. జాగరూకతగల నవలారచయిత యావత్సమాజమును దిఙ్మాత్రముగా చూపి, తల లూపింపగలడు.

ఆంధ్ర జీవితమును చూడ యత్నించు సాహితీ విద్యార్థి, భారతీయేతర భాషలనుండికాని, ఇతరేతర దేశభాషలనుండికాని అనూదితములయిన నవలలవలన సాఫల్యము పొందలేడు. ఆ నవలలలో తెలుగువారల తీరు తెన్నులు తెలియవు. ఆ కారణముగా ఆంధ్ర నవలలయందు మాత్రమే తెలుగుజాతి జీవితము, తెలుగు సమాజము సందర్శనీయములు.

ఇచ్చట ఒక యవరోధమున్నది. నవలలయందే వివిధ రచనావిధానమున్నది. తెలుగువారు స్వతంత్రముగా రచించిన రచనములన్నింటిలో ఆంధ్ర సమాజము అవగతముకాదు. అందుచు సాంఘికములుకాని నవలలు సమర్థములుకావు. ఆధునికులు వ్రాయు చారిత్రాత్మక నవలలుకాని, అపరాధ పరిశోధక నవలలుకాని ఆంధ్ర సమాజమును దర్శించునవకాశము నీయలేవు.

మరియొక ఆటంకము, ఆధునికులు ప్రసిద్ధులు అయిన రచయితలు, రచయిత్రులు ఇతర వాఙ్మయముల నవలలవలన ప్రభావితులై విరచించిన పెక్కు

రచనములలో తెలుగు జీవితము దృగ్గోచరముకాదు. అందువలన తెనుగులో తెనుగువారు వ్రాసిన నవలాసాహిత్యములో కొన్ని నవలల, సమాజ సందర్శన దృష్టితో పరిహార్యములు. బెంగాలీ హిందీ రచనల ప్రభావముతో ఆంధ్ర మందు సృజింపబడిన నవలలు కొన్నింటిలో తెలుగుదనము మృగ్యము.

ఈ ప్రక్రియయందు సమాజ జీవితమును ఒక సంపూర్ణ వ్యవస్థను, స్థూలముగా చిత్రించు అవకాశము, అధికతరము. పరిమితకాలమును స్వీకరించి, ఆ సమయములో సమాజము—ప్రజల జీవితము, వారి మనస్తత్వములు, సుఖ దుఃఖములు, ఆహార విహారములు, ఆచార వ్యవహారములు, సంభాషణములు; సన్నివేశములు, పాత్రల రూపరేఖలు, మనోభావములు, మానసిక సంఘర్షణ ములు ఆశలు ఆకాంక్షలు; ఒక దశనుండి మరొకదశకు, ఒక స్థితినుండి మరొక స్థితికి మనుజుడు, వ్యవస్థ, దేశము పొందుచున్న పరిణామమును, పాత సంప్రదాయముల పరిచ్యుతి, నూత్న సిద్ధాంతముల స్వీకృతి, చిత్రింప వచ్చును. పరిణామశీలియయిన మానవుడు అనూహ్య భవితవ్యమువైపు నిరంతరముచేయు ప్రయాణము, అట్టివారితో కూడియున్న వ్యవస్థ, అది భవిష్యత్తుపై చిత్రింపగల ముద్ర, సాకల్యముగా చర్చించి విరచింపవీలగు సాహితీప్రక్రియ నవల.

ఒక వ్యవస్థను ప్రదర్శింపగల నవలలు తెనుగు సాహిత్యములో 'వేయి పడగలు' 'మాలపల్లి' మొదలగునవి. ఆధునిక జీవిత ప్రభావముతో వెనుకబడి పోవుచున్న నిష్ఠాతత్పరమైన ఆంధ్ర జీవిత విధానమును చిత్రించి, గత సంస్కృతి శిథిలాలపైన పుష్పించి నిలచిన కళాచిహ్నము 'వేయి పడగలు'. వర్ణవ్యవస్థవలన అవర్ణ్యమయిన మానవ జీవితము సమాజగత పరిణామ ప్రవర్థకమై పొందు పరివర్తనము ప్రస్తావించి సాహితీ పరిమళము ఆంధ్ర సమాజమునకు సమర్పించిన నవల 'మాలపల్లి'.

ఇటువంటి నవలలను వ్రేళ్లపై లెక్కింపవచ్చును. ఇంతకాలముగా నవలా రచనము ప్రారంభమయి, ఇంత సముజ్జ్వలముగా జరుగుచున్న ఇంత కాలము లోను, రావలసియున్నంత నవలా సాహిత్యము—వ్యవస్థ చిత్రీకరణ దృక్పథ ముతో—వెలువడలేదని చెప్పవలసియేయున్నది.

పరిణామము జీవద్వస్తువులకు సహజగుణము. సంచలనము, అస్థిరత పరిణామ ప్రదర్శకములు. సమస్యలు పరిణామ కారణములు. ఆధునిక సమాజమున సమస్యలు బహువిధములు, బహుధా ప్రవర్తితములు. సమస్యలు

పరిష్కార వాంఛితములు. పరిష్కారము క్రియాత్మకము, వాగ్రూపమును. వాగ్రూపములలో నవల ఒక ప్రక్రియ.

అంటరానితనము పూర్వము నాలుగు పాదాల వర్తిల్లిన అధర్మము. అనంతరము ఒకటియో రెండుతో వైదొలగిపోయిన అర్థధర్మము. తత్పరిష్కారము సాహితీవేత్తల సదభిప్రాయ మెటులున్నను రాజకీయవేత్తలు, సంఘసంస్కర్తలు, దయచేసిన సమన్వయ మార్గము, కులాంతర, వర్ణాంతర, మతాంతర వివాహ విధానము. అది ఎందరో రచయితల రచయిత్రుల నవలా రచనమునకు ప్రేరకము. ఆ నవలలు అనేకములు అయినను సాధించిన సాఫల్యము ప్రశ్నాత్మకము.

ఒక సమస్యా పరిష్కార ప్రాణములయిన నవలలయందు ఆదర్శవాదనము తద్రతి మిక్కుటము కాని జీవితము, సమాజ సందర్శనము అత్యవసరము. నవల సమస్యలను పరిష్కరింపలేకపోయినను చింతలేదు కాని, సమాజమునకు సమీపస్థము కాలేకపోయిన బాధ. సాహిత్యము సమస్యను ప్రకటించును, పరిష్కార మార్గమును చూపించునుకాని, పరిష్కరింపలేదు.

తెలుగు నవలయందు ప్రపంచితమయినది ముఖ్యముగా హైందవజీవితము, మహమ్మదీయ, క్రైస్తవ మతముల మాటలేదు. హరిజనుల జీవితము చిత్రితమయినది. పంచములపై రచయితలకున్న జాలి, దయ తదితరులపై తక్కువగా నున్నవి. కొన్ని పాత్రలు, కొన్ని సంఘటనలు అల్పముగా పైవారలగూర్చి నవలలలో గోచరించునుకాని, పూర్తి నవల మృగ్యము. సమాజములోని సమష్టి జీవితము చిత్రింపగలిగినప్పుడు సాహిత్యము ప్రయోజనాత్మకము, విశిష్టము కాగలదు. ఏవంవిధ రచనము, రచనావ్యవసాయములో ఆరితేరిన రచయితలకు ఘంటాపథము. కల్పనలకు, కవితాత్మకు దూరముగా, జీవితము జీవితముగనే దర్శింపగల ఋషితుల్యుడయిన రచయితకు అది సుసాధము.

వర్తమానమున దేశరక్షణము విచిత్ర సమస్య. ఈ సమస్యకు పరిష్కార మార్గము తెలుగు నవలలు చూపలేదు. ఇతరేతర విదేశభాషలలో సైన్య జీవితము చిత్రించినట్టి రచయితలు—తెలుగుదేశమున లేకపోవుట అందుకు కారణము కావచ్చును. నిన్న మొన్నటి యుద్ధములను పురస్కరించుకొని వెలువడిన రచనలు సాహితీ జీవితమును పొందలేకపోయినవి.

తెలుగునాట హాస్యమెంత ఆమోదకరమో, శృంగారమెంత రసరమ్యమో, అంతగా సర్వజన సంబంధి అయినది ఆహారము. అది సమస్య అయినప్పుడు,

తత్పరిష్కార మార్గము ఇతివృత్తముగా ఎన్ని నవలలు వెలువడినవన్న ఆలోచ నీయమే కాని వచనీయము కాదు. భావితరాలు బానిసలు కాకుండ జీవింప వలెనన్న జాగరూకులై మెలగవలసిన ఆంధ్రులకు జనాభా పెరుగుదలపై వెలువడిన నవలలు ఏవియన్న సమాధానము శూన్యము.

ఆధునిక సమాజమున ఎటు చూచినను సమస్యలు. వీనిపై రచనలు లేకున్నచో సాహిత్యములో సమాజము ప్రతిబింబించుట ఎట్లు? తెలుగు రచయితలు సమకాలీన సమస్యలపై సమగ్రముగా ఆలోచించుట లేదన్న అనుమానము అపవాద అపేక్షితము. నలుగురు నడచిన బాటలో అంగలు పంగలు వేయుచు అడ్డనూకలులేక సాగిపోవుట చింతలేనిపని, శ్రమలేనిపద్ధతి రచయితలు పాత బాటలలో సాగిపోవుచున్నారు. రచనలు పాతవాసనతో ప్రభవించుచున్నవి. ఎప్పటికప్పుడు వినూత్నత వెల్లివిరియుటలేదు.

పురాణేతిహాస ప్రసిద్ధమైన ఇతివృత్తముకాని, ఉన్నత వ్యక్తి జీవితచరిత్ర కానిమాత్రమే వస్తువు స్వీకరింపవలెనన్న నియమము ఏమియును నవలా రచయితలకు లేదు. ఉన్నత వ్యక్తిత్వముగల ఏ వ్యక్తి జీవితము నయినను చిత్రించు నవకాశము నవలాకారులకున్నది. అదియును హద్దులతో, అవధులతో కూడినదికాదు. ఏ వ్యక్తిని అయినను, ఎటువంటి జీవితము కలవానినయినను, మంచిచెడ్డల ప్రసక్తిలేకుండ నవలాపాత్రగా; ఆ వ్యక్తి జీవితము, నవలేతివృత్తముగా స్వీకరణార్హము.

ఈ విషయము తెలుగు రచయితలకున్న ముందడుగు ప్రశంసాపాత్రము. సమకాలీన భారతీయేతర సాహిత్యములలో చోటులేని పాత్రలు, పాత్రల జీవితములు తెలుగు నవలలయందు చోటు చూచికొన్నవని విజ్ఞుల యభి ప్రాయము. ఈ నవలలు జీవితవైవిధ్యము దర్శించినవి. పసివాని జీవితము నుండి వృద్ధుని బ్రతుకువరకు, గుమాస్తా దైన్యమునుండి కలెక్టరు సంతుష్టివరకు, బడిపంతులు మొదలుకొని విశ్వవిద్యాలయాచార్యునిదాక, విద్యార్థుల ప్రేమ కలాపాల మొదలిడుకొని, వృద్ధుల తుది ఘడియల విలాపాలదాక మధ్యస్థ మయిన అందరి బ్రతుకులలోని అన్నిదశలు వస్తువులుగా, వస్త్వంతర్భాగము లుగా రూపములు దిద్దుకొన్నవి.

ఆంధ్ర రచయితలు పరిమిత పరిధినుండి పరిశీలనచేసి, రచనలు సాగించు చున్నారా అనిపించకపోదు. అల్ప పరిశోధనకు బదులు అనల్ప పరిశోధన, సంకుచిత సమస్యకు బదులు విశాల సమస్య. వ్యక్తిగత భావమునకు బదులు

దేశగత భావనము ఆంధ్ర రచయితలు పెంపొందించుకొనవలసియున్న దనవచ్చును.

పెండ్లి, పెండ్లికాని పిల్లలు, కట్నములు, పెండ్లి చూపులు, తల్లిదండ్రుల కష్టములు, కన్నీరు ఇత్యాది సమస్యాసహిత నవలాసామ్రాజ్యము, ఆంధ్ర సాహిత్యములో విస్తృతముగా వ్యాపించినది. ఇవి సమస్యలు కావనికాదు. కావచ్చును. ఒక కోణమునకు సమస్యగా గోచరించినది, వేరొక దృక్కోణమునకు సమస్య కాకపోవచ్చును. పరిశీలనానంతరము పెక్కు సమస్యలకు మూలకారణము ఏ ఒక్కటియో గోచరించు అవకాశము లేకపోలేదు. ఆ సమస్యను స్వీకరించి రచన చేసిన వ్యక్తి విశాలపరిధినుండి జీవితము పరిశీలించిన ద్రష్ట కాగలడు ఆ వ్యక్తియే ఉత్తమ స్రష్ట కాగలడు. కీ॥ శే॥ బుచ్చిబాబు, కీ॥ శే॥ అడవి బాపిరాజు, 'చివరకు మిగిలేది' 'నారాయణరావు'లయందు విశాల దృక్పథము ప్రదర్శించిన ద్రష్టలు, స్రష్టలు. సార్వకాలికము, సార్వజనీనము అయిన వస్తువును రూపొందింపలేకపోయినను, బహుకాలికము బహుజనీనము అయిన వస్తువునయిన తీర్చిదిద్దు అవకాశము రచయితలకు విశాల దృష్టితో జీవితము పరిశీలించిన అనంతరము సంప్రాప్తమగును. ఏవంవిధ రచనా పద్ధతికి ఈ మధ్య కొందరు రచయితలు ప్రయత్నించుచున్నారు.

ఈ ప్రక్రియయందు కృషి చేయువారిలో సముచితస్థానము రచయిత్రులకున్నది. గృహప్రాంగణమునుండి దేశప్రాంగణమునకు అవతరించిన స్త్రీమూర్తి జీవిత దశాపరిణామములో రచనాజీవితము కాంతిమంతము. బహుకాలముగా అవ్యక్తమయిన స్త్రీ హృదయము ఈ ప్రక్రియవలన వ్యక్తమగుచున్నది. చీకటి కోణములనుండి వెలుపలకు రాక మ్రగ్గిపోవు సత్య సమూహము వెలుగులు సోకి దేదీప్యమానముగా ప్రకాశించు దశ, తన్మూలముగా స్త్రీ స్వరూప స్వభావములు, దద్విశిష్టత ప్రతిబింబించు స్థితి నవలయనుగ్రహించినది.

స్త్రీ పురుషులు తమ రచనములయందు వ్యష్టిగా దర్శించి చిత్రించిన జీవితము సమగ్రముకాదు. స్త్రీ పురుష సాహిత్య సృష్టిలో సమష్టిగా సమాజమును, పరిపూర్ణ వ్యవస్థను, ద్వివిధ జీవితమును, చూడగలస్థితి ఏర్పడినట్లు భావించుకొనవచ్చును. ఆ ప్రయత్నమునకు ఆధునికాంధ్ర సాహిత్యము ఉదాహరణ ప్రాయము.

నవలేతివృత్తము సమాజగతము, సమాజ సమారాధితము. నవలయందు సమాజమును ఉన్నదియున్నట్లుగా చిత్రించుట శ్రమాయత్తము, నిష్ఫలము,

రసహీనము కాని నవలయందు గోచరమగు ద్వివిధ ప్రకృతి సమాజమునకు ప్రతిబింబము కావచ్చును. సమాజగతమయిన సమస్తము నవలయందు అవర్ణ్యము. వర్ణించు పట్టుదల వీలుకానిపని, కూడని ప్రయత్నము. నవల యందు వర్ణించుటకు తగిన 'అంశ' సమాజమందుండును. సమాజమంతయు నవలయందు ప్రతిబింబితము కాదు. కాని నవలయందున్న సమాజమంతయు వాస్తవ సమాజమునకు ప్రతిబింబము. ప్రతిబింబము వేరు. వాస్తవము వేరు. అందుచేత, నవలలో సమాజముండును. ఎంత యధికముగనున్న అంత ఉచితము. కాని, సమాజములో నవలయుండదు. నవలాంశయుండును. నవలయేయున్నట్లు తోచినది పతనదశ! ప్రవర్తిల్లు సమాజములోనుండి అమూర్తముగ జన్మించి, సమాజమును చిత్రించి, సమాజమునకు దర్పణముగా దశాంతరములో మూర్తిమంతమగునది నవల.

పాత్రలు సజీవములుగా నుండవలెనని విమర్శకుల అభిప్రాయము. ఆ పాత్రలవలన నవలలో సమాజము సందర్శనీయమగునని అభిమతము. అది స్వీకార్యమే అయిన, సజీవములుగా నుండుట అనగానేమి? జీవరహితములుగా పాత్రలుండునా? అది పరిశీలనార్హము.

ఎదుగు బొదుగులేక, ఎక్కడుంటివె నల్లరాయి అన్నచో వేసినచోటనే అనునట్లున్న వ్యక్తులు సమాజములో జీవించినవారే అయినను, నవలలో నిర్జీవ పాత్రలు! త్రికాలాబాధితమయి, మార్పులేని, పరిణామము చెందని, హృదయ ధ్వని వినిపించని ఆశలు ఆకాంక్షలులేని మత్తత మూర్తీభవించినట్లున్న, నిరుప యోగముగా నున్న, కదలికలేని, సంచలనములేని, మన్నుదిన్న పెంజెరులవంటి మనుష్యులు—ఎదుటివారికి ఎటువంటి స్పందన కలిగింపలేనివారు, సమాజములో సజీవవ్యక్తులే అయినను, నవలలో పాత్రలుగా నిర్జీవములు. తద్భిన్నముగా ప్రవర్తించు మనుష్యులు, సమాజమున అజాపజా లేనివారే అయినను నవలలో చిత్రితమయిన ఆ పాత్రలు సజీవములు.

దరిద్రుడు ధనవంతుడుగా, కలవాడు నిరుపేదగా, మూర్ఖుడు ఉత్తముడుగా, ఉత్తముడు మూర్ఖుడుగా, యమునివంటివ్యక్తికి తను చంపిన ప్రాణులగూర్చి కన్నీరు స్రవించువాడుగా, దేవునివంటి మనుష్యునికి తన సృష్టిపట్ల అసహ్యము కలిగినవాడుగా, యంత్రాలయమున పనిచేయువాడు కళాకారుడుగా, కళా కారుడు ఫ్యాక్టరీకూలీగా పరిణామము చెందినట్లయినచో, వారివారి జీవితము సమాజములో ఏతీరుగా నున్నను, ఏయే కారణములచేత పీడితులు తాడితులు

అయినను, సంచలనముచేత, హృదయధ్వనివల్ల, జీవిత గమనములో కుదుపుల వల్ల ఆ వ్యక్తులు నవలలో పాత్రలుగా సజీవులు.

పూర్వాచారపరాయణులు, ఆధునికులు, ఎటుమారినను, కేపిటలిస్టులు సోషలిస్టులు ఎటు పరిణమించినను, మంచిచెడ్డల ప్రసక్తి అటుంచి ఆ వ్యక్తులు నవలలో పాత్రలయినప్పుడు, ఆ పాత్రలు సజీవములు.

ప్రతిదినము కళాశాలకు పోవుచు వచ్చుచున్న విద్యార్థిలో ఏమి మార్పు లేకపోయినచో, ఆ పాత్ర నవలలో నిర్జీవము. ఏ మాత్రము మార్పు వచ్చినను ఆ పాత్ర సజీవము. మార్పు, పరిణామము నిర్జీవ పాత్రకు సజీవత ప్రసాదించును. ఒక దశనుండి మరొకదశకు, ఒక స్థితినిదాటి వేరొక స్థితికి చేరుకొన్నప్పుడు పాత్రలు సజీవములగును. సమాజగతమయిన సర్వులు నవలలయందు పాత్రలు కాలేరు. పాత్రలయిన వ్యక్తులు సమాజమునుండిమాత్రమే రాగలరు. ఏ రచయిత అయినను, ఏ వ్యక్తిని అయినను పాత్రగా స్వీకరించి చిత్రించి ఆ పాత్రవంటి అనేక వ్యక్తులను తలపింపగలిగినచో ఆ పాత్ర సజీవము. రచయిత శక్తి సామర్థ్యములనుబట్టి పాత్రల సజీవత, నిర్జీవత వ్యక్తమగును.

ఆధునిక నవలయందు రచయితలు చాలవరకు సజీవపాత్ర సృష్టి చేయగలుగుచున్నారు. రచయిత్రుల మాటవేరు. స్వభావదూరముగా, కల్పనామయముగా, జీవితమునకు భిన్నముగా, ఏదేని మంచి గుణమునో, చెడ్డగుణమునో వ్యక్తీకరించుటకో అనునట్లు పాత్ర సృష్టి చేయుచున్నారు

సమాజమున పూర్ణ సత్పురుషుడుకాని, (గాంధీజీయందు లోపములు చూపినవారు లేకపోలేదు) పూర్తి దుష్కర్ముడుకాని (హంతకునియందును గుణము కాంచినవారున్నారు) లేరనుట వివాదాంశము కాకపోవచ్చును. ద్వంద్వాతీతులు లేరు. ద్వంద్వముల కలయికతో మాత్రమే మనుజుల మనుగడ. ఎక్కువ మంచివాడు, ఎక్కువ చెడ్డవాడు సమాజములలోనుందురు కాని పూర్తి సత్పురుషుడు, పూర్ణదుష్టుడు సమాజమందుండుటకు అవకాశము తక్కువ. సమాజమునలేని వ్యక్తులను పాత్రలుగా సృష్టించుట సమాజ చిత్రీకరణము కాదు.

భాషమృతము, అమృతము అయియుండును. మృతభాషకాని మృతావస్థయందున్న భాషకాని నవలారచనమునకు స్వీకరించిన సమాజ వ్యక్తీకరణము సాధ్యముకాదు. మృత్యు సమీపస్థుడైన వృద్ధునకు నూత్నయౌవనారంభ

దశయందున్న యువతిని యిచ్చి పెండ్లి చేయుట ఎంత తగనిదిగా భావింప బడునో, అటులనే మృతావస్థయందున్న భాషలో నవల వ్రాయు యత్నము సముచితము కాదు. ఇప్పుడు సామాన్యీకరణముపొంది సర్వులచేత నంగీకరింప బడనగు వ్యావహారికములోనే నవల వ్రాయుట ఉచితము. అదియే రచయిత లందరును స్వీకరించుచుండిరి. తద్భిన్నులయిన కొందరి ప్రసక్తి ఇటన ప్రస్తుతముకదా!

వ్యావహారికములో—విశాఖపట్టణము శ్రీకాకుళము ప్రాంతపు మాండలికము, ఉభయ గోదావరులు మాండలికము, గుంటూరు—విజయవాడల భాషాపద్ధతి, తెలంగాణా భాష, రాయలసీమ భాష,—ఐదు ధోరణులు స్థూలముగా గోచరించును. అందరి మాతృభాష ఆంధ్రమే అయి నప్పటికీ మాండలికములు సామాన్యులయిన అందరికిని అందుబాటులో లేవు. అర్థముకావు. ఒక మాండలికమునందు నవల వ్రాయుట, ఆ మాండలికమును వెలుగులోనికి తెచ్చు ప్రయత్నమునందు ఉచితమేకాని, నవలాప్రయోజనము దృష్టితో ఆలోచించినయెడల అనుచితమనిపింపక తప్పదు.

స్వీకృతేతివృత్తము కారణముగా, ఒక ప్రాంతపు మాండలికమును ప్రయోగించు రచయిత ప్రశంసాపాత్రుడు. రచయిత తనంతతానుగా మాండలికము ప్రయోగింపక, పాత్రలవలన మాండలిక ప్రభేదము చూపింం చుట యుచితము. ఐదు ప్రాంతముల మనుష్యులు ఐదుగురు ఒక్కచోట కూడినప్పుడు, భిన్న మాండలికములు ప్రయోగించుచు, అనగా పాత్రలవలన పలికించుచు, సామాన్యీకరణము పొందిన వ్యావహారికమునందు రచనచేయు రచయిత మిక్కిలి ప్రశంసాపాత్రుడు.

అమృత మాతృభాష ఎప్పుడును హృదయ స్పందనమును ప్రతిధ్వనించు నదిగా నుండును. మాండలికము మరింత హృదయాకర్షకము. అయినను మాండలికమునందే నవలనంతయును వ్రాయుటచేత ఇతర ప్రాంతమువారల కది అర్థవంతము, పూర్ణభావ స్ఫోరకము కాలేకపోవచ్చును. భిన్నమాండలిక ములు పాత్రల సంభాషణమున ప్రయోగించి, ప్రసిద్ధ వ్యావహారికము నవలా భాషగా ఏర్పరచి రచింపబడు నవలలకొరకు ఆంధ్రసాహితీ జగత్తు ఎదురు తెన్నులు చూచుననుటలో సందేహములేదు. ఇట్టి రచనలు శ్రీ రాచకొండ విశ్వనాథ శాస్త్రి, శ్రీ పోరంకి దక్షిణామూర్తి తదితరులు వ్రాయగలరని ఆశింపవచ్చును.

సంభాషణలు సమాజమును సందర్శింప సమర్థములు. భాష అమృత మయినప్పుడు సంభాషణము చైతన్యవంతము, నవలాగత సమాజప్రకాశకము.

సంఘమునందు సంభాషణ చతురతతో కూడినది. కొందరు ఒకటిరెండు మాటలతో ఎంతయో విషయమును తెలుపగలరు. మరికొందరు ఎన్నియో మాటలు వ్యర్థము చేసియును హృదయగత విషయమును స్పష్టముగా చెప్పలేరు. ఆంగిక చేష్టలవలన అనంతవిషయ మందీగలవారు, పదములకు, వాక్యములకు మధ్య పరమార్థము ప్రతిష్ఠింపగలవారు చెప్పిన మాటలుకంటే, చెప్పని మాటలలో హృదయగతభావము ఇమిడ్చి పలుకగలవారు ఎందరో కలరు. అటువంటి మనుష్యులమధ్య సంభాషణము వ్రాయగలుగుట నిజముగా ప్రతిభావంతునకుకూడ పరీక్ష. అట్టి సంభాషణములవలన సమాజమును ప్రత్యక్షీకరింపవచ్చును.

భార్యాభర్తల మధ్య సంభాషణముతో ప్రత్యల్ప విషయమునకును 'భగవంతుడుకూడా నిన్ను క్షమించడు'వంటి పలుకులు జాగరూకతగల రచయిత పలికింపడు. ఆ పలుకులు సమాజ సాక్షాత్కారము చేయింపలేవు. జీవితము కవిత్వమువలె, కల్పనవలె నుండకపోవచ్చును. ఎక్కడో ప్రయోగింపబడిన ఒండు రెండు పల్కులు సర్వసామాన్యముగా భావించుట తగినదికాదు. సహజముగా మాటలాడుకొనుటలో ప్రయుక్తముకాని విధానము రచనములో చొప్పించుట దోషమేయగును.

నవలా రచయితల కొద్దిమంది, రచయిత్రులలో మరికొద్దిమంది అసహజముగా నుండు సంభాషణములు నిరాఘాటముగా వ్రాయుచుండుట రసజ్ఞులు ఔచిత్యజ్ఞులు గమనించిన విషయమే! అది పరిహార్యము.

అల్ప వ్యతిక్రమణముల మాటకేమికాని, ఆంధ్ర నవలా ప్రపంచమున అధికముగా సంభాషణాచాతుర్యము శ్రవణపేయము. సమాజమును నేత్ర పర్వముగ చూపునంత సముజ్జ్వలము.

సన్నివేశ చిత్రణమువలన సరసుడయిన రచయిత సమాజ చిత్రణము సాధింపగలడు. ఈ విషయమున సన్నివేశస్థలము, విభిన్న మనస్తత్వములుగల పాత్రలు ఏకవిషయమును, ఆ విషయమునకు సంబంధించిన ఇతర విషయము లను గూర్చి సంభాషణము, భిన్నపాత్రల ఏకస్థలమున సమావేశమగుటయందలి ఔచిత్యమును, అవసరమును కూలంకషముగా పరిశీలింపగల రచయిత చక్కని సన్నివేశ కల్పనము, సమాజ సహజముగా చేయగలడు. చిత్రింపగలడు.

పూర్వము పల్లెలలో ఇటువంటి సన్నివేశములకు రచ్చబండలు చెట్టునీడలు ఆటపట్టులు. అవి మార్పుచెంది పార్కులో లేడిరోయున్న ఇంటి ప్రాంగణములోనికి సన్నివేశస్థలములు మారినవి. పట్టణములలో క్లబ్బులు వినోద స్థలములు అప్పటికి ఇప్పటికి నున్నవి. సన్నివేశ స్థలములు ఎన్నియయినను కల్పింపవచ్చును. ఎన్నియయిన స్వీకరింపవచ్చును.

సన్నివేశములో సంభాషణ సమగ్రముగా పోషింపగల రచయిత ఉత్తముడు. వ్యక్తుల భావశాబల్యము నిశితముగా పరిశీలింపవలెను. అందరును ఏకవిషయమును పలుకగలిగినను, అనేక విషయ ముద్రతో అభిషిక్తమయిన మనస్సునుండి బహిర్గతమగు ప్రత్యేక విషయాంతర్గతముగా ఆంతరముద్ర యుండితీరును. ఆ నేర్పును దక్షుడయిన రచయిత చూపగలడు.

సన్నివేశమునందు సాధారణముగా ప్రసక్తములగు విషయములు, స్థలములు, పాత్రలు వీనికి అనుగుణముగా నుండును. అంతర్వాహినిగా కథ సాగుచున్నను, శృంగార హాస్యములు, లోకాభిరామాయణము, జాతీయాంతర్జాతీయ రాజకీయములకు, ఇప్పుడిప్పుడు సినీమాలగూర్చి ప్రసంగము కలగవచ్చును.

సక్రమముగా సమాజమును చిత్రింపగల రచయిత కథాగమనము కుంటుపడకుండ సన్నివేశములు కథాకథనమునకు అనుకూలములుగా మార్చుకొని రచన చేయగలడు. నవలారచనములో ప్రథమ తరమునందలి రచయితలు ఈ విధమయిన సన్నివేశ సత్కారము నవలలకు నాజూకుగా కల్గింపగలిగిరి కాని, మలితరము రచయితలలో సన్నివేశ కల్పనమందలి నేర్పు క్రమక్రమముగా అడుగంటుచున్నదని చెప్పక తప్పదు. కాని, అవసరమయిన సన్నివేశములు కల్పించుకొన్న మలితరము నవలారచయితలు, అవకాశమున్నంతవరకు సమాజ చిత్రీకరణము చేయగల్గిరి.

సన్నివేశములు, సంభాషణలు కొన్ని సాంఘిక నవలలయందే తెలుగుదనము ప్రదర్శింప లేకపోవుచున్నవి. దానికి కారణము ఇతర భారతీయ, భారతీయేతర నవలలలోని ధోరణులు సంతరించుకొనుట. ఆంధ్ర సమాజము, ఇతర సమాజముల పద్ధతులు స్వీకరించిన, తనలో విలీనము చేసికొనిన చింతలేదు, తద్భిన్నముగా వ్రాయబడిన బాధ.

భారతీయుల రూపరేఖలలో ఎంతయో వైవిధ్యమున్నది. ఉత్తర ప్రాంతము వారికిని, దక్షిణ ప్రాంతమువారికిని భిన్నత గోచరించును. ఆంధ్రులకు తదితరులకు రూపరేఖా విభేదము స్పష్టము. తెలుగువారి స్థూలముగా ఒక్క

తీరునే ఉన్నను సూక్ష్మముగా బహువైవిధ్యము. ప్రాంతము, మతము, కులము కారణముగా, ఆకారములయందు, ముఖనిర్మాణమునందు, శారీరకవర్ణముల యందు, కట్టుబొట్టులయందు ప్రత్యేకముగా నుండునది ఆంధ్రుల సమష్టి వ్యవస్థ.

ఒక తెగ నవలలయందు పాత్రల రూపరేఖలు వర్ణనము పేరునకు మాత్రమే! పాత్ర స్వరూప స్వభావముల తులవోలె నుండదు. ఆ తెగ నవలలలో ఏ ఒక్క నవల చదివినను, తక్కుంగల నవలలను తడవ పనిలేదు. శరత్ నవలా ప్రభావము యువతరముపై మిక్కుటము. కొంతవరకు నది సత్సంగతియేకాని, ఆంధ్రత్వము అడుగునపడు అవకాశము స్పష్టము.

రూపురేఖా వర్ణనమువలన నవలయందు తెలుగుదనము సముపార్జింపవచ్చును. తన్మూలముగా సమాజమును చిత్రింపవచ్చును; మొదటితరము రచనములలో ఈ విధమయిన సమాజము గోచరించును.

వ్యక్తి పరిణమించుచున్నాడు. వ్యవస్థ మారుచున్నది. దేశము పరిణామము పొందుచున్నది. ఈ యుగధర్మములో మార్పు, వేగము రెండు విశిష్ట గుణములు. దేశాంతర రాజకీయములు దేశాంతర రాజకీయములగు చున్నవి. ఇతర దేశీయ జీవిత విధానము భారతదేశములో ప్రవేశించినది. ప్రాచీన సహజస్థితి నూత్న రూపము దిద్దుకొన్నది. పల్లెజీవితము పట్టణము వైపు మొగ్గుచున్నది. వ్యవసాయము స్థానములో పరిశ్రమలు అభివృద్ధి చెందుచున్నవి. యుగధర్మమయిన వేగమును ఆధునిక మానవుడు అందుకొన యత్నము చేయుచున్నాడు. ప్రతి వ్యక్తియును సంక్రమిత స్వాతంత్ర్యము సంరక్షించుకొనవలెనని బోధింపబడుచున్నాడు. ఒక విధమయిన అవ్యవస్థ నుండి మరొక విధమయిన వ్యవస్థవైపు ఆంధ్ర సమాజము ప్రయాణము చేయు దశయందున్నది. ఈ యుగసంధి ఉత్తమ రచనములకు ఆటపట్టు కావలసియే ఉన్నది. కాని యుగధర్మము, తల్లక్షణములు సమగ్రముగా స్థాపింపగల రచన వెలువడలేదేమో ననిపించుట సహజము. ఈ కాలము ఉత్తమ రచనలు జరిపించితీరును. ఇంతవరకు ఆ సృష్టి జరుగలేదు. ఇక జరుగవచ్చును.

ఇప్పటి తెలుగు సమాజమును చిత్రించిన నవలలు చాల కలవు. భారతదేశములో ఆంధ్ర నవలాసాహిత్యము సముచితస్థానమున నున్నది. నాల్గవ స్థాన ముండవచ్చును. ప్రథమ స్థానమును ఆర్జింపగల సమర్థులయిన రచయితకు

ఆంధ్రదేశమున కొరతలేదు. ప్రపంచమున ప్రసిద్ధ స్థానమును పొందగల నవలాసృష్టి అద్యతన భావిలో ఆవిర్భవింపవచ్చునని ఆశింపవచ్చును.

పరిణామ దశాప్రవర్తితము, ఆందోళనాయుతము సమస్యాసహితము, అంతరతేజమును అంగీకరించునది అయిన సమాజము ఉత్తమరచనలు సృజించు అవకాశము కల్గియుండును. అన్ని అందాల ఆంధ్రత్వము నాకాంక్షించు రచయితలు ఆంధ్రత్వమే మూర్తి దాల్చినట్లున్న నవలలు రచించెదరని నమ్మవచ్చును. సమర్థుడు, ప్రతిభావంతుడయిన రచయిత తెలుగు సమాజమునే చిత్రింపవలెనను సంకల్పముతో నవలా రచనమునకు పూనుకొన్నచో, ఏ లక్షణము స్వీకరించినను స్వీకరింపకపోయినను, ఉత్తమ నవల సృజింపగలడు.

తెలుగువారల జీవితము, తెలుగు సమాజమును భావితరాలవారికి భద్రముగా చూపుటకు, మా నవల ఇది యని ఆంధ్రులు, ఇతర రాష్ట్రాలలో దేశాలలో సగర్వముగా చెప్పుకొనుటకు, తగిన నవల అచిరకాలములో ఆవిర్భూతి చెందునని సాహితీ విద్యార్థుల సమాకాంక్ష!

(భారతి '68).

# గెంజి గాథ

'గెంజి' రాకుమారుడు. అతని శృంగార జీవితం చిత్రించే నవల గెంజి గాథ. శ్రీమతి మురాసఖి ఈ నవలా రచయిత్రి. జపాను దేశచరిత్ర ఈ నవలకు నేపథ్యం. రచనాకాలం, కథాకాలం పదకొండో శతాబ్దం.

చక్రవర్తి ప్రియురాలు 'కిరీటశుభ.' పట్టమహిషి కాకిదేను మహారాణి. కిరీటశుభ ఏకైక పుత్రుడు గెంజి. తండ్రి అనురాగం పొందిన సుందరాకారుడు. తేజోరాశి. బాల్యంలోనే తల్లిని కోల్పోయాడు.

సౌందర్యం, అభిజాత్యం, సంపద, యౌవనం గెంజి జీవితాన్ని శృంగారమయం చేశాయి. వయస్సులో తనకంటె పెద్దవారయిన స్త్రీలే కాదు; చాలా చిన్నవారయిన యువతులతో శృంగార జీవితం సాగించిన రసికుడు గెంజి. ప్రేమమయ హృదయంలో చెలరేగే సుఖదుఃఖతరంగాలకు ఇరుదరులు తానే అయి నిలిచిన మనోహరమూర్తి గెంజి.

ప్రేమమయుడయిన ఒక నిష్కల్మష హృదయుడి శృంగార జీవితంతో సంతోష సంరంభాలు, మానసిక సంక్షోభాలు, స్వీకృత ప్రేమాహ్వానాలు, తిరస్కృత శృంగార సంబంధాలు, మధుర వాంఛాసాఫల్యాలు, విధి దూషిత వైఫల్యాలు, సమగ్రంగా చిత్రింపబడిన నవల గెంజిగాథ.

పలువురు స్త్రీలతో శృంగార జీవితం తప్పు అనటం అసాధ్యంగా కనిపిస్తుందీ నవలలో. అది నిజంగా దూషింపబడవలసింది అయితే, అటువంటి పరిస్థితి ఏర్పడటంలోనే దూషింపబడవలసిన సంగతివుంది. శారీరక కాంక్షకు అడ్డూ ఆపు లేక, అవధీ పరిధీ మృగ్యమైన సామాన్యకామంలాగా చిత్రింపబడలేదు శృంగారం ఈ నవలలో. శృంగారం ఈ రచయిత్రి పూజగా, తపస్సుగా, ఆరాధనగా, భగవద్దత్త సామర్థ్యంగా, దైవదర్శన సముజ్జ్వలంగా, దైవత్వ సమువేతంగా, మనోహర జీవిత భాగధేయంగా చిత్రించింది.

ఆధునిక సమాజంలో తలంపబడే నీతి నియమాలు వెయ్యేళ్ళ పూర్వం వ్రాయబడిన ఈ నవలలో పరిశీలింప బూనుకోవటం హాస్యాస్పదంగా వుంటుంది. తన జీవితం, తనచుట్టూ ఉన్న ప్రకృతి జీవితం, మానవ ప్రకృతి

జీవితం పరిపూర్ణంగా అర్థం చేసుకొని ఆనందం జీవిత పరమార్థంగా భావించి జీవించిన గెంజి ఉదాత్త పాత్ర!

గెంజి కల్పిత పాత్ర కాదు. ఒకనాడు జీవించిన వ్యక్తి. ఇప్పుడూ జీవిస్తున్న పాత్ర. ఈ నవలలో పేర్కొన్న ఏ పాత్రా కల్పితంకాదు. అన్నీ ఒకనాడు వాస్తవాలయిన పాత్రలు. గెంజి తండ్రిని, మహారాజా—చక్రవర్తి, సార్వభౌముడు అని మాత్రమే రచయిత్రి పేర్కొంది కాని పేరు చెప్పలేదు. మహారాజును పేరుతో పిలవటం ఆచారంకాదు. ఆ స్థానంలోనే ఉన్న శ్రీమతి మురాసఖి మహారాజు పేరు ఈ నవలలో వ్రాయలేదు.

## రచనా కాలం:

గెంజిగాథ రచనాకాలంగూర్చి తెలుసుకోటానికి రచయిత్రి జీవితకాలం నిర్ణయించుకొనవలసిన అవసరంవుంది. ఆమె క్రీ. శ. 978 (?) 1031 (?) లో జీవించి ఉన్నట్లు చెప్పబడింది.[1]

నవల రచనా కాలంగూర్చి క్రీ. శ. 1000 అని రమారమిగా వ్యక్తం చేయబడింది.

The novel is undoubtedly the finest example of medieval Japanese storytelling, and in it one can trace the very growth of Japanese literature about the year 1000 A. D.[2]

అయితే మాన్యశ్రీ సైజిరో యోషిజన[3] శ్రీమతి మురాసఖి షికిబు జీవితకాలం క్రీ. శ. 975—1031 మధ్యకాలంగా చెప్పి, రచనా కాలం క్రీ. శ. 1008—1021 గా వ్రాస్తే, ఆ విషయం అనువాదకర్తకు స్వీకరణ యోగ్యంగా గోచరించింది.

అది, గాసట బీసటగానున్న భాషను దారిచూపిన మహోద్ధారుడు, ఋషితుల్యుడు అయిన నన్నయ రాజరాజు కొలువులో, రాజమహేంద్రవరంలో వ్యాసరచిత మహాభారతం తెలుగులోనికి అనువాదం చేస్తున్న సమయం.

---

[1]Master Pieces of World Literature in Digest Form—second series-Edited by Frank, N. Magill.

[2]Ibid.

[3]భారతదేశంలో జపాను రాయబారి (1962).

## రచనా ప్రక్రియ:

హృదయగత సౌకుమార్య కోమలత్వాలు వెనకడుగు వేసినప్పుడు, సమాజం పారిశ్రామికంగా ముందడుగు వేసినప్పుడు, కవితాహృదయంకంటే యంత్ర జీవితం సంఘంలో ప్రముఖమయినప్పుడు, అధునాతననాగరికత చిలవలు పలవలుగా విస్తరిల్లినప్పుడు, పద్యరచన తిరోగమనంలో, గద్యరచన పురోగమనంలో పయనించే అవకాశంగూర్చి సహృదయులు ఎరుగుదురు.

గెంజిగాథ వచనంలో సాగిన రచనే అయినప్పటికి చక్కని కవితా రూపం, రసపారవశ్యం కలిగింప సమర్థమయిన కళాఖండం.

ఆంధ్రంలోనూ వచన రచన అంతో యింతో నన్నయకాలంనుంచీ ఉందని అంగీకరించినా, పరిపూర్ణరూపం పందొమ్మిదో శతాబ్దంలోనే లభ్య మయింది.

గెంజిగాథ 'నవల' అని స్థూలంగా అందరూ అంగీకరించారు. అంగీక రిస్తారు. అయితే జపాను దేశంలో దీనిని గెంజి మొనొగతరి (monogatari) అని పిలుస్తారు. మొనొగతరి అంటే Tale అని ఇంగ్లీషులో అర్థం చెప్పబడింది. కాబట్టి దీనిని గాథ అనటంలో విప్రతిపత్తి ఏమీలేదు.

అయితే ఈ గెంజిగాథను, మురాసఖి షికిబు 'నిక్కి' అని సమకాలికులు పిలిచేవారు. నిక్కి (nikki) అంటే Dairy అనే అర్థం ప్రాచుర్యం పొందింది.

గెంజిగాథను లేడీ మురాసఖి షికిబు డైరీ అనుకొంటే, ఆ గాథలో ఆమె దినచర్య మాత్రమే (!) లేదు. గెంజిగాథలో మురాసఖి అనే పాత్ర, రచయిత్రి మురాసఖి అయివుంటుందనుకొంటే అది విషయాంతరం అయినా ఈ గాథ ఆమె దినచర్యగాకంటే గెంజి దినచర్యగా వ్రాయబడింది. దీనిని స్వీయచరిత్రకంటే, జీవితచరిత్ర అని భావించే అవకాశం ఉంది.

గెంజిగాథను గాథే అనినా, దినచర్య అనినా అనవచ్చుగానీ, నవలా రచన ముమ్మరంగా సాగే ఈ కాలంలో దీనిని నవలలాగా భావింపవచ్చు.[4] అంతేకాదు. నవలా రచనకు ప్రథమరూపం ఈ గెంజిగాథ అనీ తల

---

[4]........Highly developed culture which flourished in Japan when Europe was just beginning to emerge from the dark ages.—Observer.

(From the Tale of Genji translated by Arthur Waley.)

పోయవచ్చు. ఈ దృష్టితో నవలా రచన జపాను దేశంలో ప్రారంభ మయింది అనటం దురాన్వయం కాకపోవచ్చు.

ఈ నవల లేడీ మురాసకి షికిబు డైరీగా ఆలోచిస్తే, నవలలో అక్కడక్కడ రచయిత్రి పాఠకులతో స్వయంగా మాట్లాడటం గమనింపవచ్చు.

The details of the plan by which he brought this about would make a tedious story, and as is my rule in such cases I have thought it better to omit them.[5]

ఆ ఉపాయములు పన్నాగములు వివరించుటు గ్రంథ విస్తర భీతిచేత విరమించుచున్నాను. (అనువాదం పేజీ 101). భారతదేశ ప్రముఖ భాషల్లోకి ఈ నవల అనువదింపచేసిన కేంద్ర సాహిత్య ఎకాడమీ భారత దేశ ప్రజలకు మేలుచేసింది. ఆర్థర్ వేలీ ఆంగ్లంలోకి పరివర్తింపజేసిన గెంజీ గాథను తెలుగులోనికి అనువదించినది డా॥ నండూరి రామకృష్ణమాచార్య.

అనువాదంలో ఉన్న వ్యత్యస్తంగూర్చి ఇక్కడ ప్రస్తావించటంలేదు. తెలుగువాక్యం చదివి రచయిత్రి రచనా నియమాలు తెలుసుకొనే అవకాశం తక్కువ అనవసర విషయాలు విస్తారంగా వ్రాస్తే పఠిత్రులోకానికి శ్రమ కలిగించినట్లవుతుందన్, అది త్యజించటం తన లక్ష్యం అని, అది అందరూ గుర్తిస్తారో లేదో అనే భయంతో తన నియమం పాఠకులతో ప్రత్యక్షంగా చెబుతుంది రచయిత్రి.

....And you would soon be saying that this was no history but a mere made-up tale designed to influence the judgement of posterity. As it is I shall be called a scandal-monger; but that I cannot help. (ఆంగ్లానువాదం పేజీ 134.)

ఇది రాబోవు తరములవారి అభిప్రాయముల మార్చుటకు అల్లిన కల్లబొల్లి కట్టుకథగాని, చరిత్ర గాదని మీరనుకోవచ్చును. ఇప్పుడో నన్ను నీలాప నిందలు సృష్టించు నెరజాణ క్రింద జమకట్టవచ్చు. కానిండు వినవేనేమి చేయగలను. (ఆంధ్రానువాదం పేజీ. 137).

ఇక్కడ అనువాద సామంజస్య పరిశీలనలేదు. రచయిత్రి హృదయ కాంక్షమాత్రమే దర్శితం. ఈ నవల కల్పనామయంకాదని, చరిత్ర సంగతి

---

[5] Page 103. 'The Tale of Genji, translated from Japanese by Arthur Waley and published by George Allen Unwin Ltd; London (etc). Reprinted, Nov. 1927.

అన్నీ, అవాస్తవంకాదనీ, పూర్తి వాస్తవమనీ పఠిత్రృలోకం భావించాలని తలంపు. అందుకే పాఠకులతో ముచ్చటించే అవకాశం కల్పించుకుంది.

రచయిత్రి–కథానాయిక :

రచయిత్రి లేడీ మురాసఖి షికిబు. కథానాయిక మురాసఖి.

Lady Murasaki Shikibu, daughter of a famous Provincial Governor and widow of a lieutenant in the imperial guard..

As a lady in waiting to the Empress Akiko, she was completely familiar with Nipponese court ritual and ceremony, and her knowledge of Palace life is everywhere apparent in the adventures of her nobly-born hero, Prince Genji.[6]

తన ప్రేమపాత్ర పూర్ణంగా నింపి అసహాయంగా నగరం వెలుపల మందిరంలో మరణించిన పేరు తెలియని స్త్రీ హృదయంపై ముద్రించిన అనురాగం బరువు క్రుంగదీయగా, జబ్బుపడి మంత్రాలు తనకు ఆరోగ్యం కలిగిస్తాయని నమ్మి, సన్యాసిని చూడబోయి, అక్కడున్న బాలికనుగూర్చి విని, ఆమె యౌవనంలో ఎంతో అందంగా రూపొందుతుందని తలంచి, యాచించి తీసుకొని వచ్చాడు గెంజి. ఆమె మురాసఖి. తల్లి బాల్యంలో గతించింది. ఆమె తండ్రినిగూర్చి తర్వాత నవలలో ప్రస్తావింపబడుతుంది గాని, అధికారంగూర్చి ఏమీ తెలియదు.

నవలలో కథానాయిక అయిన మురాసఖి రచయిత్రి మురాసఖి ఒక్కరే కావచ్చునేమో అనిపించే అవకాశంవుంది. రచయిత్రి క్రీ. శ. 975 సంవత్సరంలో పుట్టింది. మురాసఖి పదవఏట గెంజి అనురాగంవల్ల అంతః పురంలోకి తీసుకొని రాబడింది. అంటే క్రీ. శ. 985 లో ఆమె గెంజికి పరిచయం అయింది. ఆపైన రెండేళ్లకు గెంజి ఆమెను రెండో భార్యగా చేసుకొన్నాడు. గెంజి మరణించిం తర్వాతకూడా ఆమె జీవించివుంది.

గెంజి రాకుమారుడేకాని, చక్రవర్తి అయినట్లు ఆధారాలులేవు. ముఖ్యోద్యోగి అయివుంటాడు. గెంజి లెఫ్టినెంట్ అయితే అయివుండ వచ్చు. గెంజి మరణానంతరం మురాసఖి ఆస్థాన జీవితమే గడిపి వుండవచ్చు.

---

[6]Master Pieces of World Literature in Digest Form–Second Series–Edited by Frank N. Magill.

ఇది ఊహామాత్రమే! లభ్యమయ్యేచారిత్రక సత్యాలు ఆధారంగా రచయిత్రి—కథానాయిక ఒక్కరే అనిచెప్పే అవకాశం అత్యల్పం.

నామధేయ సామ్యంవల్ల ఇరువురూ ఒక్కరే అని ఊహించే ప్రయత్నం చేయటంలేదు. ఒకపేరు ఉన్నవాళ్లు ఎందరయినా ఉండవచ్చు. రాకుమారుడైన గెంజి అంతరంగిక విషయాలు వ్రాయటానికి అంతఃపురంలో ఉన్న స్త్రీలందరికీ సాధ్యంకాదు. నవలలో ఉన్న అనేక విషయాలు గెంజితో వ్యక్తిగత పరిచయం ఉన్నవాళ్లే వ్రాయగలరు. అందులోనూ భార్య అయితేనే తెలిసే విషయాలు కోకొల్లలు. ఈ నవల కల్పనకాదు, వాస్తవం అని ఆమె పదేపదే చెప్పటానికి ప్రయత్నించింది. ఈ నవల ప్రథమంగా ఆమె దినచర్యగా భావింపబడింది.

క్రీ. శ. 987 లో గెంజి అనురాగం స్వీకరించిన మురాసఖి రచనకు పూనుకొన్నది క్రీ. శ. 1008 లో మాత్రమే! అప్పటికి గెంజికి పుత్రుడు కలిగి, ఆ కుమారుడి శృంగార జీవితంలో వాటిల్లిన అవాంతరాలు ప్రత్యక్షంగా చూచివుంటుంది. లభ్యచారిత్రకాధారాలతో రచయిత్రి—కథానాయిక అనే అవకాశం లేదుగానీ, రచయిత్రి కథానాయిక అయివుంటుంది అని సహృదయులు హృదయ పూర్వకంగా భావిస్తారు.

## జపాను సాహిత్యం—స్త్రీల రచనలు:

సాధారణంగా, ఏదేశ సారస్వత ప్రథమరూపం అయినా కవిత్వమే అవుతుంది. ఆ కవిత్వం గాన లయాన్వితంగా వుంటుంది. శ్రీమతి మురాసఖి వ్రాసిన గెంజిగాథ జపాను సాహిత్యంలో మొదటి దశకు చెందినదే! ఆ నవల వచనంలో ఉన్నప్పటికీ కవితామయమే!

జపాను దేశస్థుల రచనాజీవితం క్రీ. శ. 5 శతాబ్దంకంటే ముందే ప్రారంభమయింది. అయితే ఆ రచనలన్నీ చైనా భాషలోనే జరిగాయి (Encyclopaedia Britannica—12 Vol). 10 శతాబ్దంలో 'కన' (Kana) లిపి ఏర్పడిన తర్వాత—(ఇప్పటి జపాను భాషా లిపికి ఆద్యరూపం) సంక్లిష్టమైన చైనా భాషను వదిలి అందులో రచనలు చేయసాగారు.

అంతకుముందు జపాను దేశీయులు చైనాభాషలో రచనా వ్యాసంగం సాగించే వారు.[7]

శ్రీమతి మురాసకి జీవించిన సాహిత్యయుగం హైయాన్ యుగం. ఆ యుగంలో ఆమె అగ్రగణ్య. ఆమె ఆబాల్య రచయిత్రి గద్యపద్య రచనలలో సిద్ధహస్త. ఆమె వ్రాసిన నవల వచనంలో సాగినా, కవితా మయంగా, రసరమ్యంగా, ఆనందనిష్యందిగా, కళాఖండంగా గోచరిస్తుంది.

ఆంధ్రులకు 'రాయవాచకం' అల్పంగా గుర్తుకువస్తుంది గెంజిగాథ చదువుతుంటే. అయితే ఈ నవల ఒక జీవిత చిత్రణ. ఒక యుగాదర్శం. ఆంగ్ర సాహిత్యంలో ప్రబంధాలు ప్రదర్శించే లౌల్యజీవితంవంటిది—అంతకంటే అనేక విధాల విభిన్నమయిన రాజాస్థాన జీవితం ప్రదర్శిస్తుందీ నవల[8]

డైరీరూపంలో రచనలు చేయటం ఆ కాలంలో ప్రసిద్ధమే! శ్రీమతి మురాసకికంటే పూర్వం అటువంటి రచనలున్నాయి. స్త్రీలు అధికంగా రచనా వ్యాసంగం సాగించినకాలం అది. పురుషులు శాస్త్రవిషయం మాత్రమే వ్రాసేవారు. కల్పనా సాహిత్యంపట్ల న్యూనభావం ఉండేది. అటువంటి రచనలు స్త్రీలు సాగించేవాళ్లు[9]. శ్రీమతి మురాసకి మహా

---

[7]The earliest Japanese texts were written not in Japanese, but in Chinese, partly because Chinese was regarded as more dignified and partly because Chinese characters were most suited for writing Japanese. (Encyclopaedia Britannica—12 Vol.).

[8]The literary spirit of the classical period was sensitive and delicate, polished and refined, professing realisation of the impermanence of human existence, but actually safely sheltered by the tranquil security of court life. (Eucyclopaedia Britannica—12 Vol.).

[9]Men wrote only serious treatises on learned subjects in Chinese, dismissing fiction as trivial, women, holding an unrestricted position in contemporary society, were able to indulge freely in light literature writing easily in the simple kana, ('కన' లిపి సంక్షిప్త చీనా వర్ణములనుండి సాధించిన నూతనాక్షర సమామ్నాయము), instead of the complicated Chinese characters (సైజిరో యోషిజన).

ప్రఖ్యాత రచయిత్రిగా పేరు గాంచింది. గెంజిగాథ అత్యుత్తమ రచనగా కీర్తి నార్జించుకొంది.

స్త్రీకి స్వేచ్ఛ ఉన్న దేశంలోనుంచి ఇటువంటి ఉత్తమరచన ప్రపంచానికి కానుకగా వచ్చింది. ప్రాచీనాంధ్ర సాహిత్యంలో మొల్లను తొలిగిస్తే స్త్రీలు ఎవరూ ఆంధ్రసాహిత్యంలో లేరనే చెప్పవలసివస్తుంది. దక్షిణాంధ్ర యుగంలో రంగాజమ్మ, ఆ తర్వాత ముద్దుపళని పురుషలోకం ఇచ్చిన స్వేచ్ఛతో రచనలు చేసినవారుకారు, స్వేచ్ఛను హస్తగతం చేసుకొని రచించినవారు.

రంగాజమ్మ, విజయరాఘువ నాయకుణ్ణి నాయకుణ్ణిచేసి, చేసిన రచన మన్నారుదాసవిలాస నాటకం, యక్షగానం గుర్తుకురాకతప్పదు, శ్రీమతి మురాసఖి గెంజిని నాయకుణ్ణిచేసి, రచించిన గెంజిగాథ చూచిం తర్వాత. అయితే రంగాజమ్మవంటి వ్యక్తి, గుణశీలాదులలో, శ్రీమతి మురాసఖి కాదు.

**అనువాదం :**

ఈ నవలను ఆర్థర్ వేలీ జపాను భాషనుంచి ఆంగ్లంలోకి అనువదిస్తే పత్రికలు ప్రశంసించాయి. చక్కని సమీక్షలు వచ్చాయి.[10] ఈ గెంజి గాథ ఆంగ్లానువాదానికి ఆంధ్రానువాదం.

ఆంధ్రానువాదకర్త డా. నండూరి రామకృష్ణమాచార్య ప్రయోగించిన భాష గ్రాంథికం. ఆంగ్లభాష నోచిననోము ఫలమేమో ఆర్థర్ వేలీవంటి అనువాదకర్త లభ్యం కావటం. ఆంధ్రానువాదం అంత ఉదాత్త స్థాయిలో లేదేమో అనిపిస్తుంది అయితే, ఉన్నత స్థాయిలో ఉన్నత ప్రమాణాలతో అనువాదం చేయాలని ఆంధ్రానువాదకర్త ప్రయత్నం సర్వత్రా ప్రస్ఫుటం అవుతుంది.

---

[10]Mr. Waley's translation is marvellous for the subtlety, precision, and beauty of its language—Saturday Review.

One of the few translations in our language that have all the stamp of a original genius-Daily Express.

I have nothing but enthusiasm for his translation as a whole-Punch.

(From the Tale of Genji, translated by Arthur Waley.).

ఆంధ్రానువాదంలో విశృంఖలమైన స్వేచ్ఛ లేదు. ఏ ఘట్టమూ విడిచి పెట్టబడలేదు. ఏ సన్నివేశమూ మార్చలేదు. ఇది అస్వతంత్రానువాదం. వీలైనంతవరకు యథామూలంగా అనువదించాలనే ప్రయత్నం గోచరిస్తుంది. అయితే ఆంగ్లవాక్యం ఆంధ్రంలో అవతరించే సమయంలో వాక్యరూపం మార్పుచెందక తప్పలేదు. ఒక్కొక్క వాక్యంలో కొంతకొంత భాగం అనువాదంలో కనిపించదు. కొంత కొత్త భాగం అతుక్కుంటుంది. ఈ విధమైన మార్పుచేసిన అన్నితావుల్లోను అందమే చిందలేదు.

స్వయంగా సుప్రసిద్ధ కవీ, నాటక రచయిత, అయిన డా॥ నండూరి రామకృష్ణమాచార్య అనువాదంలో ప్రదర్శించిన నేర్పు పాఠకుల్ని ఆకట్టుకొంటుంది. ఆంగ్లానువాదం చదవకుండా ఆంధ్రానువాదమే చదివితే, ఆంధ్ర రచయిత స్వతంత్రంగా తెలుగులో కల్పించిన జపాను దేశానికి చెందిన చారిత్రాత్మక నవల అయి వుంటుందీ గెంజిగాథ అనిపిస్తుంది.

మూలంలో శ్రీమతి మురాసఖి కవితావేశం ప్రదర్శించే కమనీయఘట్టాలు. ఆంగ్లంలోకి ఆర్థర్ వేలీ స్ఫూర్తిమంతంగా తీసుకువచ్చినట్లు అంగీకరిస్తే, డా॥ నండూరి రామకృష్ణమాచార్య, ఆంగ్లానికీ మూలానికీ సౌందర్యం సమకూర్చించే రీతిలో చేసిన కవితా రచన సహృదయులు సరసంగా స్వీకరిస్తారు.

ఈ సుకుమార తూలికల
ఇంపుగ గూర్చిన దిండ్లతోడుతన్
నీ సహశయ్యపైన శయనించుట కంటెను,
పోయి, ఓ అవిశ్వాసినీ,
కోపఘూర్ణిత కషాయముఖీ,
'నుకి' కొండకోనలో
ఆ సెలయేటి రాళ్లపయి
హాయిగ నే నిదురింపనెంచెదన్.

(ఆంధ్రానువాదం—పేజీ 262)

Not softlier pillowed is my head
That rests by thine, unloving bride,
Than were those jagged stones my bed.
Through which the falls of Nuki stride.

(ఆంగ్లానువాదం—పేజీ 246)

Unloving bride కు అనువాదం లేకపోయినా, Jagged stones కు తెలుగు పదం వ్రాయకపోయినా, కొండకోన ఆంగ్లంలో లేకపోయినా, సుకుమారతూలికలు, అవిశ్వాసిని, కోపఘూర్ణిత కషాయముఖీ పదాల ప్రయోగం, సందర్భోచితంగా తోచి, మూలానికే వన్నె పెడుతుందా ఈ రచన అన్నంత ఆనందం కలిగిస్తుంది.

పతితహేమంతపత్రమర్మరారావములతో శ్రుతిగల్పుకొన్న పిల్లనగ్రోవిని పరవశ మొందించి నిలుపగలిగిన పాటనే పాడగల్గుదువా!

(ఆంధ్రానువాదం—పేజీ 46)

Would that I had some song that might detain
The flute that bends its notes
With the low rustling of the autumn leaves.

(ఆంగ్లానువాదం—పేజీ 57)

'పతిత' పద ప్రయోగంతో ఈ సందర్భంలో స్ఫురించే సున్నితమైన భావంకంటేకూడా, 'పతిత హేమంతపత్ర మర్మరారావములు'వంటి సమాస ఘటన ఆనందం కలిగిస్తుంది.

నేను ఆకాశయాత్ర చేయుచున్న చంద్రవంకను—క్రూర పర్వత శిఖరముల మాటున ఏమి దాగియున్నదో తెలియదు. ఎంత ఎత్తున నున్న నేమి, వానిమాటున పడిన వెన్నెల మాసిపోవచ్చును.

(ఆంధ్రానువాదం—పేజీ 108)

I am as the moon that walks the sky not knowing what menace the cruel hills may hold in store; high though she sweeps, her light may suddenly be blotted out.

(ఆంగ్లానువాదం—పేజీ 110)

ఆంగ్లంలోని పోలిక చ్యుతమైతే కావచ్చుగానీ, ఆంధ్రంలోని రమణీయతానూర్తి ఆంగ్లంలో పరిశీలనాపేక్ష కలిగించక తప్పదు.

అనువాదం మధుర శబ్దజాలంతో, సుందర సమాస రచనతో, సరసవాక్య నిర్మాణంతో సాగినప్పటికీ, మూలంలోని భావాలను రమణీయతను ఆపాదించే తీరులో సాగినప్పటికీ ఆంగ్లానువాదం తిరస్కరించిన తావులు లేకపోలేదు.

తెలిసి తెలిసి ఆంగ్లవాక్యార్థం అనువాదకర్త ఎందుకు మార్చవలసివచ్చిందో, సాధించిన ప్రయోజనం ఏమిటో పాఠకులకు అర్థంకాలేదు.

నవలలో అర్థభాగం యథాతథానువాదం, పాతికభాగం సరసమైన అనువాదం. ఆంగ్లంలోకంటే కవితా సౌందర్యం సాధించినది ఆంధ్రం. అయితే తక్కువగల పాతికభాగం ఆంగ్లస్ఫూర్తి అర్థం కాకుండాచేసిన అనువాదం.

Then in a fit of wild and uncontrollable jealousy she began to pour upon me a torrent of bitter reproaches, and with a woman's savagery she suddenly seized my little finger and bit deep into it.

(ఆంగ్లానువాదం—పేజీ 52)

ఇక పెద్ద గొంతుకతో చెలరేగిపోయి, నామీద తిట్లవర్షము కురిపించినది. స్త్రీ సహజమైన క్రూరతతో నా చిటికనవ్రేలు పట్టుకొని గట్టిగా కొరికి వేసినది.

(ఆంధ్రానువాదం—పేజీ 41)

ఇక పెద్దగొంతుకతో—ఆంగ్లంలో లేదు wild and uncontrollable Jealousy కి ఆంధ్రం చెలరేగిపోయి అంటే చాలదు. Savagery అంటే క్రూరతకాదు.

'There is a tendency among men as well as women' said 'Zema nokami, so soon as they have acquired a little knowledge of some kind, to want to display it to the best advantage. To have mastered all the difficulties in the Three Histories and Five Classics is no road to amiability.'

(ఆంగ్లానువాదం—పేజీ 63)

ఆడవాళ్లలోగూడ పాండిత్య ప్రకర్షమీద మక్కువ యెక్కువే. ఇతిహాసత్రయము, పంచకావ్యాలు సరసతకు రాచబాట కానేరదు.

(పేజీ 54)

కానేరదు కాదు, కానేరవు అని, ఆడవాళ్లలో కాదు, ఆడువారిలో అని వుండాలి. ఆడవాళ్ల సంగతేగాని మగవాళ్ల సంగతి జారిపోయింది.

to want to display it to the best advantage అనే లోకం సత్యం అనువాదం కాకుండా పోయింది.

Genji never asked her by what name he was to call her, nor did he reveal his own identity. He came very poorly dressed and—what was most unusual for him—on foot.

(పేజీ 103)

గెంజి ఆమె ఊరు పేరు అడుగలేదు. తన ప్రవర్తననుగూడ వెల్లడించలేదు. అతడు సర్వసాధారణ వేషమునే ధరించుచుండెడివాడు. అంతేగాక అతనికి అలవాటు లేకపోయినను పాదచారియై వచ్చెడువాడు.

(పేజీ 101)

Identity అంటే ప్రవర్తనకాదు. ఆంగ్లంలోని రెండవ వాక్యం ఆంధ్రంలో రెండు వాక్యాలు అయింది. వచ్చాడు అనే అర్థం రావలసిన చోట వచ్చెడువాడు వచ్చింది. అంతేకాదు ఆంగ్ల వాక్యార్థం తారుమారయింది. ఇలా మార్చటం ప్రమాదవశం కావచ్చు. బుద్ధి పూర్వకమయితే సాధించిన ప్రయోజనం మృగ్యం.

నవలలోని కొన్ని పాత్రలపేర్లు తెలుగులో వ్రాసే తీరులో అనువాదకర్త స్వతంత్రతా ప్రవృత్తి ప్రదర్శించినట్లు పాఠకులు పోల్చుకొంటారు. అవి సుందరంగా గోచరించటంవల్ల ఆనందం పొందుతారు. ఉండవలసిన తీరుకంటే భిన్నంగా వుండటంవల్లనే పఠిత్రృలోకామోదముద్ర లభ్యమవుతుంది.

Murasaki—Kiritsubo—మురసకి, కిరిట్ సుబోగా వ్రాయాలి. అలాకాక అనువాదకర్త మురాసఖి, కిరీటశుభగా వ్రాయటం భారతీయతా స్ఫూర్తితో స్వీకారయోగ్యంగా కనిపిస్తాయి. ఇటువంటివే అనేక నామధేయాలు.

ఇంకా, చాలా, బాగా, అంతా, కోసము, పోయింది, ఇవ్వవలెను, తెలుసు, మనిషి, కలుసుకొని, చేసుకొని, తీసుకొని, పూసుకొని, వర్షఋతువు, గ్రీష్మఋతువు, హేమంతఋతువు, వసంతఋతువువంటి వ్యావహారిక రూపాలు నవలలో కనిపిస్తాయి.

9-వ పేజీలో 'నా కింకా'తో ప్రారంభమయ్యే పేరా వంటివి పరికిస్తే, ఇటువంటి పేరాలు కొన్ని అనువాదకర్త వ్రాయలేదేమో మరెవరయినా వ్రాశారేమో ననిపించే అవకాశం వుంది.

అనువాద విధానంలో, భాషా ప్రయోగంలో కొన్ని వ్యత్యస్తాల మాట కేమిగానీ, ఆంధ్రానువాదం ఆస్వాదయోగ్యంగావుంది.

రచయిత్రి హృదయం:

గెంజిగాథ అత్యుత్తమ నవల. రమారమి వెయ్యేళ్ల పూర్వం వ్రాయబడిన ఈ నవలతో (అప్పుడు నవల అనే పేరు లేకపోవచ్చు, ఈ రచనను మరో పేరుతో పిలిచివుండవచ్చు) సరిసమానంగా చెప్పగల నవలలు ఈ కాలంలోకూడా ఎక్కువలేవు అన్నది విజ్ఞుల అభిప్రాయం.[11]

గెంజిపాత్ర చిత్రణలో రచయిత్రి హృదయకాంతు నిక్షిప్తం అయివుంది. ప్రేమైక జీవనుడయిన గెంజి ప్రణయ గాథలు సుకుమార హృదయులయిన పాఠకులను స్వప్నలోకంలో విహరింపజేసే సమర్థాలు. ప్రతిపాఠకుడు గెంజి పాత్రలో తాదాత్మ్యం చెందుతాడు. అతని ఆనందాలు భయాలు ఆశలు నిరాశలు తనవిగా అనుభూతి చెందుతాడు.

రచన వాస్తవంగా వుండాలనీ, కల్పన కారాదనీ రచయిత్రి అభిప్రాయం. ఆ అభిమతం ఘంటాపథంగా కంఠోక్తిగా నవలలో అదను చిక్కినప్పుడు ఆమె వ్యక్తంచేసింది. అంతేకాదు. వాస్తవిక సమాజ చిత్రీకరణకోసం వాస్తవ చరిత్రను ఇతివృత్తంగా స్వీకరించింది.

శృంగారం ప్రేమపట్ల ఆమె వ్యక్తంచేసిన అభిప్రాయాలు ఉదాత్తమయినవే! ప్రేమభావం కోల్పోయినట్లు కోల్పోయేటట్లు గోచరించే అధునాతన సమాజంలో జీవించే మనిషి, ఈ నవల చదువుతూ వర్తమానంలోనే గతంలో జీవిస్తాడు. అందులో స్త్రీ పురుష తారతమ్యం కనిపించదు. గెంజిగాథ చదువుతున్నంతసేపు, ఒక క్రొత్త లోకంలో జీవించిన చదువరి, పుస్తకం మూసి, మామూలు లోకం చూచి, ఈ లోకంలో ఆ లోకం సృష్టించుకోవాలన్న ఆలోకనం కలిగించుకొంటాడు.

శ్రీమతి మురాసకి స్త్రీ పురుష సంబంధంపట్ల ఉన్న లోకదృష్టి, సక్రమమయిన మార్గంలో ఉంచాలని తాపత్రయపడింది. పరిత్యలోకం తమ జీవితాలమీద, అభిమానం, ప్రేమ, అనురాగం అభివృద్ధి చేసుకోవాలని

---

[11]The Tale of Genji will probably prove one of the twelve great novels of the world—Nation. (From the Tale of Genji—translated by Arthur Waley).

తలంచింది. తను వ్యక్తం చేయదలచుకొన్న ప్రతివిషయం సమగ్ర సాను-భూతితో తిలకించింది. పరీక్షించింది. చిత్రించింది. మనిషిని ఒక మహత్తర శక్తిగా దర్శించి రూపొందించింది. అందుకే ఆమె పాత్రలు సార్వకాలికాలు, సార్వజనీనాలు.

గెంజిగాథ చదివిన ఎవరికయినా క్రొత్త ఉత్సాహం ఉరకలు వేస్తుంది. చిత్రతమో విస్తారంతో విచిత్రగతుల్లో పయనించే నేటి నాగరక జీవితం వెన్నుమీద సూర్యోదయం ఈ నవల.

నవల రాజవంశానికి సంబంధించిన ఇతివృత్తంకలదే అయినా సమాజేతివృత్తంలాగా భావించుకొంటారు పాఠకులు. గెంజి, రాకుమారుడే అయినా, అతని హృదయం ప్రతిసామాన్యమానవుడి హృదయమే! అతని ప్రతిభావం, ప్రత్యాలోచన, ప్రతిసన్నివేశం సామాన్యమానవుడికి సమీపస్థం.

శ్రీమతి మురాసఖి ప్రేమను చాలా విశాలదృష్టితో పరికించింది. ఆమె నవలవలన ప్రేమమయజీవనం, ఆనందమయజీవనం ప్రబోధించాలని భావించుకొందనుకోవచ్చు. నిన్ను నువ్వు, నీ చుట్టూ ఉన్న ప్రకృతినీ, మానవప్రకృతినీ ప్రేమించటం, ఆనందించటం, ఆ ప్రేమమయానందంలో అనంతత్వం అమృతత్వం, స్వీకరించటం నేర్చుకో! దేవుడిచ్చిన మహాప్రసాదం ప్రేమ. అది వ్యర్థం చేసుకోకు! ప్రేమే ఆనందానికి మూలం. ఆనందమే బ్రహ్మ! అదే సృష్టి! స్రష్ట!! ఈ గెంజిగాథలో పరోక్షంగా ఉన్న రచయిత్రి ప్రత్యక్షంగా ముడివేసిన సూత్రం ప్రేమ!

ఈ నవల భారతీయభాష లన్నింటిలోకీ అనువదింపజేసిన కేంద్రసాహిత్య ఎకాడమీ ప్రశంసనీయమైన కృషి చేసింది.

డా. నండూరి రామకృష్ణమాచార్య చేసిన ఈ అనువాదం ఆంధ్రసరస్వతికి అమూల్యాభరణం.

(భారతి '68).

# శ్రీ మధురాంతకం కథలు

శ్రీ మధురాంతకం రాజారాం కథానికా ప్రక్రియా రచనలలో కృషి చేసిన రచయిత. రెండవతరం వాళ్లలో ప్రముఖులైన కొద్దిమంది అగ్ర గణ్యులలో చెప్పదగిన రచయిత. శ్రీ రాజారాం రచించిన 'తాను వెలిగించిన దీపాలు' కథల సంపుటికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతిని ఇచ్చింది. అర్హతను గుర్తించిన ఎకాడమీవారూ, ఆ బహుమతి నందుకొనే అర్హత నార్జించుకొన్న రచయితా ప్రశంసా పాత్రులు!

కథానికా ప్రక్రియ ఆంగ్లంలోనుంచి ఆంధ్రంలోకి వచ్చిందనీ, ఆంధ్ర కథానికా రచయితల సంఖ్యకు లోపంలేదనీ, తెనుగు కథా సాహితీస్థాయి స్వల్పంకాదనీ, ఇప్పుడు ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు.

ఆంగ్లంలో అనేక కథ లున్నాయి. అనేక దేశభాషల కథలు ఆంగ్లంలో పరివర్తింపబడ్డాయి. అవి తెలుగువాళ్లు చదివారు. ప్రభావితులయ్యారు. తెలుగులో కథలు వ్రాశారు. అంతేకాక, ఆంగ్లభాష అక్షరంముక్కరాని ఆంధ్రులలో కొందరు, రచించిన కథలలో ఆంగ్ల కథానికా ప్రభావం గోచరించటంలో అంతరార్థం ఆంధ్ర సంస్కృతి, నాగరికత, జాతి జీవితం మీద, ఇతర జాతి జీవితం ప్రతిఫలించటమే! శ్రీ రాజారాం కథలపై అటువంటి ప్రభావంలేదు.

బెంగాలీ హిందీ భాషలలో వెలువడిన కథలువంటివి తెలుగులో రాక పోలేదు. అందుకు శాంతినికేతన్‌లో చదువుకొన్న ఆంధ్రులు, ఉత్తర హిందూదేశంలో విద్యాభ్యాసం ముగించుకొనివచ్చిన ఆంధ్రులు ముఖ్యంగా పేర్కొనదగినవాళ్లు. తెలుగుదేశపు పొలిమేరలు దాటి మరో ప్రాంతం చూడని ఆంధ్రులు వివరించిన కథలలో ఇతర రాష్ట్రాల జీవిత విధానం ప్రతిబింబించటంలో కారణం, ఆయా భాషలలోని కథలు నవలలు ఆంధ్రంలోనికి అనువదింపబడటమే! శ్రీ రాజారాం కథలపై భారతదేశంలోని ఇతర భాషల కథానికా ప్రభావం శూన్యం!

తెలుగుదేశంలో ఏ నాగరికతల ప్రభావాలకు లోనుకాకుండా పరిపూర్ణమైన ఆంధ్రత్వాన్ని స్వచ్ఛంగా నిలుపుకొన్న తావులు పల్లెలు. ఆధునిక పరిణామాలకు దూరంగా, పట్టణాలకు ఎడంగా ప్రాచీన సంప్రదాయబద్ధంగా, కలుషితం కాని జీవితంతో వెలుగుతున్న పల్లెపట్టులు ఈ రచయిత కథలకు ఆటపట్టులు.

పట్టణ పరిసరాలలో జరిగే వింతలు వినోదాలుగానీ, నగరాలు నాజూకుగా నడిచే ఒంపుసొంపుల సొగసు సోయగాలుగానీ, రోజుకొక క్రొత్త రూపంతో విలసిల్లే పరిణామశీలమైన నగర వాతావరణంలో ప్రతిఫలించే సమాజంగానీ ఈ కథలలోకి రాలేదు. ఒకవేళ అత్యవసరమై పట్టణాలవైపు ఈ కథలు ప్రాకివచ్చినా, పని ముగించుకోగానే పల్లెలకు వెళ్ళిపోయాయి.

శ్రీ రాజారాం కథల్లో పల్లెలు సజీవంగా గోచరిస్తాయి. పాత్రలు కళ్ళ ఎదుట ప్రత్యక్షమవుతాయి. సమాజం గ్రామగతమై సాక్షాత్కరిస్తుంది. ఇటువంటి జీవితం చిత్రించే విషయంలో రచయిత కలం సిరాతో నిండుగా తొణికిసలాడుతుంది.

పల్లె జీవితంలో సామాన్యంగా గోచరమయ్యే కష్టసుఖాలు, ఆచార వ్యవహారాలు, సంప్రదాయాలు, నమ్మకాలు, అపనమ్మకాలు, ఆశలు, ఆకాంక్షలు పొలాలలో పంటలు, అందుకు ఎదురయ్యే బాధలు, బాధ్యతలు, కష్టనష్టాలు ఈ రచయిత కథలలో కనిపిస్తాయి.

పల్లె వాతావరణం, ప్రజల జీవిత విధానం, వారి అనుభూతులు, పల్లె పట్టుల ప్రకృతిరామణీయకం, పర్వతం ప్రక్కగా ప్రవహించే సెలయేరులు, దుమ్ము నిండివున్న వీధులు, పూజలు జరిగే దేవాలయాలు, సంతోష దుఃఖాల సమ్మిశ్రితరూపంగా నిలిచిన గుడిసెలు, మిద్దెలు, విద్యార్థుల కలకలంతో విలసిల్లే పాఠశాలలు, కనులపండుగగా ఈ కథలలో కనిపిస్తాయి.

జీవితంగూర్చి రచయిత కలిగివున్న అభిప్రాయంగానీ, వ్యక్తీకరించిన అభిమతంగాని ప్రవచించేందుకు ఇది అదనుకాదు. ఎందుచేతనంటే రచయిత భావం ఎప్పటికి ఏ తీరుగా మారుతుందో, ఇప్పుడే నిర్ణయించటం కష్టం. అయితే జీవితం గూర్చి ఏ విధమైన దృక్పథంలేని రచనలు ఈ రచయిత చేయటంలేదు.

లభ్యమయిన కథలు పరిశీలించింతర్వాత, రసజ్ఞులైన పాఠకులు, ఆయా కథలలో రచయిత వ్యక్తంచేసిన జీవితం దృక్పథం వింగడించుకొంటే, ఇది

ఏర్పడే అభిప్రాయం. నైతికమైన విలువలకు ప్రాధాన్యం ఇచ్చి, ఇతర నాగరికత ప్రభావంలో పడిపోకుండా, మనిషి స్వాత్మస్థాయి పెంచుకొంటే సంఘ జీవితం సుఖప్రదమవుతుంది.

రచయితకు జీవితంపై సమగ్రాభిప్రాయం చూపాలని తొందరలేదు. జీవితాన్ని సమగ్రంగా చూపించాలని పట్టుదల ఉంది. ఆ ప్రదర్శిత జీవిత పరిధిలో పరిశోధించిన పాఠకులు ఊహించుకోగల అభిప్రాయమది.

మనుష్యులలో మంచి చెడ్డలు, తారతమ్యాలు, తప్పనిసరి! పల్లెలలోనూ మనుష్యులే ఉన్నారు. అయితే వాళ్లు పుట్టుకతో మంచివాళ్లుగా కానీ చెడ్డవాళ్లుగా కానీ రచయిత చిత్రించలేదు. మానవుల ప్రవర్తనకు అవకాశమూ, లేదంటే అవకాశంకల్గిన పరిధి విస్తృతంగానో, సంక్షిప్తం గానో చేస్తున్న అదృశ్యహస్తం ఒకటి వుందనే తాత్త్విక చింతన రచయితకుంది.

ఏ వ్యక్తికి ఏ విధమయిన ప్రవర్తన రచయిత చూపించినా, అది ప్రకృతిగత వ్యక్తి ప్రతిబింబమేకాని, తదన్యంకాదు. అందుచేత, జీవితంయొక్క విస్తృతిని లేండ్ స్కేప్ లాగా రచయిత చిత్రించటమే పాఠకులు చూస్తారు గానీ, మరి ఇతరమైన ఏ దృష్టీ చూడలేరు.

శ్రీ రాజారాం తన కథలలో చిత్రించిన పాత్రలు సజీవంగా వుంటాయి. ఒక పాత్రను చిత్రింప తలపెట్టినప్పుడు రచయిత ఆ పాత్ర పుట్టు పూర్వోత్తరాలు, పూర్వాపరాలు స్పష్టంగాచెప్పి, తృప్తి చెందినట్లు కనిపిస్తుంది. ఆ సమయంలో కథాగమనం పరీక్షించే అవకాశంవైపు దృష్టి ప్రసరింపకుండా, పాత్రసృష్టిలో లీనమయిపోయే రచయిత ఏకాగ్రత ఒక విధంగా ప్రశంసాపాత్రమే! అయితే కథకంటే ముఖ్యంగా పాత్రను ప్రదర్శించటంలో రచయితవాంఛను పాత్రను పాత్రగతసమాజాన్ని సముజ్జ్వలంగా సందర్శించాలనే తాపత్రయాన్ని చూచిన పాఠకులు బాధపడనక్కరలేదు.

గ్రామంలో ఉండే మునసబు కరణం కాక ఈ మధ్య రంగంలోకి వచ్చిన ప్రెసిడెంటూ, బడిపంతులు, బడిపిల్లలు, రైతులు, పంచాంగం తెలిసినవాళ్లు, కూతురుపై మమకారం పెంచుకొన్న తల్లిదండ్రులు, క్రొత్తయింటి కాపురంలో ఇమిడిపోదలచిన క్రొత్త కోడళ్లు, దేశాల వెంబడి పారిపోయే వ్యక్తులు, ఒక విధంగా ఆశోపహతులు, అల్లుళ్లకోసం గాలించే వాళ్లు—వివిధ విధాలుగా పాత్రలు కనిపిస్తాయి.

పసివాళ్ల మనస్తత్త్వం, యువకుల మానసిక అవ్యవస్థ; వృద్ధుల వాంఛలు; భయాలు రచయిత చక్కగా చిత్రింపగలిగినట్లు ఈ కథలలో చూడవచ్చు. కానీ పురుషపాత్రలు దర్శించే నేర్పు రచయితకు ఫోర్ డైమెన్షన్స్‌లో వుంది. అదే స్త్రీ పాత్రలను దర్శించటంలో వీలుకాలేదు. బాధలుపడే స్త్రీలు, జీవితం, కుటుంబం చక్కదిద్దుకొనే స్త్రీలు, తండ్రిని చక్కగా చూచుకొనే కూతుళ్లు, భర్తను భద్రంగా చూచుకొనే భార్యలు, కొడుకుపట్ల వాత్సల్యం చూపే తల్లులు భిన్న కథలలో కనిపిస్తారుకానీ, ఒక్క స్త్రీ ఏ కథలోనూ, అన్నికోణాలనుంచి సమగ్రంగా గోచరంకాదు. 'అవశేషం'లో అనసూయమ్మ అయినా సమగ్రంగా కనిపిస్తుందేమోనని ఆశిస్తే అక్కడా నిరాశే ఎదురవుతుంది.

అయితే పల్లెల్లో ఉండే పురుష పాత్రలు అన్ని కోణాలనుంచి సమగ్రంగా కనిపిస్తాయి. దైవసృష్టిలోని పురుషులు పాత్రలుగా కథలలో మలచబడ్డప్పుడు, సమాజానికి కార్బన్ కాపీలుగా కనిపిస్తారు. సమగ్రమైన పురుషపాత్రసృష్టిలో రచయిత అందెవేసిన చేయి!

వస్త్వైక్యం శ్రీ రాజారాం అన్ని కథలలోనూ చాలావరకు పాటించినా, కాలైక్యం, స్థలైక్యం గూర్చి ఆలోచింప నక్కరలేదు. నవలికలుగా పేర్కొన బడిన 'అవశేషం', 'కారణభూతుడు' 'మరీచిక' పెద్ద కథలు మాత్రమే ఆ దృష్టితో. కథ సైజ్ చిన్నదయినా పెద్దదయినా ప్రముఖంగా శ్రీ రాజారాం కథారచయిత.

పల్లెలోనయినా పట్టణంలోనయినా, సాధారణంగా నవరసాలకూ ఆలంబ నాలుగా మిగిలే మనుష్యులుంటారు. అయితే శ్రీ మధురాంతకం రాజారాం కథల్లో కరుణరసం ప్రధానంగా కనిపిస్తుంది. హాస్యం ఎక్కడో కొంచెంగా మాత్రమే వుంటుంది. శృంగార రసస్థితికలిగే తావులలోకూడా రచయిత ఆ ప్రయత్నం చేయలేదు. సంసార జీవితం ప్రదర్శితమవుతుంది గానీ 'ప్రేమ' కనిపించదు. యువతీయువకుల ప్రేమ విషయంలో 'అవశేషం'లో 'ఇందుబాల' తొందర కనబడుతుంది, అది రసాభాసం! 'వగపేటికి చల్లచిందినన్'లో మురళీకృష్ణపాత్ర అపర గిరీశంలాగా వుంటుందని ఆశించినవాళ్లకు నిరాశే ఎదురవుతుంది. మరో సుగుణం ప్రేమ చిత్రింపవలసివచ్చినా, రచయిత గుంభనగా సంయమనం ప్రదర్శించటం! ప్రేమను గూర్చి చెప్పే పరిస్థితి ఎదురైనప్పుడు, మెల్లగా కథను కరుణంవైపు

రచయిత లొక్కుపోవటం చూచిన పాఠకులు ఈ రచయిత జీవిత దృక్పథం కొద్దిలో కొద్ది అర్థం చేసుకొనే అవకాశం వుంటుంది.

శ్రీ మధురాంతకం రాజారాం కథలను కొన్ని తరగతులుగా విభజించుకో వచ్చు. ఆ విభజన పాత్రలనుబట్టి కుదురుతుంది కాని వస్తువులనుబట్టి కుదరదు. స్థూలంగా వస్తువు గ్రామగతమయింది. పాత్రలూ పల్లెలకు చెందినవే! వస్తువులో వైవిధ్యం వుంది. అంతకంటే పాత్రల వైవిధ్యం ప్రస్ఫుటం.

పల్లెలో పాఠశాల ఒక విధమైన చైతన్యయుత సంస్థ. అందులో అధ్యాపకులు, విద్యార్థులు అనేకులు. వారిని పరిశీలించి పాత్రలుగా మలచుకోగల రచయిత పరిమిత సమాజాన్ని యథాతథంగా చిత్రించినట్లవు తుంది. శ్రీ రాజారాం, అధ్యాపక వృత్తిలో ఉన్న రచయిత. అందుచేత చాలా కథలలో పాఠశాల బడిపిల్లలు అధ్యాపకులు వారి వారి మానసిక పరిస్థితులు పాఠకులకు కనిపిస్తూ కనిపించటం సహజమే!

'తాను వెలిగించిన దీపాలు'లో (కృష్ణశర్మ తెలుగు పండితుడు) ఉద్యోగం నుంచి రిటైర్ అయి, తను పనిచేసిన పాఠశాల చూడవచ్చి తిన్న ఎదురు దెబ్బలోనుంచి పొందిన తాత్త్విక చింతన దర్శింప వీలవుతుంది.

'పాఠశాల అనగా యిటుకలతోనూ, సిమ్మెంటుతోనూ రూపొందిన భవనాల సమూహం కాదు.' పాఠశాల అనగా విద్యార్థులు అనుకొన్న కృష్ణ శర్మ 'దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుష్యులోయ్' అన్న గురజాడ సూక్తి హృదయంలో తలపోశాడు.

'విధి విలాసము'లో చంద్రమౌళి కాలేజీ లెక్చరరు. ఆ పాత్ర కాలేజీ లెక్చరరు అయినా, స్కూలు టీచర్ అయినా, జిల్లా కలెక్టరు అయినా కథలో ప్రాధాన్యంలేదు. లక్ష్మికి భర్త కావటానికి, వెంకటనరసయ్య గొంతులో మరణసమయంలో ఇన్ని నీళ్లు పోయటానికి చంద్రమౌళి కాలేజీ లెక్చరరు కావలసిన అవసరంలేదు. అయిదేళ్ల క్రితం పిచ్చివాడుగా ఉన్న చంద్రమౌళి అంత త్వరగా లెక్చరరు ఎలా అయ్యాడో కూడా ఆలోచింప దగిందే!

'అవశేషం'లో ఇందుబాల, ప్రకాశం సురేంద్ర పల్లెవిడిచి పట్టణంవచ్చి చదువుకొని, కాలేజీ వాతావరణం కల్పించిన తొందరలవల్ల ప్రేమలలో ప్రవేశించిన పాత్రలు. అంత కంగారుగా ప్రేమించే అమ్మాయిగానీ, అది చూస్తూ కిమ్మనకుండావుండే అన్నగానీ, అరుదుగానీ అసలు లేకపోలేదు.

అయితే ప్రకాశం పాత్ర విశిష్టమయింది, ఆ పాత్ర ఒక పరిపూర్ణ చిత్రణ! మరువరాదు.

'కారణభూతుడు'లో రామన్న సీనప్ప చిన్నతనంనుంచీ స్నేహితులు. పట్టణంలో కాలేజీ చదువు ముగించుకొనివచ్చి, కారణభూతుణ్ణి కనిపెట్ట గలిగారు.

'మరీచిక'లో ప్రకాశం కాలేజీ చదువు ముగించుకొనివచ్చిన విద్యార్థి. ఈ పెద్ద కథలో రచయిత ఒక సుందరస్వప్నం పాఠకులకు ప్రదర్శించినట్లే!

రచయిత చాలా కథలలో ప్రకాశం ప్రధాన పాత్రగా గోచరిస్తుంది. ఆ పాత్రను చిత్రీకరించేటప్పుడు రచయిత తన ఆత్మను ఆ పాత్రలో చొప్పిస్తున్నట్లేననీ, తన ఆశలు నిక్షిప్తం చేసుకొంటున్నట్లేననీ, పాఠకులు భావించే అవకాశం ఉంది.

మనదేశ భవిష్యత్తుకు ప్రాణభిక్ష ప్రసాదింపగలిగినవి పల్లెపట్టులు. అక్కడ జరిగే వ్యవసాయం దేశ సౌభాగ్యానికి అత్యంతావశ్యకం. విద్యా వంతులయిన యువకులు వ్యవసాయరంగంలో కృషిచేస్తే దేశం సుభిక్షం అవుతుంది. ఆ ఆశ రచయితలో కనిపిస్తుంది. అందుకే 'ప్రకాశం' వ్యవసాయంలో కృషిచేయ ప్రయత్నించటం 'మరీచిక'లో కనిపిస్తుంది.

'మర్రిచెట్టు'లో రామం స్కూలు విద్యార్థి! ఎక్స్‌కర్షన్‌కు పోవాలని తపనపొందిన తన హృదయం గుర్తించిన సత్యం, చివరిలో పాఠకుల హృదయం కదిలిస్తుంది.

'మాతృసప్తకం'లో రామకృష్ణ వారాలు చేసి చదువుకొని కాలేజీ లెక్చరర్ అయిన యువకుడు. పెళ్లాడింతర్వాత, వారంలో ఏడు రోజులు భోజన సదుపాయాలు కలిగించిన తల్లులు ఏడుగురికి బట్టలు ఇవ్వటంలో అతని మనస్తత్వం పాఠకులను స్పష్టంగా తెలిసిపోయింది. పైగా రామకృష్ణ కాలేజీ లెక్చరరు!

'ప్రాణదాత'లో నీరజ తాతయ్య అధ్యాపకుడుగా పలువురికి ప్రాణదాత. శేఖరం జర్నలిస్ట్‌గా నీరజ విద్యార్జనకు డబ్బు పంపుతూ ఒక విధంగా ప్రాణ దాత! జబ్బులో పడిపోయిన శేఖరంను రక్షించిన డాక్టర్ నీరజ మరో విధంగా ప్రాణదాత! ఈ కథ కళాఖండంలా ఆకర్షింపగలిగింది. అయితే వాస్తవిక దృక్పథంతో పరిశీలిస్తే కొంత అసహజంగా భాసించే అవకాశం కలిగివుంది.

'అడిగిరాని వరాలు' పూర్తి పాఠశాలా జీవితం చిత్రించే చక్కని కథ.

రచయిత ప్రధాన పాత్రగావుండే కథలు శ్రీ మధురాంతకం రాజారాం కొన్ని రచింపకపోలేదు. రచయిత అయిన శ్రీ రాజారాం కథలలో తీర్చి దిద్దిన రచయిత పాత్రలలోనుంచి, ఈ రచయిత మనస్తత్వం తెలుసుకొనే వీలేమైనా వుందేమోనని ప్రయత్నించే పాఠకులకు అవకాశం ఇవ్వకపోలేదు.

'జారుడు మెట్లు'లో నీలకంఠం ఉత్తమ రచయిత. బీదతనంలో బాధలు పడ్డాడు. భార్యపై అనుమానంతో దేశాలుపట్టుకు వెళ్లిపోయాడు. పన్నెండు ఏళ్ల తర్వాత తిరిగి స్వస్థలం చేరుకొనేసరికి తన పేరుతో తను వ్రాయని రచనలు ప్రచురింపబడి ఉండటంచూచి బిత్తరపోతాడు. అవి కాముక రచనలు. బాధపొందుతాడు. అప్పటికే డిటెక్టివ్ సాహిత్యం ఇబ్బడి మబ్బిడిగా దిగుమతి అయివుంటుంది. తన పేరుతో రచనలు సృష్టించింది తన కొడుకేనని తెలిసి ఆశ్చర్యపోతాడు. నీలకంఠం కంఠంలో శ్రీ రాజారాం కంఠం వినిపిస్తుంది. ప్రకాశం గొంతులోంచి వినిపించిన ఒక్కమాట తృప్తి కలిగిస్తుంది. నీలకంఠం అనుకొన్న మాటలు 'తీసుకొన్న యితివృత్తంలోగానీ, కుదిరించుకొన్న శైలిలోగానీ, సాగించిన కథనంలోగానీ వీళ్లుపో యిందొక క్రొత్త పోకడ. పోకడ అనటంకన్నా పోకడలు అనటం సమంజసం. ఎందుకంటే శైలిగానీ, కథనంగానీ, ఒకచోట ఉన్నట్లు మరొకచోట లేవు' ...... 'రచయిత పేరు చెప్పకొని రచన లమ్ముకోడం సవాలైతే రచనమూలంగా రచయిత మళ్లీ లోకంలోకి తిరిగిరావటం ఎదురు సవాలు.' అదేవిధంగా గతానుభవం నెమరువేసుకొని వ్రాసిన రచనను, ఆశ్లేషా ప్రచురణాగారం కర్త ప్రకాశం, తన తండ్రి రచన ప్రచురింపకుండా ఆపితే తల్లి ప్రశ్నింపగా ప్రకాశం, రచయిత, పాఠకుడు, పబ్లిషర్ అయిన ప్రకాశం పలికిన మాటలు. 'ఐనా నాన్నగారి పుస్తకాని కిప్పుడేం తొందర. ఎప్పుడైనా వేసుకోవచ్చు దాన్ని. అది కాలగతికి మార్గొడ్డి కలకాలం నిలిచే పుస్తకం.'

'చేదు నిజం'లో రాధాపతి నాటక రచయిత. బీదవాడు, రచన వాస్తవికంగా ఉండాలని తలంచేవాడు. కలల్లో బ్రతికే ప్రకాశం పీపుతట్టి కల్పనాత్మకంగా కథచెప్పి గడుసరిగా ప్రవర్తించాడు.

'జగన్నాటకం'లో ఒక ప్రక్క నాటకం ప్రయోగింపబడుతూ వుంటుంది. మరోప్రక్క ప్రేక్షకులలో కథ సాగుతూ వుంటుంది. నాటకంలో పాత్రలు అసహజంగా వుంటాయి. సంభాషణలు అసహజంగా వుంటాయి.

జీవితంనుంచి దూరంగా పోయివుంటాయి. ప్రేక్షకులలో ఉన్న సులోచన జీవితం నాటకంలో ప్రధాన పాత్రధారితో ముడిపడివుందని చివరిదాకా తెలియదు. అంత అసహజంగా రచన ఉండకూడదని రచయిత అభిప్రాయం.

'కారణభూతుడు'లో ఒక రచయిత పాత్రవుంది. ఆ రచయితకు డిగ్రీ వుంది. ఉద్యోగంలేదు. జీవితం గూర్చిన ఆశలు నిరాశలయ్యాయి. పల్లెలో ఉన్న రెండు మతాలకు ఉన్న తగాదాలు అభివృద్ధి చెందేందుకు ఏర్పడ్డ రెండు వారపత్రికలలో ఒక వర్గం గుర్తించకుండా మరో వర్గం వారికి రచనలు అందించి బ్రతుకుదెరువు చూచుకొన్న రచయితమీద పాఠకులకు కోపంకంటే సానుభూతి కలిగేట్టు శ్రీ రాజారాం చేసిన చిత్రణ, పరిశీలింపదగింది.

పల్లెలోగానీ, పట్టణంలోగానీ కన్నకూతురు మీద తండ్రికి మమకారం తప్పదు. పల్లెలోని పుత్రికా జీవులు అల్లుళ్లను వెతకటంలో పడేబాధ. 'ఎదురుగాలి' మొదలైన కథలలో గోచరమవుతుంది.

జాతకాలమీద పల్లె ప్రజలకు నమ్మకం ఎక్కువ. అన్ని పనులకు పంచాంగం తిరగేయటం తప్పనిసరి అవుతుంది. ప్రోనోట్లు వ్రాయటం చేతగాక, పంచాంగం చూడటం తెలియక, పల్లెటూరిలో బడిపంతులుగా ఉండటం కష్టం. 'పంచాంగ ప్రసక్తి' 'కాటుక కంటినీరు' అందు కుదాహరణలు.

సన్యాసుల రాకపోకలు, వారికి పరిచర్యలు, వారుచెప్పే మాటకోసం పల్లెప్రజలు చెవులప్పగించి వినటం గ్రామాలలో నేటికీ సామాన్యం. ఆ ఇతి వృత్తంతో శ్రీ రాజారాం రచనలున్నాయి. 'వైరాగ్యంతో సరాగం' మొదలైనటువంటివి ఆ రకం రచనలు.

పల్లెలో చాలామంది ఇంటిపట్టున ఉండలేరు. అందుకు కారణాలు అనేకం. దేశాల వెంబడి వెళ్లిపోతుంటారు. మళ్లీ ఎప్పుడో వస్తారు. ఎటోపోతారు. అది ఒక విధంగా సృష్టి వైపరీత్యం అర్థం చేసుకోవాలనే తాపత్రయం. ఈ కోవకు చెందిన రచనలు 'మానవుడి విజయము' మొదలైనవి.

పేదవాడయిన విద్యార్థి డిగ్రీ పుచ్చుకొని ఉద్యోగంలో ప్రవేశించి వివాహ విషయం వచ్చేసరికి కొరకరాని కొయ్యగా తయారయ్యే ప్రమాదం ఉంది. పల్లె వాతావరణం వదిలిపెట్టి పట్టణ పరిసరాలకుపోయి, అక్కడి పద్ధతులు పూర్తిగా అనుకరింపలేక, వెనుకటి గుణం పూర్తిగా వదులుకోలేక సతమత మయిపోయే విద్యార్థులు ఎందరో !

'అవశేషం'లో ప్రకాశం స్వప్న-జ్ఞానం కోల్పోయినవాడుకాడు. వలచి వచ్చిన ధనవంతుల బిడ్డను బీదవాడయిన ప్రకాశం కాదనుకొని వెళ్లిపోయి, ఏం సాధిస్తాడో అనే ప్రశ్న మిగిల్చివేస్తాడు. అయితే అతను జీవితంలో పైకిరాడని తెలిసినా ఒక విధమయిన ఆనందమే కలుగుతుంది.

'వగపేటికి చల్లచిందినన్'లో మురళీకృష్ణ బీదవాడు. డబ్బుతో రాగల్గే తేగల్గే అమ్మాయిని తప్ప పెళ్లాడననేవాడు, తల్లి దయనీయస్థితిని మరిచిపోయి, మూర్ఖంగా తన సౌఖ్యం తాను చూచుకొన్నా వాడిపట్ల పాఠకులకు బాధ కలిగినా, వాడయినా బాగుపడ్డాడని సంతోషమే కలగవచ్చు.

'భూపతి జంపితిన్ మగడు భూరి భుజంగముచేత జచ్చె . . . నృపతీ వగపేటికి చల్లచిందినన్' అనే పద్యంలో చివరి పదాలయిన 'వగపేటికి చల్లచిందినన్' అనే కథాశీర్షిక చూచిన పాఠకులు వేశ్య అయిన తల్లి దగ్గరకు కొడుకు విటుడై వస్తాడేమోననే బాధకలిగే అవకాశం వుంది. అయితే ఆ కథలో అటువంటి విషయం ఏమీ వుండదు. అప్పుడా శీర్షికకు అర్థం ఆలోచించుకోవలసివస్తుంది.

నేటి యువతీ యువకుల్లో పెళ్లి విషయకంగా అవ్యవస్థవుంది. అర్థం పర్థంలేని తోవలవెంట వాళ్ల ఆలోచనలు పోతూవుంటాయి. 'ఎక్కువలసిన రైలు' 'సబల' అటువంటి రచనలే! ఆ కథలలో రచయిత పాత్ర చిత్రీకరణ ఫలితాంశంగా తీర్మానం పాఠకులను ఆకట్టుకొంటాయి.

పల్లెలో ప్రజాజీవితం, కుటుంబంలో సౌఖ్యాలు, దుఃఖాలు, కలహాలు, కలసికట్టుగా వుండటాలు ఎన్నో వుంటాయి. ఒక పాత్రతో మరో పాత్ర కలిగివుండే సంబంధ బాంధవ్యాలవల్ల మనస్సును దాచుకోవటం, వ్యక్తీకరించటంవంటి పరిస్థితులు; ఎన్నో ఎదురవుతుంటాయి. ఆర్థికమయిన ఇబ్బందులు, మనఃతాపాలు, పంటపొలాల విషయం, వర్షం రానిబాధా. ఇటువంటి వస్తువులపై సమగ్రంగా చర్చించి, చక్కని కథలు వ్రాసే సామర్థ్యం శ్రీ రాజారాం పుష్కలంగా కలిగివున్నట్లు చెప్పవచ్చు. 'చీమలు పెట్టిన పుట్టలు' 'మరీచిక' 'అపశ్రుతి' 'సంఘజీవి' 'రామారావు చతుర్లోకాలు' ఉదాహరణప్రాయంగా చెప్పుకోవచ్చు.

పై చివరికథలో రామారావు పాత్ర శ్రీ రాజారాం పాత్ర అయి వుంటుందని మిత్రులు ఊహింపగల్గుతారు. నిజం!

'సుడిగుండం' కూడా ఒకవిధంగా పై కోవకు చెందిన రచనే! అయితే తాసీల్ దారు అయిన శేఖరం కోపతాపాలకు కారణం అతని కుటుంబంలోని ఆర్థిక పరిస్థితులు అని అందరూ పోల్చుకోలేకపోవచ్చు. శ్రీ రాజారాం మరొక తాసీల్ దారు పాత్ర 'ప్రాప్తి'లో సృష్టించి, తమాషాగా రచించటం గమనార్హమే!

రచయితకు తన పాత్రలపై సానుభూతి లేకపోవటం మహాపాపం. శ్రీ రాజారాంకు అటువంటి పాపం అంటుకోదు. ప్రతి వ్యక్తీ తప్పులు చేస్తాడు. తప్పుచేయటం కాదు ఆ పాత్ర స్వభావం. అలా చేయవలసివచ్చింది. అందరూ దుష్టుడు, దుర్మార్గుడు అనుకొనేట్టున్న వ్యక్తిని పాత్రగా స్వీకరించి, సానుభూతితో పాత్ర సృష్టిచేసి, పాఠకులకుకూడా జాలికలిగేట్టు చిత్రింపగల నేర్పు రచయితకుంది.

పల్లెలలో ఉండే, వివిధ విధాలుగా మసలుకొనే, మనుష్యుల్ని పాత్రలుగా తీర్చిదిద్ది ఆ పాత్రలకు సాహిత్య స్థితి, ప్రసాదించిన శ్రీ మధురాంతకం రాజారాం కథలు పల్లెపట్టులకు ప్రతిబింబాలు. కాదంటే ఆ కథలు పల్లెలు చూడటానికి పనికివచ్చే దర్పణాలు. పల్లె ప్రకృతి అన్ని కోణాలనుంచి పలికించి, ఒక సమగ్ర గ్రామం రచనలలో అందించిన రచయిత కృషి సఫలమయింది.

కవిత్వంలో కల్పన ఎంతవున్నా చింతలేదు. వాస్తవికత వుండితీరాలన్న నిర్బంధంలేదు. అయితే కథారచయితకు ఆటంకాలున్నాయి. కథ వాస్తవికంగా లేకపోతే, ఆ రచనచేసిన ప్రయోజనం ఉండదు.

వాస్తవికంగా వుండటం వీలవుతుంది. అయితే అంతా వాస్తవికంగా ఉండదు. కొంతవరకు మాత్రమే! అంతా వాస్తవమయితే అది చరిత్ర అవుతుందిగానీ సాహిత్యంకాదు. కల్పన ఉన్నప్పటికి వాస్తవ భ్రాంతి ఉండేట్టు రచించాలి. కథలో వాస్తవం వుంటే నిస్సారంగా వుండవచ్చు. అంతా కల్పనే అయితే అది పాఠకులకు దూరమయిపోతుంది. కాబట్టి కథలో వాస్తవాభాసం వుంటుంది.

'జగన్నాటకం'లో సులోచన అనే బక్కపలుచటి యువతి నాటకం చూస్తూ కూర్చుంటుంది. ఆమె తన గోడు అంతా ప్రక్కనే కూర్చున్న అప్పుడే పరిచయమయిన 'పిన్ని' (అది కలుపుకొన్న సంబంధం)తో చెప్పుకొంటుంది. రంగస్థలం మీద ఆ సులోచన కథతో పోల్చదగిన కథ నాటకంగా

సాగిపోతుంది. చివరికి అది నాటకం, ఇది జీవితం అనే ముగింపు ప్రస్తావింపబడింది.

నాటకంలో తనను వదిలేసి మరొకడితో లేచిపోయిన కథానాయికను ఆకస్మికంగా ప్రైజ్ రూపంలో వచ్చిన డబ్బుతో కాపాడిన కథానాయకుడి చిత్రణగానీ, కథాపథకంగానీ అసహజంగా అవాస్తవికంగా ఉన్నట్లు తెల్పటం రచయిత ఉద్దేశ్యం.

తనను వదిలేసి వెళ్లిన భార్యను ఎంత పతిత అయినా తిరిగి తీసుకొనివచ్చి సంసారంచేసే భర్తలు లేరా? ఉండవచ్చు! ఉండకపోవచ్చు! ఈ సందిగ్ధ సమాధానం ఉన్న సమస్య ఎప్పుడూ అవాస్తవంకాదు. ఆకస్మికంగా అంత డబ్బు రావటం సాధారణంగా జరగదు కాబట్టి అవాస్తవంగా అసహజంగా తృణీకరింపవచ్చు.

బాగుంది. అయితే సులోచన ముడిచిన గోడుగుమాదిరిగా గుట్టుగా, కష్టనష్టాలు పైకి తెలియకుండా బ్రతుకుతున్న సులోచన, అపరిచితురాలితో తన గోడంతా వెళ్లగ్రక్కుకొంటుందా? ఆమెకు తెలిసినవాళ్లతోనే తన దీన జీవితం చెప్పుకొనే ఇష్టంలేకుండా బ్రతుకుతున్న మానిని, సులోచన!

ఇది అసహజంగా ఉందనరాదు. ఎందుకంటే అది కథ కనుక. నిజమైన జీవితంకాదు కాబట్టి.

'జగన్నాటకం'లో ప్రదర్శింపబడిన నాటకంలో అవసరమయినప్పుడు బహుమతి రూపంలో డబ్బురావటం అసహజంగా ఉంటుందని అంగీకరించి చూస్తే మరొక అవాంతరం ఎదురవుతుంది.

'జారుడు మెట్లు'లో శ్రీపతి సార్థక నామధేయం కలవాడు 'నీలకంఠం' అనే రచయితను చూడబోయి, అతని కష్టాలు చూచి వర్షం కురిసిన రోజు, అయిదువందల రూపాయిలు కిటికీలోంచి పడేసిపోవటం సహజంగా వుందా? ఏ రచయితమీదనయినా అమితప్రేమ ఉంటే అతని రచనలన్నీ కొని చదువుతారు, కాఫీ ఇప్పిస్తారు, నాలుగు గొప్పమాటలు చెబుతారు, కాదంటే పది రూపాయిలు అప్పు ఇస్తారు, లేదంటే పది రూపాయిలు గొప్పకోసం దానం చేస్తారుగానీ, అయిదువందలు గుప్తదానం చేస్తారా? చేస్తే చేయవచ్చు ననుకొంటే నీలకంఠం అనుమానం విచిత్రంగా వుంటుంది. తన భార్య సహధర్మచారిణి ఎన్నిరోజుల్నుంచి ఇంత డబ్బు అధర్మమార్గంలో సంపాదించింది అని అనుమానిస్తాడు నీలకంఠం. ఇంతకాలం తనతో కాపురంచేసిన భార్యను

గూర్చి నీలకంఠం అంతేనా తెలుసుకొంది! పోనీ ఇంట్లో గంజికాచుకోవటానికి గింజలులేని పరిస్థితిలో అంత డబ్బు ఉంచుకొని ఆమె పిల్లల దుఃఖం చూస్తూ ఉండగలదా? ఇదేదీ అసహజంగా లేదా? జీవితమైతే అసహజమే! కథ అయితే అసహజంకాదు. ఆమాత్రం కల్పన లేకపోతే కథ మలుపు ఎలా తిరుగుతుంది? నీలకంఠం ఇల్లువిడిచి వెళ్ళిపోవటానికి కారణం ఏమి చిక్కుతుంది! అతను భవిష్యత్తులో సాధింపబోయే లేదా సాగింపబోయే జీవితానికి నాంది తప్పనిసరికదా!

'వర్షించిన మేఘం'లో కారుక్రింద పడబోయిన స్వర్ణలతను రక్షించి శేషాద్రిని ఇది 'ప్రణయగాథ' కాదుగదా అని మిత్రులు ప్రశ్నించినప్పుడు, అతను చెప్పిన సమాధానంలో రచయిత అభిమతం వుంది. 'రాజకుమారి తోటమాలిని పెళ్లాడటానికి ఇది జానపద గాథకాదు. ప్రథమ పరిచయం లోనే ప్రణయానికి అంకురార్పణ జరగడమనేది లోకంలో అరుదుగానూ కథలలోనూ తరుచుగా జరిగే సంఘటన. పైగా దారంట వెళ్లే దానయ్యను ప్రేమించటానికి స్వర్ణలత అంత మూఢురాలు గాదు.'

అయితే 'సబల'లో నీళ్లలో పడిన విశాలను రక్షించిన రామారావు విశాలను ప్రేమించాడు. ఆమెకూడా ప్రేమించింది. పెళ్లయిపోయింది. అంత ఆకస్మికంగా, అంతకుపూర్వం కనీసం పరిచయమైనా లేని రామారావును ఆమె ఎలా పెళ్లాడగలిగింది? తను నీటిలో చావబోతుంటే ఎవరు రక్షిస్తారో అతన్ని పెళ్లాడదామనే నిశ్చయంతో నీటబడిందనుకొనటం సమాధానం అయితే, ఎవరో ముసలివాడో, ముతకవాడో, గుడ్డివాడో, కుంటివాడో ఆమెను రక్షించివుంటే ఆ వ్యక్తినే పెళ్లాడి వుండేదా?

కథ ఎప్పుడూ జీవితంలా ఉంటుందికానీ పూర్ణ వాస్తవంగా ఉండదు. ఆ దృష్టితో ఈ కథలు చదవనక్కరలేదు. వాస్తవం అనే భ్రమ కల్పించి ఎంత అవాస్తవం అయినా వ్రాయవచ్చు. కథలు వాస్తవంగా ఉన్నట్లు అనిపించాలి. శ్రీ రాజారాం కథలు అన్నీ వాస్తవికంగా వుంటాయి. ఈ రచయిత మరొక తావులో సంభాషణగతంగా కల్పన కథలో అవసరమనే అంగీకరించటం పాఠకులు గమనిస్తారు.

శ్రీ మధురాంతకం రాజారాం 'మధు' అనే గుప్త నామంతో వ్రాసిన 'దేశీయత — వాస్తవికత' అనే వ్యాసం 'భారతి'లో ప్రచురితమయింది. ఆ వ్యాసం ఒక కథలాగా ప్రారంభింపబడింది. ప్రధాన పాత్ర అయిన మధు

సూదనానికి చక్రపాణి వ్రాసిన ఉత్తరంలో కథల చర్చ ఉంది. మధుసూదనం చక్రపాణిపై సదభిప్రాయం కలిగింపలేదు. అందుచేత చక్రపాణి ఉత్తరంలో ఉల్లేఖించిన అన్ని సంగతులు మధుసూదనం మాటలుకావని, తన్మూలంగా 'మధు' మాటలుకావని, అందువల్ల శ్రీ మధురాంతకం రాజారాం మాటలు కావనీ అనుకొనే అవకాశం వుంది.

ఆ వ్యాసంలో 'పదింట తొమ్మిదవంతుల కథల్లో ఈనాడు కనిపిస్తున్న కాలేజీ వాతావరణాన్ని గురించే మాట్లాడుకొందాము . . . . ఓ అబ్బాయి ఓ అమ్మాయిని ప్రేమించడంగానీ, ప్రేమించకపోవడంగానీ పెళ్లాడడంగానీ, పెళ్లాడక పోవడంగానీ వాటంతటవి మహత్తర పరిణామాలేవీ కావు.' ఈ సిద్ధాంతం అందరికీ సమ్మతమవుతుందని ఆశించే అవకాశం తక్కువ. ఎందుకంటే ఎక్కువమంది అటువంటి రచనలే వ్రాస్తున్నారు. పాఠకులు చదువుతున్నారు కాబట్టి.

ఇటువంటి రచనలు విరివిగా వెలువడితే క్షీణయుగంలో ప్రబంధాలకు పట్టినగతే ఆధునిక యుగంలో కథాసాహిత్యానికి పట్టవచ్చునని అంగీకరింప వచ్చు. పైన పేర్కొనబడిన వస్తువుతో అడ్డూ ఆపూ లేకుండా రచనలు ఇప్పుడు వచ్చినట్లే ముందు ముందు వెలువడితే కథారచన ప్రమాదంలోపడే పరిస్థితి తప్పని సరేకావచ్చు కానీ ప్రేమించటం ప్రేమించకపోవటం మహత్తరం పరిణామం కాకుండాపోదు. స్త్రీ పురుష సంబంధంకంటే లోకంలో మిగిలివున్న ఉదాత్త ధర్మం ఏమిటో ఆలోచింపవలసి వస్తుంది. అయితే ఆ ప్రేమ రచనకు పూనుకునే రచయితలు నిస్సారమైన రచనలు చేస్తున్నారనీ, అవి అవాస్తవికంగా వుంటున్నాయనీ, అలాకాక సహజంగా ఉండే రచనలు వెలువడితే బాగుంటుందనీ ఆశింపవచ్చు. ప్రతిభావంతుడు, సమర్థుడు అయిన రచయిత ఏ వస్తువు అయినా తీసుకొని ఉన్నతసృష్టి చేయవచ్చు. అయితే కొన్ని వస్తువులు మహోన్నతమ సృష్టిచేయ వీలుగానివి అయితే అవుతాయిగాని, చక్కని రచన చేయటానికి సమర్థాలు కాకపోవు.

ప్రేమ కథలు పరిణతి చెందిన రచయితల చేతులలోకాక, రచనా పద్ధతులు అభ్యాసం చేసుకొంటున్నవారి హస్తాలలో నలిగిపోవటంవల్ల నేటి కథలు అటువంటి అభిప్రాయం కలిగిస్తున్నాయి.

దేశీయత – వాస్తవికత అన్న వ్యాసం చదివి ఆపైన శ్రీ రాజారాం కథలు చదివితే, వ్యాసంలో స్థాపించిన సిద్ధాంతాలకు అనుగుణంగా, ఉదాహరణ

ప్రాయంగా ఈ కథ లున్నాయి అనిపిస్తుంది. పేరు చెప్పని ఒక కథ క్లుప్తంగా ఉదాహరింపబడింది.

ఏ వ్యాసరచయిత అయినా ఏ వస్తువు కథకు పనికిరాదని తలపోస్తాడో, ఆ వస్తువే కథకు ఎంతవరకు తగిందవుతుందో ఆలోచించి ఆపైన సిద్ధాంతం చేయటం మంచిది. ఒకటి రెండు విషయాలలో పాక్షికంగా అభిప్రాయ భేదం ఉన్నప్పటికీ పై వ్యాసం కథా ప్రక్రియాత్మను ప్రదర్శించేదిగా వుంది. రచయితలు తాము రచనలుచేసే ప్రక్రియలపై వ్యాసరచనచేస్తే అది పై వ్యాసంలాగా మిక్కిలి ఉపయోగకరం అవుతుంది.

ప్రతి రచయితకు వ్యక్తిగతమైన రచనాశైలి ఉంటుంది. అది అనుకరింప సాధ్యంకానిది. శ్రీ రాజారాం వచనశైలి రమణీయంగా వుంటుంది. 'కథకు ఇతివృత్తం శరీరంలాంటిదైతే శైలిని వేషంతో ఉపమించవచ్చు'నని రచయిత అభిప్రాయం.

ఈ రచయిత శైలిలో తూగు ప్రధానమయింది. వాక్యనిర్మాణంలో క్రమత సమత వుంటాయి. వస్తుతః కావ్యాత్మ ఉన్న శ్రీ రాజారాం శైలిలో ఎడనెడ కవితా స్ఫూర్తి గోచరమవుతుంది. కథంతటా ఒక సమానత్వం, ఒక ఋజుమార్గం గోచరమయి, ఈ కథ ఈ రచయితదే అని చెప్పగల ముద్ర వుంటుంది.

వర్ణనల సందర్భంలో రచయిత చూపే సంయమనం గమనార్హం. ప్రకృతి వర్ణనలో కవితారీతివున్నా, పాత్రల స్వభావస్వరూప వర్ణనంలో స్వభావోక్తి కనిపిస్తుంది. శైలిలోని విశిష్టతను ఎక్కువగా యథావస్తు వర్ణనంలో పాఠకులు చూడగలుగుతారు.

ఆధునిక యుగలక్షణమయిన వేగం ఈ రచయిత శైలిలో గోచరంకాదు. మూర్తి దాల్చిన సంయమనం ప్రదర్శిస్తుంది శైలి. ఆంధ్రులలో ఆవేశపరులు అధికమే అయినా, అటువంటి పాత్రలు ఈ కథలలో అరుదు. అందుచేత ఆ పాత్రలు ప్రదర్శించే తొందరలేదు. అది ఉండి ఉన్నట్లయితే శైలిలో ఏమయినా మార్పు ఉండేదేమో అనిపిస్తుంది.

ఈ రచయిత అధికంగా సంభాషణలతో వ్రాసిన కథలు వేళ్లపై లెక్కింప వచ్చు! రచయిత కథ చెబుతూ వెళ్లుతూ ఉండటమే కాని, సంభాషణ గతంగా పాఠకులకు కథ చెప్పిన తావులు అత్యల్పాలు.

కథా శిల్పం విషయంలో శ్రీ రాజారాం మార్గం ప్రత్యేకమయింది. ఆంగ్లంలో ఉన్న ఉత్తమ కథా లక్షణాలు అన్నీ సంతరించుకోని కథలు ఈ రచయితవి. ప్రారంభోపసంహారాలు మాత్రం ప్రసిద్ధాంగ్ల కథలలోలాగా కథాలక్షణానుగుణంగా వుంటాయి.

కాలక్షేపంకంటే ప్రయోజనం సాధించేదిగా కథ ఉండాలన్నది రచయిత అభిమతం. ప్రయోజనం ప్రవేశపెట్టినప్పుడు కథాశిల్పం దెబ్బతినకుండా రచన చేయటం అసిధారావ్రతం! కత్తిమీది సాము!

శ్రీ రాజారాం కథలు ఓపికగా చదవకపోతే కథాత్మ గోచరంకాని పరిస్థితి ఎదురవుతుంది. అదెందుకు జరుగుతుందంటే, కథను దూరంగావుంచి, పాత్ర రూపరేఖలో స్వభావమో, తన ఉద్దేశమో రచయిత స్పష్టంచేస్తున్న సందర్భంలో కథ ఎక్కడ ఆగిపోయిందో, మరెక్కడ ప్రారంభమవుతుందో తెలదు కాబట్టి, కథాగమనం కుంటుబడకుండా ఏంచెప్పినా రాణింపుకు వస్తుంది.

చక్కని ప్రారంభం లిఖించి, కొంతదూరం కథ నడిపి, ఆ మధ్యలో రచయిత తన జీవిత దృక్పథం చెప్పటం సాగించి, చివరిలో చక్కని ముగింపు చెప్పటం, శ్రీ రాజారాం కథలన్నింటిలో స్పష్టంగా కనిపించే సత్యం.

ముగింపులో కథకు ఒక ఉన్నతస్థితినిచ్చే నేర్పు రచయితకుంది. 'సర్కసు డేరాలో 'మేకపిల్ల పులినెలా నమ్మగలిగింది' అన్న ప్రశ్నకు 'అవి జంతువులు గదండీ!' అనే జవాబుతో ముగింపు మనుష్యులకు కొరడా దెబ్బ! 'నాకు ఈత బాగావచ్చు' అని విశాల 'సబల' ముగింపులో చెప్పినమాట పాఠకుడి హృదయంలో ఒక్క క్షణం స్పందన అవుతుంది. క్షయతో బ్రతికి వున్న భార్యను ఖాతరు చేయనివాడు నాటకంలో పాత్రగా నాయికకు క్షయవస్తే అల్లాడిపోయిన తీరుతో ముగింపు చెందిన 'జగన్నాటకం' పాఠకుల గుండెలో నిలిచిపోతుంది. 'పోనీలే నాయనా! ఇది నాకు దక్కాలని లేదు' అని ముగిసిపోయిన కథ 'వగపేటికి చల్లచిందినన్'లో తులసమ్మ మాట ద్వ్యర్థి కావ్యం. 'అడిగిరాని వరాలు'లో రమణయ్య సెలవుపెట్టాడో కొడుకు పెట్టించాడో ఆలోచించుకోమంటుంది ఉపసంహారం. 'ప్రాప్తి' సమాప్తి పట్టేడు నశ్యం ఇంతపని చేయిస్తుందా అని ఆశ్చర్యం కలిగిస్తుంది. 'మాతృ సప్తకం'లో సుమిత్ర ముగింపులో జగన్నాథంగారి అమ్మాయిగా రామకృష్ణ భార్యగా ఒకే పనిచేసి కనిపిస్తుంది. 'మర్రిచెట్టు' శతాబ్దాలు

పాటు ఇక్కడే వుంటుందనే పరిసమాప్తి, మనిషి గతించినా మానవత్వం నిలిచి వుంటుందనే సూచనను కలిగిస్తుంది. శ్రీ రాజారాం కథలన్నింటిలో ముగింపు తటిల్లతలాగా మెరిసి ఆలోచనాలోచనాలు విచ్చుకొనేట్టు చేస్తుంది.

ఈ మధ్య ముద్రితమైన శ్రీ రాజారాం 'పాటలతోట' కవిత్వంకంటే కవితాహృదయాన్ని, కవితాహృదయంకంటే సంగీతాన్ని, సంగీతంకంటే సంగీతహృదయాన్ని; ఉత్తరోత్తర బలీయంగా ప్రదర్శిస్తుంది.

పట్టణ నాగరికత ప్రతిబింబింపచేసే రచయితలూ, పల్లెజీవితం చిత్రించే రచయితలూ, మనస్తత్త్వం రూపొందించే రచయితలూ, సమస్యలు పరిష్కరించే సదుద్దేశంతో కథానిర్మాణం చేసే రచయితలూ పలువురు ఆంధ్ర సాహితీలోకంలో కథానికా భవితవ్యం ప్రసాదిస్తున్నారు. గ్రామ గత సమాజ సందర్శనం చేసే ప్రతిభావంతులయిన కథా రచయితలలో శ్రీ మధురాంతకం రాజారాం విశిష్ట స్థానం పొందివున్న సత్యం సరస పాఠక లోకం గుర్తించింది. మరింత సాహితీ తపశ్చర్యవల్ల కేంద్ర సాహిత్య ఎకాడమీ బహుమతి ఈ రచయిత పొందాలని మిత్రుల అభిమతం.

(భారతి '68)

# శ్రీ కుటుంబరావు కథలు

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథలనబడే చిన్న రచనలు పధ్నాలుగు చేర్చి ఒక పుస్తకంగా ఇటీవల ప్రకటించబడింది.*

శ్రీ కుటుంబరావు నలభై సంవత్సరాలనుంచి వందల కథలు వ్రాసిన సుప్రసిద్ధ రచయిత. ఇప్పటి ఈ కథల్లో కథ ప్రధానం కాదు. పాత్ర! వస్తుప్రాముఖ్యం లేదు. లక్ష్య నిర్దేశం ప్రముఖమయింది. పాత్రలూ తజ్జన్యలక్ష్యాలూ కలిసి ఈ రచనలు—కథలని పేర్కొన్నా ఫరవాలేదు.

ఈ కథలలోనుంచి ఏ పాత్రనయినా వెలికితీసి సమాజంలో వదిలిపెడితే సజీవంగా బ్రతుకుతుంది. కొన్ని ఇతరేతర రచయితల కథలలోని పాత్రలు సంఘంలో బ్రతకలేవు. అవి సంఘంనుంచి రాకపోతే సంఘంలోకి పోలేవు.

కనకయ్యవంటి వ్యవహారదక్షులు, పట్టాభి, కాంతం, భాస్కరం, సావిత్రి, వర్ధని, స్నేహలతారావు, అమ్మమ్మ, పార్వతీశం అన్నీ జీవితంలోని పాత్రలు! ఆ పాత్రలవంటివి సంఘంలో లెక్కలేనన్ని పాత్రలు! ఒకొక్క పాత్ర కొన్నివందల, వేలపాత్రలకు ప్రతినిధి.

పెళ్లి చేయబోయేముందు, పిల్ల లేక పిల్లాడు అభిజాత్యం, సౌందర్యం, తెలివితేటలు, వయస్సు, ఆర్థిక స్థితిగతులువంటి ఎన్నో విషయాలు తెలుసుకొన్నతర్వాత సంబంధం స్థిరం చేయటమో త్యజించటమో చేసినట్లు పాత్రకు సంబంధించిన అన్ని సంగతులు చిన్నిచిన్ని అంశాలవరకు ఆరాతీయకుండా ఈ రచయిత పాత్రచిత్రణకు పూనుకోలేదు.

వాస్తవికత ఈ రచనలలోని మరొక మేలిగుణం. వాస్తవికత చాలావరకు సజీవ పాత్రలవలన, వాటి ప్రవర్తన, సంభాషణలవలన కలిగింది. రంభ

---

* పెళ్లిచేయకుండా చూడు (పధ్నాలుగు కథలు): రచయిత, శ్రీ కొడవటిగంటి కుటుంబరావు.

పాత్ర వాస్తవికంగా చిత్రించటం అంటే ఏమిటో అర్థంకాదు. రిక్షావాడి పాత్ర వాస్తవికంగా చిత్రించటమంటే ఏమిటో తెలుసు. తెలియని, సంఘంలోలేని ఏ పాత్రను ఎవరూ పరిపూర్ణంగా వాస్తవికంగా చిత్రించలేరు. పోనీ చిత్రించినట్లు నమ్మించనూలేరు.

ఈ కథలు చదివే పాఠకుల్లో ఈ పాత్రలన్నీ వుంటాయి. మామూలు లోకంలో ఈ మామూలు పాత్రలు ఈ కథల రోడ్డుమీద యథేచ్ఛగా తిరుగుతూవుంటాయి. అందుకే అవి మాటాడితే వాస్తవికంగా వుంటుంది. నడిస్తే వాస్తవికంగా వుంటుంది. ఏంచేసినా, చేయకపోయినా వాస్తవికంగా వుంటుంది. మనిషి హృదయం అనేకభావాలకు అద్దంలా ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతిబింబాలన్నీ పునః ప్రతిబింబితమయిన సంపుటి యిది.

మధ్యతరగతి మానవుడి జీవితం ఈ కథలన్నింటికీ అంతస్సూత్రం. ఈ తెగ జన జీవితం ఎప్పుడూ ఎదుర్కొనే సమస్య ధనాభావం! అందువల్ల తిండి వుండదు. తిప్పలుంటాయి. పెళ్లి—ఆడపిల్లల పెళ్లి అందువల్లే పెద్ద గొడవ అవుతుంది. అబ్బాయిల చదువు ఇబ్బందిలో ఇరుక్కుపోతుంది. కన్నీళ్లు, కష్టాలు ఈ జనానికి యజమానులు!

ఈ రచనల్లో పాత్రలు పట్టణాలలో తిరిగినా, పల్లెల్లో జీవించినా వాటి తల్లివేళ్లు మాత్రం, పల్లెభూమిలో బాగా లోతులకు చొచ్చుకుపోయి వుంటాయి. కొమ్మలూ రెమ్మలూ ఆకులూ చిగుళ్లూ ఆ మూలా ఈ మూలా ఆకాశపు అవకాశంలో విహారం చేస్తాయి. ఆ పాత్రల ప్రవర్తన, వేష భాషలు, వాటిచుట్టూ వాతావరణం, అవి తిరిగే ప్రదేశాలు, వాటిమధ్య సన్నివేశాలు సంఘటనలు సంఘర్షణలు వాస్తవికతను పట్టి చూపిస్తాయి.

పాఠకుల హృదయాలకు ఈ రచనలు చేరువకావటానికి ఇంకో కారణం హాస్యం! ఆంధ్రులకు హాస్యం ఆవగాయలాగా గోంగూర పచ్చడిలాగా ఎంతో యిష్టం! తమమీద తాము జోక్ వేసుకోగలవాళ్లు చాలామంది ఆంధ్రులు. ఈ కథలలో చాలా సున్నితమయిన హాస్యం వుంది. హాస్యం కేపిటలిస్ట్ సమాజ లక్షణం అని ఎవరో అన్నారు. ఆ మాట గౌరవింపదగింది కాదు. తింటానికి తిండి, కట్టటానికి బట్ట, ఉండటానికి యిల్లు లేనివాళ్లు హాస్యం అనుభవించటం కళ్లారా చూచింతర్వాత, అది కేపిటలిస్ట్ సమాజ లక్షణం అనుకోవటం ఎలా కుదురుతుంది.

హాస్యం అందరూ అనుభవించేదే! తెలుగు రచయితలలో శ్రీ ముని మాణిక్యం హాస్యం ఉన్నంత సుకుమారంగా మరెవరిదీ—పూర్వం శ్రీ భమిడి

పాటి కామేశ్వరరావు, శ్రీ పానుగంటి హాస్యంకూడా ఉండదేమో ననిపిస్తుంది. హాస్యంలో గుండునూది, మరమేకు, గునపం గుచ్చుకోకూడదు. శ్రీ మునిమాణిక్యం హాస్యం వంటిదే శ్రీ కొడవటిగంటి హాస్యం! ఎంత మనోహరంగానో వుంటుంది.

ఈ కథలనిండా బల్లపరుపుగా పరచుకొన్న సమాజజీవితంలో హాస్యం ఉవ్వెత్తుగా లేచి పాఠకుడికి ఎదురయి, నిలిపి, నవ్వించి ముందుకు పంపుతుంది. ఈ కథలలో ఏ పేజీలోనయినా ఒక నవ్వు ఎదురుగా వస్తుంది. ఎవరోతప్ప, సాధారణంగా ఆ నవ్వుకు ఎక్కువమంది పాఠకులు లొంగిపోతారు.

ఇంకో గుణం వచనం. అది వ్యావహారికం తెలుగుదేశంలో పూర్వం పుస్తకాలలో కనిపించే వచనం వేరు, ఎక్కడో క్వాచిత్కంగా తప్ప, లోకంలో వినిపించే వచనం వేరు. ఇప్పుడు లోకంలో కనిపించే వచనమే పుస్తకాలలోనూ వినిపించాలని ప్రయత్నం. కొందరే ఆ విధంగా వ్రాయ గలరు. అందులో శ్రీ కొడవటిగంటి అగ్రతాంబూలం అందుకుంటే ఆశ్చర్యం లేదు. ఈ రచయిత అన్ని ప్రాంతాలకు, పోనీ ఒక ప్రాంతంలోని అందరికీ (భిన్నవ్యవస్థలవారికి) ప్రాతినిధ్యం వహించే వచనం వ్రాయలేదు. ఒక ప్రాంతంలో ఒక విధమయిన వ్యక్తులు మాట్లాడే మాటలను ఉన్నవి ఉన్నట్లుగా వ్రాయగల నేర్పు రచయితకుంది. గురజాడ వచనంలో ఉన్నంత వైవిధ్యం కోసం ఈ కథలలో వెదుకనక్కరలేదు.

ఈ రచయిత ఈ కథలలో అక్కడక్కడా ప్రయోగించే కొన్ని పదాలు ఆధారంగా చేసుకొని కమ్యూనిస్టు తత్వం ప్రచారంచేసే దృష్టి ఉన్న రచయిత అని ఎవరయినా అనుకొనే అవకాశంవుంది. ఇతివృత్తాలు ఆధారంగా ఆ తత్త్వం ఏం వుందో పోల్చుకోవటం కొంచెం కష్టమే అవుతుంది. మధ్య తరగతి జీవితమే కమ్యూనిజం అయితే ఆ తత్త్వం బాగా ప్రచారం చేసినట్లే భావింపవచ్చు. జూదమాడటం కేపిటలిస్ట్ సమాజ లక్షణమని రచయిత కంఠోక్తిగా చెప్పడం ఎదురవుతుంది. ఇది నిరభ్యంతరంగా అంగీకరింపదగ్గ సంగతికాదు. ఉన్నవాడూ జూదమాడుతాడు. లేనివాడూ ఆడుతాడు. జూదమాడట మనేది ధనసంబంధికాదు. బుద్ధికి పుట్టిన—ఏదయినా అనవచ్చు—పోనిపుండు. పిరికివాళ్లు, బలహీనులు అన్ని వ్యవస్థల మనుష్యులు జూదమనే చిక్కులో చిక్కుకోవటం, ఆ ధర్మసత్రంలో దాక్కోవటం, సమాజం చూచే ఎవరికయినా అవగతపూర్వమేకదా! అంచేత జూదం అనేది ఒక వ్యవస్థకు పరిమితంకాదు.

అపరిమితం! ఈ కథలలో కమ్యూనిజం వస్తుగతం కాదు. సంభాషణల్లో వుంది. అదీ అరుదు.

'పిల్లకు ఏ కిరస్తానివాడో రాసిపెట్టి ఉందనుకోండి'—ఈ మాట చదివి ఈ రచయిత నిందార్థకమయిన కిరస్తానీపదం ప్రయోగించిందెందుచేతనో అని ఎవరయినా ఆలోచింపవచ్చు. క్రైస్తవుడు అని వ్రాయవచ్చు. అలా ప్రయోగం జనసామాన్యంలో లేదా! లేకపోతే వ్రాయటం అసహజంగా వుంటుంది కదా! కాబట్టి నిందార్థకం అనవసరంగా ప్రయోగించే కంటే త్యజించటం శ్రేయస్కరం. మరోవిధంగా వాక్యం వ్రాసుకోవచ్చు. ఇంకో చోట 'క్రిష్టియన్‌లాగున్నాడు... అతను... మాట్లాడేటప్పుడు పులిలాగో, పిల్లిలాగో తప్ప మధ్యస్థంగా కుక్కలాగాని గేదెలాగాని మాట్లాడనేలేదు' అనివుంది. హాస్యంకోసమా ఇలా వ్రాసింది? హాస్యంకోసమే అయినా అతను క్రిష్టియన్ కానవసరంలేదు. ఈ దేశంలో మతాలు చూచినన్ని రుచులు మరేమీ చూడలేదు. మతవిషయిక తాటస్థ్యం—మంచిని ప్రదర్శించకపోతే... మనో—కనీసం—వాక్కాయకర్మలవల్లనయినా వాంఛితం అనుకొంటాను.

కథ అన్నా, కథనం అన్నా చెప్పటం ప్రధాన లక్షణంగా కలవే కదా! సంభాషణలు సాగినకొద్దీ ఆ పద్ధతి అంతోయింతో నాటకందగ్గరకు చేరు కొంటుంది. కథలో సంభాషణలు ఉండవచ్చు. మంచి కథలో ఎక్కువ సంభాషణలు మరీ ఎక్కువగా సాగవనుకొంటాను. ఈ రచనలలో కథ తక్కువ సంభాషణలు ఎక్కువ. ఒక పాత్ర కథ చెప్పటమయినా వుంటుంది. అందులోనూ సంభాషణలు.

ఈ కథలలోని రచనలన్నీ కథ లనుకొంటే తత్సమర్థన కొంచెం కష్టమయిన పనే! ఈ కథలు చదివి ముగించింతర్వాత పాత్రలు మనస్సులో మెదిలినంతగా కథలు మెదలవు. గుర్తుండవు. కథ బలంగా లేకపోవటమే అందుకు కారణం. సామాన్యంగా కథల లక్షణాలు—కురుచదనం తప్ప—అరుదుగా కనిపిస్తాయి, ఈ రచనలలో. సమగ్ర ప్రారంభోపసంహారాలుగానీ, కథాకథనంగానీ, పాత్రలు కలిపి కుట్టుతూ నూదీదారంగానీ ఏమీ మెరుపుల్లా కనిపించవు. ఈ రచనలు ఎక్కడయినా ప్రారంభింపవచ్చు. ఎక్కడయినా ముగింపవచ్చు. ఇక్కడే ప్రారంభం, ఉపసంహారం అన్న నియమాలు ఏమీ లేవు.

కథకేకాదు, ఏ విధమయిన సృజన రచనకయినా ప్రధాన లక్షణం వస్త్వైక్యం. అది స్పష్టంకాదు ఈ రచనలలో. కథావస్తువు కంటే

ఇతర పాత్ర ప్రాధాన్యం కథాభాగం మరుగు పరిచేంత విస్తృతంగా వుంటుంది పాత్రచిత్రణ. గట్టిగా ఇది కథ అనుకోదగింది మొదటి రచన 'పెళ్లి చెయ్యకుండా చూడు!' మిగతా కొన్ని కథల్లో మాదిరిగా యువతీయువకులు స్వేచ్ఛగా పెళ్లి చేసుకోగలిగే మానసికౌన్నత్యం పొందితే వివాహ వ్యవస్థ బాధారహితమవుతుందని రచయిత చెప్పబూనిన సత్యం. లక్ష్యం, కేంద్రం గౌరవ పాత్రలు. కనకయ్య కాఫీ వ్యవహారంలో జరిగిన పరిశీలన కథకంతగా అవసరమా! కనకయ్య మంచి పాత్ర! అయితే ఆ పాత్ర అంత తేజస్సుతో ఈ కథకు అవసరంకాదు. పాత్రబరువు కథ బరువుకంటే ఎక్కువ. మీ అబ్బాయికి మా అమ్మాయినిచ్చి పెళ్లి చేయను అని 'అతడు' అనలేకపోవటానికి కారణం తను లంచాలు తీసుకోనేవాడు కావటం! లంచాలు తీసుకొన్నంతమాత్రాన, ఈ స్థితిలో 'అతను' కనకయ్యకు అంతగా భయపడాలా! అంతగా తప్పించుకు తిరగటం ప్రధానమా! అమీతుమీ తేల్చి చెప్పవచ్చుకదా! తేల్చి చెప్పకపోవటం పిల్లలిద్దరికీ మార్గం కావచ్చుకానీ, అతని భయకారణం అనూహ్యంగానే వుండిపోతుంది. అతడు డబ్బున్నవాడు అనికదా కనకయ్య కాంతం సంబంధంకోసం తిప్పలు పడుతూవుంది! ఆ డబ్బు లంచాల డబ్బే కావాలా? సొంతం ఉండకూడదా? కథ చివరి పేరాలో 'ఇటువంటి డబ్బు కమ్యూనిస్టుపార్టీ ఫండు క్రింద ఖర్చయిపోతుందో ఏమో' అని అనటం అంతకంటే భావ్యంగాలేదు అంటే పట్టాభిలో కమ్యూనిస్టు వాసన కొడుతూవుంది. కాంతమేమో ఒక్కతే కూతురు. ఆమెకే ఈ డబ్బు చెందితే ఆమె భర్త పట్టాభి ఈ డబ్బు స్వీకరించకుండా కమ్యూనిస్టుపార్టీ కిచ్చేయవచ్చునని కదా సూచన! ఇటువంటి డబ్బుతోనా పార్టీ ఫండు పెరుగుతున్నది? పార్టీకి ఏం తెలుసు ఇది ఎటువంటి డబ్బో! ఎవరు పంపినా తీసుకొంటారు. అయితే పట్టాభిలో ఏ మాత్రం కమ్యూనిజం ఉంది ఇటువంటి డబ్బు—పవిత్రంగా, కర్షకులు కార్మికులు చెమటబొట్లు ధనంగా ఏర్పడ్డ పార్టీ ఫండులో—పాపిష్టి డబ్బు—పార్టీ ఫండులో చేర్చటానికి? అసలా రచనలో చివరపేరా లేకపోతే ఏం కొంప మునుగుతుంది!

విధవ అయిన సావిత్రికి 'మళ్లీపెళ్లి' చేయటం గురించి వ్రాసిన కథ సమాజ ప్రోత్సాహకారకం అవుతుంది. తదనుకూల వాతావరణం ఏర్పరచిన పెద్దలు అభినందింపదగినవారు. ఆలోచింపచేసే, ఆనందింపచేసే ముగింపు ఉన్న రచన.

'చెడిపోయిన మనిషి'లో పార్వతీశం వర్ణనిచేసిన తప్పు క్షమింపలేక పోయాడు. స్నేహలతారావు చేసిన తప్పును క్షమింపక తప్పలేదు. ముక్కూముఖం తెలియనివాడికి ఎవరయినా ఎందుకంత ఆదరణ, అభిమానం, గౌరవం చూపించాలో చూపిస్తారో హేతుబద్ధంగా ఆలోచిస్తే సమాధానం లేదు. పోనీ అది మిస్ రావు మంచితనం అని అంగీకరించి వూరుకొన్నా, రచయిత చూపదలచుకొన్న వ్యవస్థను అంగీకరించటం సాధ్యమా? స్త్రీ పెళ్లి చేసుకోకుండా ఎవరో పురుషుడుతో శృంగారజీవితం అనుభవించి పెళ్లి వ్యవస్థకు దూరంగావుండటం కొందరి విషయంలో తప్పుకాదు; తప్పేమి ఒప్పేయగునే అంటే అంగీకరింపవచ్చునా? ఇదీ రచయిత అభిప్రాయం, కథకు కేంద్రం. ఇటువంటి స్త్రీలు వుంటారా? లోకం విశాలమయింది. ఉండవచ్చు! సాధారణంగా ఏ స్త్రీ అయినా పెళ్లి కోరుకొంటుంది. కొందరు స్వేచ్ఛాశృంగారజీవితం పశుపక్షులకు లాగా ఇష్టం వుండవచ్చు. అంతవరకు రుచిగానే వుంటుంది. ఆపైనే అరుచి! ఈ వ్యవస్థను సమాజం భరింపగలదా! సమాధానం కష్టమే! పెళ్లికాకుండా వీళ్లకు కలిగే పిల్లలకు తండ్రెవరు! ఎవరో ఒకరు! ఎవరయితేనేం? ఎవరూ లేకుండా పిల్లలు పుట్టరు కదా! కనుక ఎవడో ఒకడు తండ్రి ఉన్నట్లే లెక్క! వాళ్లు తండ్రి ఉన్న పిల్లలే! తల్లి సంపాదిస్తుంది. పిల్లలు పెరిగి పెద్దవాళ్లవుతారు. వాళ్లకూ తల్లిలాగో తండ్రిలాగో ప్రవర్తించటం చేతనయిపోతుంది. అటువంటి స్థితిలో పెళ్లితంతు లేకుండా పోతుంది. శృంగార సంబంధం వివాహ వ్యవస్థకు భిన్నంగా వుంటుంది.

మరి, ఈ వివాహ వ్యవస్థ ఎందు కేర్పడింది? సృష్ట్యాదినుంచి మానవ ప్రయత్నఫలితం కాదా యిది! ఈ వివాహ వ్యవస్థ స్త్రీకి ఆర్థిక, సామాజిక, రాజకీయ, మానసిక, స్వాతంత్ర్యం లేకుండా చేసి ఏర్పడింది. ఆ స్వాతంత్ర్యాలు అన్నీ స్త్రీకి ఇచ్చి ఈ వివాహవ్యవస్థ వదులుకొంటే ఏమీ చింతలేదా?

పశు పక్ష్యాదుల్లో — మానవులు మినహా — వివాహ వ్యవస్థలేదు, అవి హాయిగానే వున్నాయి. సంతానోత్పత్తి జరుగుతూ వుంది. ఏం కష్టం వచ్చింది? అలాగే మానవ జీవితం ఉండవచ్చు కదా! మిగితా జంతుజాలం కంటే మనిషికి ఆలోచించే శక్తి ఒకటివుంది. ఆలోచన మానవ జీవితాన్ని సుఖమయం చేస్తుంది. ఆ ఆలోచన ఫలితమే ఈ వ్యవస్థ. మనిషి ఆలోచన ఆనందసృష్టి చేయటానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఎంత అవసరమో

నియమాలూ అంత అవసరం. సుస్థిర సమాజం మనిషిని మానవాభ్యుదయ పథగామిగా చేస్తుంది. సుస్థిర సమాజం అంటే నియమబద్ధమయిన వ్యవస్థ. నియమాలులేని స్వేచ్ఛ, పాశవిక ప్రాక్తనసమాజం తిరిగి నిర్మిస్తుంది. ఇది పురోగమనంకాదు, తిరోగమనం. ఈ తిరోగమనవాదం నాకిష్టం వుండదు. ప్రాక్తన మానవుడే — ఏ వ్యవస్థాలేనిదశలో — ఆనందంగా ఉన్నాడంటే అనటానికి ఏమీవుండదు. ఎందుకంటే అది అనుభూతి ఆంతర్యంలో ఉన్న తేడా! నాకు నిన్నటికంటే ఇవాళ ఆనందం కలిగిస్తుంది. ఇవాళటికంటే రేపు అధికానందం అందిస్తుందని నమ్ముతాను. గతం పునాదిమీద నిలిచిన వర్తమానమూ భవిష్యత్తూ ఈ మానవుడు. గతంలో ఉన్న తల్లివేరు తెంచుకోకుండా భవిష్యత్తులో ఆశలసుమాలు ఆనందఫలాలు పూచే కాసే సమాజ సజీవవృక్షంమీద నాకు అభిమానం ఎక్కువ. అందువల్ల నేటి వివాహవ్యవస్థ నాశనం ఇష్టం వుండదు. మార్పు సర్వదా సర్వథా అంగీకరింపవచ్చు; నాశనం కాదు.

'ఉభయ భ్రష్టుడే' అతడు; సోదరి సుశీల అభిమానంగాని, భార్య జానకి ప్రేమగాని పొందలేకపోయి, జానకిలోని ఉదాత్తత పిరికితనంలోంచి పుట్టిన మొక్క. మంచివాడు భర్తగా లభించినందుకు ఆమెకు ఆనందం లేదు. తను తన భర్తకిచ్చిన కట్నంతో పెళ్లయి ఆనందంగావున్న అతని సోదరి సుశీల, కృతజ్ఞత చెప్పలేదని దుఃఖపడుతుంది. తన చెల్లికోసం స్వసుఖం ఉండదని తెలిసి, కుంటిదయినా జానకిని పెళ్లాడి, ఆమెవల్ల ఆవంతయినా సుఖం ఎరుగని అతడు చివరకు ఎవరో వోస్టెనోతో 'శృంగార లాలూచీ' పడ్డట్లు సూచన ఇస్తే అతని ప్రవర్తనను రచయిత ఆమోదించినట్లా? తిరస్కరించినట్లా?

'పగటి కలలు'కన్న ప్రకాశానికి దుఃఖం నిర్మలకు మంచి సంబంధం వచ్చిందని; తనకంటే గొప్పవాడితో — కుదిరిందని తెలిస్తే, తప్పదుమరి వెలికి ఉబికి వస్తుంది.

అతడు సినిక్. అందుకే 'దుష్టగ్రహం!' రాధంటే అతడికి ఇష్టమని అతడికీ తెలియదు. అది సబ్‌కాన్షియస్ పని. అతడొక ఫ్రాయిడ్‌కేస్! రాధను రక్షిద్దామా దెయ్యాలకొంపనుంచి అనికాదు పెళ్లి తప్పించింది, తన సొంతం చేసుకొందామని. అంతే అయింది మరి. ఆ తెలివి ముందే ఏమయింది. అందుకే అతడొక ఫ్రాయిడ్‌కేస్.

'అపార్థం' రెండుభాగాల రచన. మొదటిభాగం పాత్రచిత్రణ. రెండోది కథ. ఇటువంటి కథ రాయటం ఈ రచయితకు సైజంకాదు. ఫారిన్

ఎలిమెంట్. అందుకే గిరిచేత చెప్పించటం. రుక్మిణి గిరిని తిరస్కరించటానికి కారణం రచయిత దృష్టిలో 'ముప్పాతికమంది ఆడవాళ్లు ప్రిమిటివ్‌గా ఉంటారు.' అయితే గిరి మోసగాడని రుక్మిణి intuition. 'The intuition of woman is the result of millions of years of not thinking.' Intuition భంగ్యంతరంగా sub-conscious ఆలోచన!

'ఫోర్త్ డైమెన్షన్'లో మొదటి సగం వ్యాసం. మిగతాది కథ. కథలో విషయం అణచిపెట్టుకొన్న వాంఛ (Suppressed desire). ఇందిర రాజాకంటే మూడేళ్లు పెద్దది. చిన్నతనంలో ఆమె సమక్షంలో ఆనందం, పరోక్షంలో బాధ రాజా అనుభవించాడు. కాలాతీత ప్రేమవాంఛా ప్రదర్శితమయిన కథ. రాజా, ఇందిర గతించిం తర్వాతకూడా భరింపరాని మనోవేదన అనుభవించటానికి కారణం అణచిపెట్టుకొన్న వాంఛ! రెండు కొండ శిఖరాలు భయంకరార్భటితో విరిగి మీదపడుతున్నట్లు కలగని వణుకుతూ లేచికూర్చున్న టి. బి. పేషెంట్‌ను బాగుచేయటానికి ఫ్రాయిడ్ ఉపయోగించిన మానసిక వైద్యంలో రెండు కొండ శిఖరాలు స్త్రీ స్తనాలకు ప్రతీకలుగా భావించిన విషయం ఈ కథా సందర్భంలో గుర్తుకువచ్చి, ఈ రాజా మానసికస్థితి తెలుస్తుంది. 'ఇందిర నన్ను చేత్తో గట్టిగా తనకేసి అదుముకొని నిద్రపోతున్నది . . . ఇందిర రొమ్ము నా చేతికి మెత్తమెత్తగా నొక్కుకొని ఉన్నది.' ఇందిరపై రాజాకువున్న వాంఛ వ్యక్తీకరింపబడలేదు, అది అగ్నిలాగా అతణ్ణి దహించింది. ఉన్నతుణ్ణి చేసింది. ఈ ఉన్నతత — నిజం — కాలాతీత మయిందే!

అత్తయ్య, ఆమె కూతురు రాధ, భాస్కరం అందరూ కలిసి అతనికి 'యావజ్జీవ శిక్ష' విధించారు, దిక్కులేనివాణ్ణి పిలచి. ఉద్యోగం ఇప్పించి పిల్ల నిస్తామంటే 'యావజ్జీవ శిక్ష'గానే వుంటుంది — స్వేచ్ఛ లేకపోయినప్పుడు, తన యిష్టం లేనప్పుడు తను కోరుకోక పోయినప్పుడు, ఎంత అందమయిన జీవితం అయినా.

'దైవాధీనపు జీవితం' శీర్షిక చూడగానే ఈ వుంపులేమిటి అనిపిస్తుంది. వేంకటేశ్వర్లు గోపాలం ముఖ్య పాత్రలు. ఇది కథ అయితే ఇతివృత్తాలు రెండు. వేంకటేశ్వర్లు వింత వ్యవసాయం: గోపాలం సంగీతం. ఉన్న నాలుగెకరాలలో లోకంలోని పంటలన్నీ పండించాలని కలలుగనే ఆశావాది వేంకటేశ్వర్లు: పిల్లాడికి ఏ విషయంలో అభిరుచివుందో, ఆ రంగంలో అతణ్ణి పైకి తీసుకువచ్చే ప్రయత్నమే తండ్రి చేయవలసింది. వేంకటేశ్వర్లు ఆ పని

చేయలేదు. సంగీతం అంటే చెవి కోసుకొనే గోపాలాన్ని చదువుకోమన్నాడు. అందుకే గోపాలం యిల్లువదిలి పారిపోయాడు. బాగుపడ్డాడు. బాగుపడితే పడ్డాడుగానీ, అంతగా బాగుపడటం కల్పనలో కాబట్టి జరిగింది. నిజ జీవితంలో అనుమానమే!

'వేంకటేశ్వర్లు జీవితంలో చెమటలు కక్కుతూ పోరాడటం అందరికీ కనిపిస్తుంది. కొందరు జీవితంతో నిశ్శబ్దంగా పోట్లాడతారు. కొందరు జీవితంతో ఆటాడే చాంపియన్లలాగా కనిపిస్తారు. మరికొందరు ఒడుపుగా వేటాడుతారు. ఇంకా కొందరు నిర్లక్ష్యంగా కూర్చుంటే జీవితమే వచ్చి వనమాలలు వేస్తుంది.'

ఇంతవరకు బాగా నేవుంది. నిర్వచనప్రాయమయిన రచన. పై మాటలు పసిడి పలుకులని, అలా చెప్పటం బాగుండదని, పాఠకులు గుర్తిస్తారో లేదో తెలియదు కనుక పూర్తిగా పసిడిపలుకులు కాకపోయి, కొంతవరకయినా పసిడిపలుకులే కాబట్టి నాలుగు కేరట్ల పసిడిపలుకులని హాస్యంకోసం అన్నట్లుగా బ్రాకెట్లో వ్రాయటం పాఠకులు గమనిస్తారు.

అందుకే శ్రీ కొడవటిగంటి జాగ్రత్తగల రచయిత అనుకోవలసివుంటుంది. ఈ జాగ్రత్త 'ఫోర్త్ డైమెన్షన్'లోనూ కనబడుతుంది. ఫోర్త్ డైమెన్షన్ అంటే కాలం అని పాఠకులకు తెలియదని ఆ రచన మొదటిభాగం వ్యాసంగా రచయిత వ్రాయటం!

తల్లికి పిల్లలమీద, అందులోనూ ఆడపిల్లలమీద, ఇంకా బాధలోవున్న ఆడకూతురుమీద ఎంత మమకారం వుంటుందో తెలిపే కథ 'అమ్మమ్మ కథ.' అమ్మమ్మ మంచిపాత్ర! స్త్రీ హృదయ కోమలత్వానికి, వాత్సల్యానికి ఈ కథ ప్రతీక.

'స్వర్గంలో బందీలు'లో పులులు బందీలే! వృద్ధ దంపతులు బందీలే! ప్రకాశం బందీయే! కథానాయకుడు ప్రకాశం! ఇది ప్రకాశం చుట్టూ తిరిగే కథ అయితే పులులబోను కొంచెం అవసరం. వృద్ధ దంపతుల కథ అంతగా అవసరంలేదు.

ప్రకాశం బెజవాడ వచ్చాడు. పెద్దవాడయ్యాడు. మద్రాసు వచ్చాడు. మరీ పెద్దవాడయ్యాడు. బొంబాయి వచ్చాడు. చాలా పెద్దవాడయిపోవా లనుకున్నాడు. చాలా చిన్నవాడయిపోయాడు. తను 'డబ్' చేసి డబ్బుచేసుకొన్న సినీమాలో నటించిన హీరో చేత తిరస్కరింపబడి కేసుల్లో

దగాయయి నిరుద్యోగియయి, కష్టాలెదుర్కొని గత్యంతరం లేక బిక్కముఖం వేశాడు. ప్రకాశం పాత్ర జాలి కలిగిస్తుంది. అయినా అతను బొంబాయి నగరానికి బందీ !

'ఉద్యోగం' దొరకటం ఎంతకష్టమో తెలిపే కథ మంచి కాలక్షేపం. అతడు సరస్వతీ ప్రచురణలలో పని చేయాలని పడిన తాపత్రయం ప్రయత్నం ఫలితం దుఃఖం కలిగిస్తాయి. ఇక్కడ రచయిత ప్రదర్శించిన హాస్యం కళ్లనీళ్లతో నవ్విస్తుంది. చివరకు ఏమవుతుంది! మంచి కాలక్షేపం !

'పాత్రలు కావలెను' అని వేసిన ప్రకటన చూచి జనం సినిమాలో నటించటానికి పాత్రధారులు కావాలి కాబోలు ననుకొని చేసిన ప్రయత్నం ఎంత నవ్వయినా తెప్పిస్తుంది. అయితే ఆ ప్రకటన ఉద్దేశం అదికాదు. ఏదయినా రచన చేయటానికి పనికివచ్చే పాత్రలు కావాలని అభిప్రాయం. నటీనటులకంటే రచయిత్రి మంచి పాత్రగా పనికివచ్చింది. అయితే ఆ రచయిత్రి రంగంలోకి క్రైసిస్‌లాగా వచ్చింది కాబట్టి పేరుకూడా అదే అయిపోయింది.

ఆ క్రైసిస్‌లాగా ఏ రచయిత్రి అయినా మాట్లాడుతుంది తెలుగుదేశంలో. తన నవలలు గొప్పవంది. తను గొప్ప రచయిత్రినని చెప్పుకొంది. ఆ నవలలు సినీమాగా రూపొందించమంది. ఆ పాత్ర మంచి సెటైర్ ! చక్కని పాత్ర!

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ఈ రచనలు కథలుగా — తృప్తికరమయిన కథారాహిత్యంవల్ల — ఆనందం కలిగింపలేకపోవచ్చు. వస్తైక్యం లేకనో, సరయినవస్తువులేకనో, కథాసూత్రంలేకనో, రచయిత గుర్తున్నంతగా రచన గుర్తుండకనో, పాత్ర గుర్తున్నంతగా కథ గుర్తుండకనో, ఇవి కథలుగా కంటే పాత్రచిత్రణలుగా కనిపిస్తాయి. ఈ రచయిత ఈ విధమయిన రచనలలో పాత్ర లున్నంత బలంగా కథ వుండదు 'పాత్రలు కావలెను' అని కాని ప్రకటన 'కథలు కావలెను' అనికూడా కాదు. పుస్తకం మూసిం తర్వాత పాత్ర హృదయంలో కదులుతూ వుంటుందిగాని కథకాదు. కథ బలహీనంగా, పాత్రలు బలంగా కనిపించే రచనలివి. చక్కని పాత్రల చుట్టూ అవసరార్థం ఏదో కథ అల్లుకుపోతుంది. అందుకే శ్రీ కొడవటిగంటి కుటుంబరావును 'ఉత్తమ కథారచయితగాకంటే' ఉత్తమపాత్ర రచయితగా భావించటం ఉచితం.

మూడు శతాబ్దాల పూర్వం ముమ్మరంగాసాగి ఇప్పుడాగిపోయిన ఆంగ్ల పాత్ర రచన లేక పాత్రీకరణ (charactery) ఒక సాహిత్య ప్రక్రియ. పాత్ర రచయితలకు (character-writer) ఆద్యుడు క్రీ. పూ. మూడవ శతాబ్దికిచెందిన థియోఫ్రాస్టస్ (Theaphrastus). F. H. Pritchard 'The Essays of All Nations' లో చక్కని పాత్రీకరణలున్నాయి. ఆంగ్లంలో 17-వ శతాబ్దిలోని ఫిలిప్ బ్లిస్, థామస్ డెక్కర్, జోసఫ్ హాల్, థామస్ ఒవర్‌బరీ, జాన్ ఎరల్, జార్జ్ హెర్బర్ట్, నికొలస్ బ్రెటన్, థామస్ ఫుల్లర్ ప్రముఖులయిన పాత్ర రచయితలు.

సంఘంలో ఉన్న జీవిత వైవిధ్యం చూచి, తత్త్వం, గుణం, రూపం, ఆకారం, చేష్టలు, ప్రవర్తన, జీవిత విధానం, ఆచార వ్యవహారాలు, ఆహార విహారాలు, నీతి నియమాలు ఇటువంటి వాటి ననేకం ఆధారంగా చేసుకొని మనుష్యుల్ని కొన్ని తరగతులుగా విభజంపవచ్చు. ఒకళ్లను గూర్చి చెబితే చాలమందిని గూర్చి చెప్పినట్లుగా అయినప్పుడు ఆ చెప్పబడిన పాత్ర పాత్రీకరణ, ఆ వ్రాసిన వ్యక్తి పాత్ర రచయిత.

న్యాయవాదులు అందరికి తుల్యమయిన గుణాలు చాలా వుండవచ్చు. తుల్యగుణ క్రోడీకరణచేసి పాత్రీకరణ చేయవచ్చు పాత్ర రచయిత, అలాగే వైద్యులు, రచయితలు, రచయిత్రులు, పంతుళ్లు, విద్యార్థులు. The conception of charactery as an art ఇంగ్లండులో ప్రాచీన మయిందే అంటాడు హ్యూ వాకర్ (Hugh walker) అందుచేత పాత్రరచన సామాజికంగా సజీవమయింది. 'The conception of character is analytical and intuitive' అంటాడు హ్యూ వాకర్. 'Character books, which again popularised a type whose antecedents can be found as far back as Theophraotus in 300 B.C. Here a generalised type such as wife, a lawyer, a parliamentarian was analysed and dissected' అంటుంది Collier's Encyclopaedia Vol. 7.

జోసఫ్ హాల్ (1574-1658) Hypocrite ను గూర్చి చేసిన పాత్రీకరణ ఉదాహరణగా చూడవచ్చు. '..The stranger's saint, the neighbour's disease, the blot of goodness, a rotten stick in a dark night, a poppy in a corn-feild, an il-temepered candle with a great snuff, that in going out smells ill.'

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు పాత్ర రచయిత అనటానికి సృష్టింప బడిన పాత్రలే కారణం! ఆ సూచన 'పాత్రలు కావలెను'తో దృఢమవు తుంది. రచయిత్రి ఒక పాత్రీకరణ. అటువంటి పాత్రలు లోకంలో కోకొల్లలు! 'అమ్మమ్మ కథ'లో అమ్మమ్మ మంచి పాత్రీకరణ. కనకయ్య, పార్వతీశం ఏమీ తీసిపోరు. కాంతం తల్లి అచ్చంగా పాత్రీకరణ. సావిత్రి, గిరి, రాజా పాత్రలే! ఇటువంటివే సంపుటిలోని పాత్రలన్నీ. అందుకే ఈ రచయిత చక్కని పాత్ర రచయిత అనిపిస్తుంది.

సాధారణంగా ఉత్తమ రచయితకు ఒక లక్ష్యం — ఆ లక్ష్యం కేంద్రమై, ఆ కేంద్రం చేరుకోవటానికి పాత్రలు వాహిక (medium) లై, సన్నివేశాలు ఏర్పడి, కథగా సాగుతుంది.

ఈ రచయితకు పాత్రలు ఏర్పడి, పాత్ర చరించే పరిధి కథగా అయి, తదనుగుణ సన్నివేశాలు ఏర్పడి లక్ష్యంవైపు పాత్రతో కథతో రచన సాగు తుంది. ఈ రచయితకు కథకంటే ముందు పాత్ర ఏర్పడుతుంది. సమాజానికి నకళ్లయిన ఆ పాత్రల జీవితం సాధించే, లేక సాధించలేకపోయే లక్ష్యం, లేక లక్ష్యరాహిత్యం రచనకు కేంద్రమవుతుంది.

పాత్ర రచయితలు పాత్ర గుణంచెప్పి విడిచిపెడతారు. ఆ గుణం సన్నివేశం మూలంగా తెలియజేసే పద్ధతి శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ప్రత్యేకత. అందువల్ల ఈ విధమయిన రచన నవనవోన్మేషశాలిత్వం కలదే అవుతుంది.

ఒక పాత్రకు భిన్న లక్షణాలు ఉంటాయి. కథానిక ఒక పాత్రకున్న ఒక లక్షణమే ప్రధానంగా తక్కినవి అప్రధానంగా సాగుతుంది. కథా నికలో పాత్ర విరాట్ స్వరూప ప్రదర్శనకు అవకాశం అంతగా వుండక పోవచ్చు. ఈ రచయిత పాత్రీకరణలో ఆ అవకాశం వుంటుంది. ఈ సంపుటిలో రచనలు పాత్రీకరణలు వెంటతెచ్చుకున్న కథలుగా సంపూర్ణ కావ్యానందం కలిగిస్తాయి. కథలుగా మాత్రంకాదు.

ఈ రచయితకు కథ ప్రధానం కాదు. పాత్రలు! పాత్రలు అను సంధించటంకోసం కథ పుట్టుకు వస్తుంది. పాత్రల బలంవల్ల బలంలేని కథాంశం కూడా బరువు పెరగవచ్చు. అందువల్ల ఎవరయినా ఈ కథలు ఉత్తమమయినవని అనుకొంటే అనుకోనువచ్చు.

శ్రీ కొడవటిగంటి కుటుంబరావు కథారచయితగా ఉత్తములయిన చాలా మందిలో ఒక రచయిత. బహ్వాల్పసంఖ్యగల పాత్ర రచయితలలో ఉత్తమ శ్రేణి రచయిత!

(భారతి '69)

# బుచ్చిబాబు—కథానికలు



ఆధునికాంధ్ర సాహిత్యవచన ప్రక్రియలలో కథానిక విశిష్ట లక్షణ విలసితం. గుణంలో తెనుగుకథానిక ప్రపంచ స్థాయి పొందింది. తెనుగు కథాదీప్తి తేజరిల్లేటట్లుచేసిన కొద్దిమంది ప్రముఖ రచయితలలో బుచ్చిబాబు స్థానమూ, నిర్వహించిన పాత్రా, చారిత్రక ఘట్టాలు.

బుచ్చిబాబు కథా సాహిత్యంలో అంతస్సూత్రం స్త్రీ పురుష సంబంధం. ప్రపంచంలోజరిగే ప్రతిసత్సంగతికీ, దద్భిన్నమయిందానికీ మూలహేతువు ఆ స్త్రీ పురుషసంబంధమేననీ, జీవితం విలువ, సమాజ చైతన్యాధిక్యం, మానవౌన్నత్యం ఆ సంబంధంనుంచి ఆవిర్భవిస్తాయని రచయిత నమ్మకం, విశ్వాసం. ఇదే ఈ కథల్లో కనిపించేతత్వం. అందుకే యౌవనం బరువుతో, వాంఛా తీవ్రతతో సాగుతాయి కథలు.

స్త్రీ పాత్ర సృష్టిలో స్త్రీత్వంగూర్చిన ఆలోచనలో రచయిత తాత్త్విక పరిధిలోకిపోయి, అనూహ్యాదశలో ప్రాచీనార్షశక్తి ఆంతరదీప్తి చూపాలని విలవిల లాడిపోయాడు. సృష్టి ఆరంభంనుంచి నిర్విరామంగా సాగుతున్న— స్త్రీ అనంతత్త్వపు తుదిమొదళ్ల ముడివిప్పే ప్రయత్నంలో నిరంతరం అన్వేషించిన జిగీషువు రచయిత. స్త్రీత్వాధిక్యం గుర్తించటంవల్లనే స్త్రీ పాత్రల సృష్టి విశిష్టంగా రూపొందింది.

బుచ్చిబాబు కథలలో పురుషపాత్రలు సహజంగా అసమర్థులే అల్పజీవులే కాని, స్త్రీ సాహచర్యంతో సాన్నిహిత్యంలో సమర్థులు, అధికజీవులు. అయితే పూర్ణగౌరవంతో స్త్రీకి విధేయులుగావుండే, లేకపోతే విపరీత ద్వేషంతో కసిగా వర్తించే పురుషపాత్రలు స్త్రీ అర్థంకానితనపు నాణెం బొమ్మాబొరుసులు.

బుచ్చిబాబు కథా సృష్టిలో స్త్రీ అయస్కాంతం, పురుషుడు ఆకర్షితుడై కూడా వ్యక్తిత్వం నిలుపుకొంటూ నిర్ణీతవలయంలో సంచరించే ఇనుముక్క— కట్టు గొయ్యచుట్టూ తిరిగే పోట్లగిత్త. విధేయంగా అవిధేయంగా సాగే గానుగెద్దు!

మనిషి మనస్సు విచిత్రతకు జన్మస్థానం. ఏ మనిషి మనస్సులో ఏ వాతావరణం ఏ పరిణామంతో వూగుతుందో చూసే మనస్తత్వవేత్త బుచ్చిబాబు. అందుకే ఈ కథలు మానవమనస్తత్వంలోని అవ్యవస్థకు అందమయిన చిత్రీకరణలు. ఇవి, జీవితంపట్ల మేధావి దృక్పథం ప్రదర్శిస్తాయి. ఈ కథలు సమాజం, సంస్కృతి నాగరికతల ప్రతిధ్వనులు ఆదర్శం ఆచరణల యుద్ధక్షేత్రం మానవహృదయం. అది భవిష్య జ్ఞాతిజీవిత సాహిత్యం పుట్టేచోటు.

బుచ్చిబాబు కథలలో వస్తువైవిధ్యంతోపాటు, పాత్రవైవిధ్యముంది. ప్రతిభావంతుడైన ఈ రచయిత చిత్రించిన పాత్రలు సమాజపు అట్టడుగు పొరలోని బిచ్చగాళ్ల దగ్గర్నుంచి, సంఘంలోని అత్యున్నత శిఖరంమీది మేధావులవరకు ఎన్నో భిన్నంగా వున్నాయి.

మనిషిపట్ల, సమాజంపట్ల, స్త్రీ పురుష సంబంధంపట్ల గౌరవం ఉన్న రచయిత, ఈ కథలో మానవుడి బలహీనతలను క్షమాదృష్టితో చూడ గలిగాడు. కాని, మూర్ఖతను క్షమించలేకపోయాడు. సర్వమూర్ఖతమీద చెర్నాకోల దెబ్బలు కొన్నికథలు. బుచ్చిబాబు సాధారణంగా వాస్తవ సంఘటననుగాని, ఏ రచయిత గ్రంథస్థ భావంకాని స్వీకరించి కథగా రూపొందిస్తాడు. సమాజం లోతులు పరిశీలించే సామర్థ్యం, వ్యక్తుల హృదయసున్నిత భావవ్యక్తీకరణ నైపుణ్యం ఉన్న రచయిత, పాత్ర, ప్రదేశ, వాతావరణ వర్ణనలలో ప్రదర్శించిన వాస్తవికదృష్టి, సన్నివేశంలో నాటకీయంగా కల్పనగా మారిపోగా, వస్తువు అలౌకిక స్థాయి చేరుకొని, అతిలోకానుభూతి కలిగించి, అతీంద్రియస్థితి నాపాదించి, జీవితపు అనూహ్య ప్రాచీన తేజస్సు ఎదుట నూత్నదృష్టినిస్తుంది.

కథలో జీవితం ప్రదర్శించాలి, చెప్పకూడదని, బుచ్చిబాబు అనుకోలేదు అందుకే ఈ కథలో అధికంగా జీవితం కనిపించదు. వినిపిస్తుంది. కథల్లో అర్థబోధకోసం రచయిత ఉపన్యసిస్తాడు. అందువల్ల కథకంటే ఆలోచన ఎక్కువగా కనబడుతుంది. హృదయంకంటే బుద్ధి విస్తరిస్తుంది. ఈ రచయిత కథల్లో నిక్షిప్తసత్యం వాస్తవజగత్తులో ఎదురైనప్పుడు కథాత్మ బలంవల్ల వాస్తవ సంఘటన బలవత్తరమవుతుంది.

శిల్పవిషయంలో బుచ్చిబాబు కథలు శిఖరప్రాయాలని ఎవరూ భావించరు. తుదిమొదల్లో తీరు నిర్ణయించుకొని ఉపసంహారాభిముఖంగా, ఆసక్తి జనకంగా రచన చేశాడు బుచ్చిబాబు. ఒక్కొక్కసారి, కథ ముగిం

చటంలో శిల్ప సిద్ధంలేదు. తను ఉత్తమ పురుషలో కథ వ్రాయటం మాం ప్రభావం అన్నాడు రచయిత. పాఠకులు చలం ప్రభావం అనుకొంటారు.

స్పష్టత, క్లుప్తత, శైలి ప్రధానాంగాలు. బుచ్చిబాబు భాషలో, రచనలో ఆలోచనలో స్పష్టత ఉందికానీ, పాత్రల ప్రవర్తనలోలేదు. ఈ అస్పష్టత ప్రాక్తన మానవ సంకల్ప రాహిత్య ప్రదర్శకమయింది. కథల్లో క్లుప్తత వెదుకవలసిందే! రచన అడ్డమాకలులేని నిరంతర ప్రవంతి. ఒక నిర్వచనం, భావం, జీవితకోణం చూపి, వాటిని బలపరచటానికి ఉదాహరణ వాక్యాలు అనేకం వ్రాశాడు.

వర్ణనలో రచయిత బహుసమర్థుడు. ఒక్కమాటలో ఒక చక్కనిరూపం చూపాడు. ఒక విస్తృత వర్ణనతో ఒక విశాలపరిధి చూపాడు. పదాలతో బొమ్మలు, వాక్యాలతో దృశ్యాలు, వాక్యసముదాయంతో విస్తృత జీవితం బాహిరంగా ప్రదర్శించిన కథా చిత్రకారుడు బుచ్చిబాబు!

బహ్వల్పంగా హాస్యం, మరి కొంచెం పరిహాసం, కథల్లో కనిపించినా, బుచ్చిబాబు ప్రధానంగా నవ్వుకు తొణకనిమనిషి. జీవిత సంబంధాల బరువు, మానవుడి వ్యక్తిత్వపు అల్పత, సృష్టి విలాస వైచిత్రి, గుండెలునింపుతున్న యుగయుగాల ఊపిరి, నిరంతరంగా ఆకాశంలోకంటే గతమానవ తేజస్సు చూసే రచయితది తీవ్రదృష్టి!

చైతన్య స్రవంతి రచనావిధానం తెలుగులో ప్రవేశపెట్టిన ఆద్యులలో, ఆంగ్లవిద్యా ప్రభావంతో ఆంధ్రసారస్వతం అభివృద్ధి చేసినవాళ్లలో బుచ్చిబాబును తెల్పవచ్చు. ఆంధ్రవచనం వయస్సుతక్కువ. ఆధునిక వచనాభ్యుదయం సాధించిన రచయిత వచనం కొన్ని తావుల్లో కవిత్వ మయింది. వేరుగా కవిత్వం వ్రాయనక్కరలేదీ గద్యకవి.

సోమర్‌సెట్ మాం డైరీ ఆధారంగా రెండుకథలు, రసెల్ రచనాంతర్గత సూచనలు ఆధారంగా రెండుకథలు వ్రాశాడు, బుచ్చిబాబు. స్త్రీ పురుష సంబంధ విషయంలో రసెల్, కథాశిల్పంలో మాం, తాత్త్విక దృక్పథంలో సర్వేపల్లి రాధాకృష్ణ, జీవితదర్శనాసక్తిలో ఆల్డస్‌హక్స్‌లీ, ఉపన్యాస రచనా ధోరణిలో షా, ప్రభావమేకాక, మానవ శృంగార జీవిత సంబంధ సమాలోచనంలో ఫ్రాయిడ్, వాక్యరచనా విధానంలో తత్త్వబద్ధమైన నిజాయితీ ఉన్న చలం ప్రభావంకూడా బుచ్చిబాబు కథల్లో కనిపిస్తుంది. నిత్యజీవిత సంఘటన కథాసంఘటన కన్నభిన్నంగా ఉండాలనీ, ఆదర్శాల

కోసం కథ వ్రాస్తే మంచికథ రాదనీ, జీవిత సంఘటనలు, కథా సంఘట నలుగా స్వీకరించకపోవటం మంచిదనీ, కల్పన లేకుండా మంచికథ వ్రాయ వచ్చు కానీ, అది గొప్పకథ కాకపోవచ్చుననీ, అస్పష్టత సాహిత్యంలో అవసరమేననీ, రచయితకు సమాజ పరిశీలన సామర్థ్యం, నిజాయితీతో పాటు జీవితంపట్ల గౌరవం ఉండాలనీ, రచయిత తెలిసిన జీవితమే చిత్రిం చాలనీ, ప్రముఖ కథా రచయిత బుచ్చిబాబు ఆంగ్లాంధ్రాధ్యయనానంతరం పలికిన పలుకులు!

ఆంధ్ర సాహిత్యంలో విశిష్టస్థాన విలసితాలయిన కథానికల రచయిత బుచ్చిబాబు, కోమలమనస్వి, ఉద్ధత రచయిత; మితభాషి; అమిత రచనాజీవి; అంతరమథనం పొందినవ్యక్తి, బాహిరసుధా సాహిత్యస్రష్ట; జీవితం నిత్యక్రించినమనీషి, కల్పనాసాహిత్య వచస్వి; బుచ్చిబాబు ఆంధ్రత్వపు కన్నీటిబిందువు, తెలుగువాడి బంధువు.

(ఆకాశవాణి '70)

## తెలుగు అర్జీలు — ఆంగ్లపదాలు

ఆంధ్రదేశాన్ని మహమ్మదీయుల తర్వాత ఆంగ్లేయులు పరిపాలించటంవల్ల తెలుగుభాషలో పార్శీ అరబ్బీ హిందుస్థానీ పదాలతోపాటు ఆంగ్లపదాలూ చోటు చేసుకొన్నాయి. 'The long continued dominion of the Musulmans introduced many foreign words into the various Hindu languages. Thus the modern Telugu contains a variety of persian and Arabic expressions. In later years, some English words have crept into use' (మిశ్రభాషా నిఘంటువు —సి. పి. బ్రౌన్. Preface.)

తెలుగు భాషలోచేరిన అన్యభాషా పదజాలంగూర్చి జరుగుతున్న పరిశోధనలనుబట్టి తత్ప్రాధాన్యం తెలుస్తుంది. డా. కొత్తపల్లి వీరభద్రరావు 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' పరిశోధన వ్యాసంలో, ఆంగ్ల ప్రభావ ప్రాథమికదశలో తెలుగుభాషలోకి చేరిన ఆంగ్ల పదాలగూర్చి చెప్పే ప్రయత్నం కనిపిస్తుంది. భావ ప్రభావంకంటే భాషా ప్రభావం ముందుగా ప్రభావిత భాషలో గోచరిస్తుంది. ఈ పరిశోధన వ్యాసం ప్రచురితమయింది. ఇది పదజాలంగూర్చి చేసిన పరిశోధనకాదు గనుక సమగ్రంగాచేసే అవకాశంలేదు. సూచన ప్రాయంగా విడిచిపెట్టబడింది. డా. చక్రధరరావు చేసినట్లు చెప్పబడుతున్న తెలుగులో చేరిన పార్శీ అరబ్బీ పదాలగూర్చిన పరిశోధన క్రీ. శ. 1800 వరకు పరిమితమనీ, అముద్రితమనీ తెలుస్తుంది. ఈ పరిశోధనల దృష్టితో తెలుగులో చేరిన అన్యభాషాపదాలగూర్చి ఆలోచన అవసరమే అనిపిస్తుంది.

'తెలుగు డాక్యుమెంట్స్' (Telugu Documents—Being petitions etc. in Telugu preserved in the oriental collections at the National Archives of Indi-) అర్జీల సంపుటి, ప్రొఫెసర్ జి. జె. సోమయాజి ఎం.ఎ., ఎల్.టి., విద్వాన్ సంపాదకత్వాన నేషనల్ ఆర్కైవ్స్ ఆఫ్ ఇండియా తరఫున ఆంధ్రా యూనివర్సిటీనుంచి 1957 లో ప్రచురింపబడింది.

ఈ సంపుటిలోని అర్జీలలో సగం క్రీ. శ. 1810 సంవత్సరంలో వ్రాయబడ్డాయి. మిగతాసగం 1834-1859 మధ్యకాలంలో వ్రాయబడ్డాయి. ఈ సంపుటి ఆధారంగా క్రీ. శ. 1810 ప్రాంతంలో వ్యావహారికాంధ్ర భాషారూపమూ, ఆంధ్ర భాషలోని పార్సీ, అరబ్బీ, హిందూస్థానీ, ఆంగ్ల పదాలు మొదలైన భాషా విషయాలూ; ప్రజలు—జమీందారులు—ప్రభుత్వం, మధ్యసంబంధం, పాలకుల పాలితుల మనస్తత్త్వం, మొదలైన సాంఘిక విషయాలూ తెలిపే అవకాశంవుంది.

డా. కొత్తపల్లి వీరభద్రరావు పరిశోధన వ్యాసంలో పోర్చుగీసువాళ్లు, డచ్చివాళ్లు, ఫ్రెంచివాళ్లు ఆంధ్రదేశంలోకి రావటం, తమభాషాపదాలు తేవటంచెప్పి, ఇంగ్లీషువాళ్లు కారణంగా తెలుగుభాష పొందిన పరిణామం వివరించేముందు, ఇంగ్లీషు భాషలోనుంచి తెలుగు భాషలోకి వచ్చిన పద జాలంగూర్చి చెప్పటం కనిపిస్తుంది. 'పద్మనాభయుద్ధం' రచించిన కవి చట్రాతి లక్ష్మీనరసకవి, రచనాకాలం 19-వ శతాబ్ది ప్రారంభం. 'గ్రంథము శ్రీ చినవిజయరామగజపతిగారి కుమారులైన శ్రీ నారాయణ గజపతిగారి కంకితముగ చెప్పబడుటచే గ్రంథము 19-వ శతాబ్ది ప్రారంభమున రచింప బడినదనుట సత్యము' (పే. 85. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము —డా. కొత్తపల్లి వీరభద్రరావు). ఈ కావ్యగతాంగ్ల పదాలు పై పరిశోధన వ్యాసంలో చూపింపబడ్డాయి.

19-వ శతాబ్ది ప్రారంభంలో వ్రాయబడ్డ ఈ సంపుటి అర్జీలలోని భాషలో ప్రయోగింపబడ్డ ఆంగ్లపదాలు, 'పద్మనాభ యుద్ధము'లో ప్రయుక్తాంగ్ల పదాలకంటే అధికం భిన్నం. అంతేకాక, ఒకపదంరూపం వివిధంగా వుండటమూ వైశిష్ట్యమే! ఆంధ్రభాషలో చేరిన అనేకాంగ్లపదాల ప్రాచీనత, రూపవైవిధ్యం, తెలుసుకోటానికి ఈ సంపుటి బాగా ఉపయోగపడుతుంది. పై సంపుటిలోని ఆంగ్లపదాల క్రోడీకరణమే ఈ వ్యాసం.

సాధారణంగా భాషా సంస్కారం ఉన్న (18-వ శతాబ్ది ఉత్తరార్థంలోని, 19-వ శతాబ్ది ప్రారంభంలోని) తెలుగు కవులు భాషలోని కొత్తగావచ్చే పదాలు (పార్సీ ఆంగ్లాది పదాలు) తప్పనిసరి అయితే తప్ప, స్వీకరించలేదు. సామాన్య ప్రజలు కొత్తగావచ్చిన వస్తున్న పదజాలం వీలయినంత, అవసర మయినంత త్వరగా గ్రహించారు. ప్రయోగించారు. ఆంధ్రభాషలో చేరిన ఆంగ్లపదాలు కవులు రచయితలకంటే సామాన్యజనం త్వరగా స్వీకరించారు. సాధారణంగా ఒక భాషలోకివచ్చే అన్యభాషా పదజాలం

కవులకంటే సామాన్యులు ముందుగా గ్రహించి ప్రయోగిస్తారు. కనుక, ఒక భాషలోకివచ్చిన అన్యభాషాపదాల పరిశీలనకు ఆ భాషలోని కావ్య భాషకంటే తదితరమైన సామాన్యజనజీవితంలోని వ్యావహారిక భాషా రచనలు ఎక్కువ ఉపయోగకరంగా ఉంటాయి. కనుక, తెలుగులోకి చేరిన ఆంగ్ల పదజాలంగూర్చి కూలంకషంగా తెలియటానికి దృశ్యశ్రవ్యకావ్యాలూ, తదితరకావ్యగౌరవం ఉన్న రచనలూ నిఘంటువులకంటే వ్యావహారికభాషలో వున్న మెకంజీ కైఫీయతులు, లోకల్ రికార్డులు, సి. పి. బ్రౌను లేఖలు, రచనలు, రికార్డులు, ఇంకా భిన్నమయిన లేఖలు, అర్జీలు, కోర్టురికార్డులు, దస్తావేజులు, దరఖాస్తులు మొదలైనవి అనేకం ఉపయోగకరంగా ఉండవచ్చు ననటానికి సందేహంలేదు.

ఈ సంపుటిలో ఉన్న అర్జీలపేర్లు వాటికాలం ఈ దిగువ ఇవ్వబడు తున్నాయి. ఈ శీర్షికలు అర్జీదారుల శీర్షికలుకావు. సంపాదక శీర్షికలు. ఒక పదం ప్రక్కనే ఇవ్వబడే సంఖ్యనుబట్టి, అర్జీ, దానికాలం గుర్తింపవచ్చు:

| | | |
|---|---|---|
| 1. | వరిగొండ రమణప్పగారి విల్లు | 23-2-1810. |
| 2. | ,, శేషయ్య బందరు కలక్టరునకు అర్జీ | 23-2-1810. |
| 3. | ,, రమణప్పగారి సనద్దు | 23-2-1810. |
| 4. | రమణప్ప జమీందారీ గ్రామాదులలో ఉండే కరణముకాపుల అర్జీ | 26-2-1810. |
| 5. | అల్లూరు నరసయ్య వకీలు అర్జీ విన్నపం | 1-3-1810. |
| 6. | వరిగొండ వెంకటరాయుడు అర్జీ | 12-3-1810. |
| 7. | ,, రమణప్ప జమీందారు మొఖాసా సన్నదు | 15-3-1810. |
| 8. | ,, శేషయ్య మేనేజరు అర్జీ విన్నపం | 18-3-1810. |
| 9. | బందరు జిల్లా కలక్టరు ఆఖీదత్ | 25-3-1810. |
| 10. | మచిలీపట్నం జిల్లా కలక్టరు ఆఖీదత్ | 25-3-1810. |
| 11. | మేనేజరు వరిగొండ శేషయ్యగారి అర్జీ | 12-4-1810. |
| 12. | జిల్లా బంట్రోతు రశీదు | 18-4-1810. |
| 13. | విస్సన్నపేట మేనేజర్లకు కలక్టరు పంపిన ఆఖీదత్ | 18-4-1810. |
| 14. | వరిగొండ వెంకటరావు అర్జీ | 25-5-1810. |
| 15. | ,, శీతయ్యగారికి రమణప్పగారి జాబు | 30-5-1810. |
| 16. | ,, వెంకటరావు గవర్నరు జనరల్‌కు వ్రాసిన హకీఖత్తు | 5-8-1810. |

17. పరిగొండ శీతయ్యగారికి రమణప్పగారి జాబు 1807.

18. బంగాళా గవర్నరుకు రామచంద్రప్ప జమీందారు అర్జీ 21-10-1834.

19. చిలుపూరి బసువారావు కరారునామా 1836.

20. కలకత్తా గవర్నర్ జనరల్ ఇన్ కౌన్సిలుకు పుత్తేడు సముద్రమ్మ అర్జీ 19-12-1848.

21. వుడ్ కాక్ దొరకు ఎవరో వ్రాసిన రశీదు 18-4-1850.

22. మాచిరాజు వెంకటరాయుడికి తహశీలుదారు ఆర్డరు 19-3-1852.

23. గవర్నరు ఇన్ కౌన్సిల్ కి మాచిరాజు వెంకటరాయుని అర్జీ 26-4-1852.

24. మాచిరాజు వెంకటరాయుడికి తిరుమలశెట్టి వ్రాసియిచ్చిన రశీదు 1-5-1852.

25. అర్జీలను గురించి నిబంధనలు

26. గవర్నర్ ఇన్ కౌన్సిలుకి మాచిరాజు వెంకటరాయుడు అర్జీ 4-5-1852.

27. బంగాళా గవర్నరుకు మాచిరాజు వెంకటనాయుడు వ్రాసిన అర్జీ 31-10-1854.

28. బంగాళా గవర్నరుకి శానంపూడి రామబ్రహ్మం అపీలు అర్జీ 1-4-1858.

29. గవర్నరు ఇన్ కౌన్సిలుకు బువ్వంతాలూకా ప్రజలు వ్రాసుకొన్న మహజరు 30-4-1859.

30. మచిలీపట్నం కమర్షియల్ ఆఫీసరునకు నేతగాండ్ర అర్జీ. (ప్రమోదూత ఆశ్వయుజ. శు 4 గురువారం)

31. నల్లూరు నన్నయ్య వ్రాసియిచ్చిన రశీదు

32. ఫారామనిషి అధికారి కిచ్చిన సంజాయిషీ

17, 21, 22, 31, 32 సంఖ్యగల అర్జీలలో ఆంగ్లపదాలు లేవు. ఈ సంపుటిలోని ఆంగ్లపదాలన్నీ నెలలు తెలిపే పదాలు, ప్రభుత్వపదాలు, న్యాయశాఖపదాలు, జిల్లా అధికారి సంబంధి పదాలు, సైన్యసంబంధిపదాలు, జమీందారీ పదాలు, నామవాచకపదాలు, క్రియాపదాలు, ఇతర పదాలు అని స్థూలంగా విభజింపబడ్డాయి. ఈ దిగువ పదాల ప్రక్కనే ఇవ్వబడే సంఖ్య అర్జీ సంఖ్య!

## 1. నెలలు తెలిపే పదాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | జ్నవరి | 23 | | యేప్రియలు | 12 |
| | జనేవరి | 28 | | యేప్రియల్ | 12 |
| 2. | పిబిరెవరు | 6 | 5. | మెయి | 13 |
| | పిబెరెవరు | 2 | | మే | 26 |
| | పిబరెవరు | 2 | 6. | జూన్ | 18 |
| | ఫిబరెవరి | 1 | 7. | శపిటంబరు | 28 |
| | ఫిబ్రవరి | 3 | | శపటంబరు | 27 |
| 3. | మార్చి | 2 | 8. | అకుటోబరు | 28 |
| 4. | యేప్రేలు | 13 | | అక్టోబరు | 18 |
| | యేప్రిలు | 12 | 9. | నవంబరు | 20 |
| | యేప్రిల్ | 29 | 10. | డిసెంబరు | 20 |

## 2. ప్రభుత్వ పదాలు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | కుంఫిణి | 3 | 5. | లారడు | 18 |
| | కుంఫిణీ | 7 | | లార్డు | 16 |
| | కుంపినీ | 30 | 6. | కవున్సిల్ | 14 |
| | కంపెనీ | 30 | | కౌనుశిల్ | 26 |
| 2. | గవునరుమెంటు | 20 | 7. | శెంటు | 26 |
| | గానరుమెంటు | 1 | | సెంటు | 23 |
| | గవరన్మెంటు | 25 | | (St. Saint. St. George Fort) | |
| | గారన్మెంటు | 27 | 8. | పోరటు | 26 |
| | గార్న మెంటు | 27 | | ఫోర్టు | 23 |
| | గావర్ను మెంటు | 3 | 9. | యూరోపియన్ | 29 |
| | గార్నరుమెంటు | 28 | | (ఆఫీసరు) | |
| 3. | గానరు జనరలు | 14 | 10. | యింగ్గిలీషు | 12 |
| | గవనరు జనరల్ | 16 | | యింగిలీషు | 12 |
| 4. | గవునరు | 20 | 11. | హానరబుల్ | |
| | గానరు | 18 | | (గానరుమెంటు) | 1 |
| | గానర్ | 23 | | (గిల్బర్టు) | 16 |

12. మెస్తరు 12
మేస్తరు 12
(Mister: మెస్తరు త్యాజితెటు
దొరగారు
మేస్తరు వుడుకాకు
దొరగారు)

13. యిస్కా్వయరు 2
యస్కు్వయరు 6
యస్కా్వయరు 8

(Esq—Esquire; a squire or shield—bearer, one of the two attendants on a knight; now a courtesy title—Dr. Samuel Johnson's Dictionary of English Language.)

## 3. న్యాయశాఖ పదాలు

1. కోరటు 18
కోర్టు 2

2. ప్రవిన్శయల్ 18
(కోరటు)
ప్రవిన్శయాల్ 18
(Provincial)

3. మేజస్త్రేటు 1
మెజశ్త్రీటు 2
మేజస్త్రేటు 2
మేజస్త్రీటు 6
మేజస్త్రీటు 7
మేజశ్త్రీటు 11
మెజస్త్రీటు 13
మెజిస్త్రీటు 19
మేజస్త్రీటు 20

4. రిగ్యులేశను 1
రిగ్యులేసను 28
రిగ్యులేశను 6
రిగ్లులేశను 2
రిగ్యులేషను 13
రెగ్యులేషన్ 27

5. శిక్సను 1
(Section)

6. డ్రాజు 2

7. శివిల్ 14
సీవిల్ 25

8. క్రిమినాల్ 25
(Criminal)

9. పిటిశన్ 28
పిటీషన్ 20

10. అప్పీలు 28

11. కోర్టాపు వారడసు 2
కోర్టాఫ్ వారడసు 14
కోర్టాఫ్ వార్డసు 2
కోర్టాఫ్ వారడు 14
(Court of wards)

## 4. జిల్లా అధికారి సంబంధి పదాలు

| | | |
|---|---|---|
| 1.a | కలకటరు | 5 |
| | కలఖటరు | 19 |
| | కల్కుటరు | 1 |
| | కలక్టరు | 7 |
| | కలకట్రు | 18 |
| | కలకట్రు | 18 |
| b | సబు కలకటరు | 26 |
| | సబు కల్కుటరు | 23 |
| c | హెడ్డు కల్కుటర్లు | 27 |
| d | హెడ్డు అశిష్టాంటు కలక్టరు | 28 |
| 2. | రివిన్యూ | 6 |
| 3. | బోరడు | 18 |
| | బోర్డు | 6 |
| 4. | డివిజన్ | 29 |
| | (సబు డివిజన్) | |
| 5. | ఆరుడరు | 20 |
| | ఆర్డరు | 11 |
| 6. | ఆడిడి | 20 |
| | (Audit) | |
| 7. | డిపార్టిమెంటు | 20 |
| | (ఆడిడి డిపార్టిమెంటు) | |
| 8. | కమ్మిసనరు | 27 |
| | కమిషనరు | 27 |
| 9. | కమిశెరి జ్నరల్ | 20 |
| | (Commissary General) | |
| 10. | కమ్మెరుశెయలు | 30 |
| | (Commercial) | |

## 5. సైన్యసంబంధి పదాలు

| | | |
|---|---|---|
| 1. | కమాండరు | 16 |
| 2. | ...కమిండింగు... | 3 |
| | కమాండింగు (ఆఫీసరు) | 16 |
| 3. | కర్టల్ | 18 |

(Colonel. (Ker'nel. n) [Formerly also coronel which is an old French form, and has given the modern pronounciation: ........the name was originally given to the leading company in a regiment] The chief Commander of regiment of troops, whether infantry or cavalry—The Concise English Dictionary.)

| | | |
|---|---|---|
| 4. | రిజిమెంట్ | 29 |
| | (Regiment) | |
| 5. | గేరిజన్ | 29 |
| | గ్యారీజన్ | 29 |
| | గ్యారిజన్ | 29 |
| | (Garrison) | |
| 6. | పోలీసు | 27 |
| 7. | ఆడదలీ (ల) | 8 |
| | ఆషుదలీ (ల) | 8 |
| | ఆరడీల్వ (ల) | 2 |
| | ఆరడలీ (ల) | 2 |
| | ఆరడలీ (ల) | 16 |

(Orderly : A private soldier or non - Commissioned officer who attends on a superior officer to carry orders or messages–The Concise English Dictionary.)

## 6. జమీందారి పదాలు

1. యిస్టేటు 2
యస్టేటు 16
2. మేనేజరు 2
3. మేనేజరి (?) 4
(జమీందారు—జమీందారి
మేనేజరు—మేనేజరి!)
4. మయినరు 14
మైనరు 2
5. రిబోర్టు 18
రిపోర్టు 2
6. గారెడనసు 3
గారిడ్యాన్ 5
గ్యారిడెనుస్సు 7
గ్యారిడ్యాన్ 11
గార్డియను 16

## 7. నామవాచక పదాలు

1. డాక్తరు 1
2. ఆఫీసరు 16
3. శెకటరీ 28
4. ఫరంగి 31
(పరంగి N. S. Farangi, plu. పరంగులు or పరంగీలు Europeans జాతివాండ్లు— మిశ్రభాషా నిఘంటువు— సి. పి. బ్రౌన్.)
5. రయిటరు 20
రైటరు 20
6. డిమాండు 23
డిమెండు 23
డిమ్యాండు 27
7. రిజెష్టరు 28
రిజిష్టరు 23
8. రెశైడెంటు 30
రెసైడెంట్ 30
9. నంబ్బరు 23
10. రశీదు 5
(రశీదు (Receipt): A corruption for Receipt or the Persian 'Rasida'= చెల్లుచీటీ — మిశ్ర భాషా నిఘంటువు—సి. పి. బ్రౌన్)
11. కార్డినాల్ 18
12. చార్జి 11
13. యిన్క్లోజర్ల 14
యినుక్లోజరసు 14
(Enclosures)
14. ఆనసరు 14
15. క్యారక్టు 14
(Character)
16. డైరీ 14
17. వుల్ 11
వుయిల్ 4
ఫుయిల్ 2
ఫుయులీ 3
విల్ 1
(వకారానికి పకారం ముద్రా రాక్షసం కావచ్చు)

## 8. క్రియా పదాలు

1. యిండ్డారచు 19
   యిండ్డెరసు 19
   యిండ్డారసు 29
   యిడ్యారసు 20
   యిండార్సు 28
   యిండారసు 26
   యండారసు 23
2. రిఫరు 20
3. ఆకుటింగు (గానరు) 18
4. వోపిన (open) 14
   (... మళ్లీ కోర్టులు వోపిన చేసే యీలోగా కల్కటరుగారు...)
5. స్టాప్ 14
   స్టాపు 14
6. అడజరన్ 14
   (Adjourn కోర్టు అడజరన్)

## 9. ఇతర పదాలు

1. చిఫు 20
   (Chief: చిఫు మెజిస్ట్రీటు)
2. హెడ్డు 27
   (Head: హెడ్డు కల్కటర్లు)
3. అశిస్టాంటు 28
   (Assistant: హెడ్డు అశిస్టాంటు కల్కటరు)
4. చానల 14
   (Channel: జిల్లాకోర్టు చానలద్వారా)
5. ఆఫు 10
   ఆఫ్ 13
   ఆప్ (of) 16
6. ది (the) 10
7. అండ్ 13
   (శేషయ్య అండ్ పెమ్మరాజు రంగయ్య)
8. యిన్ 14
   ఇన్ 16
9. టు (to) 23
10. సబు 23
    (సబుకల్కటరు)
11. మిసు 14
    (మిసు రిపోర్టు)
12. లేటు 2
    (లేటు వరిగొండ రమణప్పా జమీందారుగారు.)
13. రైటు 14
    (మహారాజశ్రీ రైటుహానరబుల్ గిల్బరటు)

ప్యార్టావు (13) part of అనీ, వోనావుదీ (10) one of the అనీ, (ఆకీదతు ఆసారు వరిగొండ శేషయ్యా వోనావుదీ మేనేజరు ఆఫు ది యిస్టేటు లేటు వరిగొండ రమణప్పా జమీందారుగారు) భావించే అవకాశం వుంది.

ఆంగ్లభాష బాగా రానివాళ్లు, ఆంధ్ర భాష బాగా రానివాళ్లకు తమ సంగతులు చెప్పుకోవలసి వచ్చినప్పుడు తేలికయిన వ్యావహారికం లో, వీలయినంతవరకు ఆంగ్లేయులకు అర్థమయ్యేపదాలు ప్రయోగిస్తూ వ్రాసిన కారణంగా ఆంగ్ల పదజాలం అర్జీలలో విరివిగా దొర్లింది.

డైకే, లేటు, రైటు, చార్జి మొదలైన బహ్వల్ప పదాలుతప్ప ఈ రోజుల్లో ఆంగ్లపదాలకు వాడుకలో ఉన్న తెలుగురూపాలు క్రీ. శ. 1810 ప్రాంతంలో లేవు. భిన్నంగా ఉన్నాయి.

ఒక ఆంగ్లపదం భిన్నమైన తెలుగురూపాలలో ప్రయోగింపబడటంవల్ల, ఆదశ, ఆంగ్లపదం ఒకే ఆంధ్రపదంగా తెనుగురూపం స్థిరంచేసుకొంటున్న పరిణామదశగా భావింపబడుతుంది. ఒక ఆంగ్లపదం పొందిన అనేకాంధ్ర రూపాలలో పూర్వాపరాల పరిశీలన—ఆ రూపాలు ప్రయోగించిన వ్యక్తుల భాషా సంస్కారంమీద ఆధారపడివుంటుంది గనుక—పూర్తిగాచేసే అవకాశం తక్కువ.

ఒక భిన్నభాషాపదం తెలుగుభాషలో చేరేటప్పుడు సాధారణంగా తెలుగు భాషా వ్యక్తిత్వం జోడించుకొని వస్తుంది. ఒక ఆంగ్లపదం భిన్నాంధ్ర రూపాలుపొందితే, అవి అన్నీ ఏదో విధమయిన ఆంధ్ర వ్యక్తిత్వం ఉన్న రూపాలే అయితే, అందులో ఏదో ఒకటి, అధికంగా ఆంధ్రభాషా సంప్రదాయముద్రితం అవుతుంది. ఒక ఆంగ్ల పదానికి ఇప్పుడు వాడుకలో ఉన్న తెలుగు రూపమూ, పూర్వ భిన్నరూపాలూ పరిశీలించి, ఈ రూపం అధికాంధ్ర భాషా సంప్రదాయ ముద్రితం అవునా కాదా అని పరిశీలింపవచ్చు.

భిన్నభాషాపదాలు పొందిన భిన్నాంధ్ర పదరూపాలవల్ల ఆంధ్రభాషా నాగరికత తెలుస్తుంది. భాషా వ్యక్తిత్వ లక్షణాలు తెలుస్తాయి. అందుచేత అనేకేతర భాషాపదజాల పరిశీలనవల్ల గతాగతాల ఆంధ్రభాష స్పష్టమవుతుంది.

(భారతి '70)

# వ్యావహారిక భాష—గిడుగు రామమూర్తి

ఆధునికాంధ్ర వాగనుశాసనుడయిన గిడుగు రామమూర్తి పేరు అక్షరాస్యులైన తెలుగువాళ్లలో విననివాళ్లుండరు. ప్రవాహశీలమైన భాష ప్రాణశక్తి గమనించి, చిరంజీవి అయిన భాష జీవనాడి పరిశీలించిన ఆయన భాషా వైద్యుడు. జీవద్వస్తు ధర్మమైన పరిణామగుణం, చైతన్య లక్షణం నిశితంగా దర్శించిన దీక్షపరుడు, ఆయన. తన భాషా విషయిక పరిశోధన ఫలితం వ్యాసాలవల్ల ఉపన్యాసాలవల్ల పత్రికలలో వేదికలమీద ఆంధ్రదేశం నలుమూలల్లో తెలుపుతూ, ఆయన చూపిన సత్యదృష్టి, ధర్మదీక్ష, విషయ నిష్ఠిత విమర్శ, నిశ్చల పాండిత్యం, నిర్భీతి, వాక్చాతుర్యం, ఏకాగ్రత నిరంతర సునిశిత పరిశీలన, వాదపటిమ, ధర్మ పక్షపాతాలువల్ల గిడుగు పిడుగుగా భావింపబడటమూ, నాటినుంచి నేటిదాకా ఆ ధ్వని ఆంధ్రదేశంలో మార్మోగటమూ, బహుజనవిదితమే!

గిడుగు రామమూర్తి జీవితాంతం చేసిన కృషి సారాంశం స్థూలంగా 'నోటిమాటకూ చేతిరాతకూ' సంబంధం వుండాలని. మాతృభాష ఎలా మాట్లాడబడుతుందో, అలా రాయబడాలి. ఆ లక్షణం అది కోల్పోతే ఆ భాషావ్యవస్థ పునాది కుళ్లిపోయిందని అర్థం. సంస్కృతం పదార్థ దృష్టితో సంస్కృతం. అదెంత సంస్కృతమయినా దాన్నిప్పుడు మాతృభాషగా చెప్పగలిగేవాళ్లు బహ్వల్పం. ఆ భాష, వ్యవహారానికి విరుద్ధంగా దూరంగా జరిగిపోయేంత అధికంగా సంస్కరింపబడింది. అందువల్లనే అది మృత భాషగా భావింపబడింది. అది వ్యవహారానికి దూరమయి పోయినకొద్దీ. వ్యవహారానుకూల్యం పొందుతూ షడ్విధ ప్రాకృతాలు ప్రపంచితాలయ్యాయి. ఇటువంటి ఉదాహరణాలు విశ్వభాషలలో అనేకాలు. వాటిని చూచి అయినా తెలుగు వ్యవహారానికి దూరంకాకుండా, మృతభాషకాకుండా చూచుకోవటం అవసరం. ఈ హెచ్చరికను ఆంధ్రభాషా మృతలక్షణాలనూ చూపి కాపాడిన తెలుగుబిడ్డ గిడుగు.

భాష ఒక కాలంలో ఉన్నట్లుగా తరువాత కాలంలో వుండదు. మార్పు పొంది వుంటుంది. ఇది భాషా ధర్మం. ప్రాథమిక ధర్మం. భాషలో మార్పు రాకపోతే, పరిణామం కనబడకపోతే, భాష మారకపోతే అది అనారోగ్య లక్షణం. భాషకు జబ్బు చేసిందని అర్థం. పుట్టినబిడ్డ పుట్టినట్లే ఉంటే తల్లడిల్లే తల్లిదండ్రులలాగా శతాబ్దాలయినా చలనంలేకుండా భాష వుంటే జాతి కుమిలి పోతుంది. వ్యాకరణాలు ఎప్పుడూ భాషను వివరించాలికాని నిర్ణయించ కూడదు. చలికి కప్పుకోవటానికి ఒక దుప్పటి ఇవ్వాలి. చిన్ని ఉన్ని చొక్కా ఇస్తే అది భాషావ్యక్తి పెరిగింతర్వాత కురచ అయిపోతుంది. పొట్టి దవుతుంది. చాలదు. దుప్పటి అయితే భాషావ్యక్తి ఏ దశలో ఉన్నప్పు డయినా ఉపయోగకరంగా ఉంటుంది. నన్నయ దగ్గర్నుంచి, చిన్నయసూరి దాకా చాలామంది వ్యాకర్తలు భాషకు వ్యాకరణపు చొక్కాలు కుట్టటానికి పాణిని చూచి ప్రారంభించారు. పాణిని వ్యాకరణంలో ఇమడక సంస్కృతం చూచుకొన్న భిన్న మార్గాలు పరికించి అయినా మన వ్యాకరణ విధానం వివరణాత్మకంగా రూపొంది వుండవలసింది. అలా జరక్కపోయి, చిన్నయ సూరి సూత్రానికి అనుకూలంగా లేని పదం తప్పు అనుకోవటం ప్రారంభ మయి, కృత్రిమ భాషా సృజనానికి త్రోవ ఏర్పడింది. నన్నయ భాషకు నేటి భాషకు భిన్నత్వం వుండటం సహజమే! ఆనాటి వ్యాకరణం ఈనాటి భాషకు సరిపడకపోవటమూ సహజమే! చిన్నయసూరి వ్యాకరణం నిన్నటి భాషకు సరిపోవచ్చు. రేపటి భాషకు చాలదు. భాషపొందే పరిణామాన్ని పరిపూర్ణంగా అర్థం చేసుకొని, స్వీకరించటానికి మేధావులు ప్రయత్నం చేస్తారు. మార్పును అంగీకరించక, పరిణామం భరించలేక, భయపడి సంప్ర దాయ శృంఖలాబద్ధులు తిరస్కరిస్తారు. ఈ తిరస్కారం గమనించి, జాతి నిద్రలో వుందని గమనించి, మేల్కొల్పు, క్రమమార్గం చూప యత్నించిన మనిషి గిడుగు. ఆయన భాషను ప్రాచీనమూ, అనంతరమూ అని విభజించు కొని, మన వ్యాకరణాలు ప్రాచీన భాషకు పరిమితాలనీ, అనంతరపు ఆధునిక భాషకు అసమగ్రాలనీ నిరూపించిన మహా మనిషి.

తెనుగుభాష, ప్రాచీనదశలో గ్రంథస్థమై, ఆ భాషకోసం ఉద్దేశింపబడి వ్రాయబడ్డ వ్యాకరణాలను పరమవిధేయంగా ప్రథమ ఉదాహరణంగా ఉండి, ఇదే నిజంగా తెలుగుభాష అని కొందరి నమ్మకానికి గురై ఉన్న భాషను స్థూలంగా గ్రాంథికం అనీ; ఆ ప్రాచీన దశనుంచి ఈనాటిదాకా జనంలో వాడబడుతూ, నిత్యమూ మాట్లాడబడుతూ, అవసరం కలిగినప్పుడు

పై భాషావిభేదం కన్నభిన్నంగా వ్రాయబడుతూ నోటిమాటకు కొంతలో కొంత, గ్రాంథికంకంటే దగ్గరగా ఉన్న భాషను వ్యావహారికం అనీ; రెండు విధాలుగా విభజించటం, గిడుగుకంటే పూర్వమే వాదోపవాదాలు ప్రారంభ మయినా, స్థిరపడింది.

భాషకు నియమాలు అవసరమేకాని, అవి శాసనాలు కారాదనీ భాషా ధార్మికతత్త్వం జనం వినలేకపోయారు. ప్రవాహానికి ఆనకట్టలు అవసరమే కాని, అవి అవరోధాలు కారాదన్న సత్యం పట్టించుకోని జనం, సత్యం పట్ల వైముఖ్యం చూపించినవాళ్లు, ప్రాచీన నియమానుసారం భాష వ్రాయబడా లని పట్టుదల ప్రదర్శించారు. ఒక్క మాటలో వీళ్లు గ్రాంథికవాదులు. భాష ఎలా వాడబడుతుందో, అలా వ్రాయబడాలనీ, ఎలా వ్రాస్తున్నామో, అలా పలకాలనటం న్యాయంకాదని, భాషను ప్రాథమికస్థితిలో వ్యవహార దూరం చేశామనీ, ఇప్పుడయినా, మరెప్పుడయినా, దాన్ని వ్యవహారానికి దగ్గరగా ఉండేటట్లు చూచుకోవాలనీ, వీలయినంతవరకు మాట్లాడినట్లు వ్రాయాలనీ తలంచినవాళ్లు వ్యావహారిక వాదులయ్యారు. గిడుగు కాలం లోనూ, అంతకుముందూ, ఆతర్వాతా ఈ ద్వివిధ ధోరణులు భాషావిషయంలో వాదోపవాద హేతువులయ్యాయి గ్రాంథిక భాషావాదులుగా చిన్నయ సూరి అనుయాయులు జయంతి రామయ్య పంతులువంటి ప్రభుత్వోన్నతో ద్యోగులు, వేదం వేంకటరాయశాస్త్రి పానుగంటివంటి ఉత్తమ రచయితలు, ఉండగా, వ్యావహారిక భాషావాదులుగా గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావువంటి విమర్శకులు కవులు ఉండగా ఆంధ్రదేశంలో భాషా కురుక్షేత్రం జరిగింది. ఎవరు పాండవులన్నది ఇప్పటికే స్పష్టమయినా, అద్యతన భావిలో సుస్పష్టం కాగలదు. కందుకూరి గ్రాంథిక వ్యావహారిక భాషల ప్రపంచ సంగ్రామంలో—భారతదేశంలాగా గ్రాంథికంవైపు వున్నదా అనిపించి తాటస్థ్యం వహించి, వ్యావహారికంవైపు మొగ్గు చూపాడు.

ఈ భాషా వివాదాల ప్రథమదశలో గ్రాంథికవాదులు అధిక సంఖ్యా కులు. ఇప్పుడు వ్యావహారిక భాషావాదుల సంఖ్య, బలం అధికంగా కనిపిస్తున్నాయా అనిపిస్తుంది. అప్పట్లో ఎందుకందరు గ్రాంథికవాదు లున్నారంటే కారణం స్పష్టం. ఆంధ్రులకు ఆవేశం వుంది. కాని ఒక మహావేశంగా రూపొందేదాక నిలిచే ఓపికలేదు. ఓపిక తగ్గింతర్వాత ఓపి నంతగా నియమాలకు లొంగి జీవించటంలో సుఖం తెలుసు. ఆంధ్రభాషకు, ఎవరేర్పరిస్తే ఏం, ఏ పరిస్థితుల్లో ఏర్పరిస్తే ఏం నియమాలు—కాదు శాసనాలు

— అంటే వ్యాకరణాలు – కృతకమయితే కావచ్చు ఉన్నాయి. వాటికి తగినట్లుగా వ్రాయటం, మాట్లాడటం ఎట్లావున్నా, అలవాటు చేసుకొన్న వాళ్లు, అట్లా అనేక రచనలు చేసినవాళ్లు, అలాంటి రచనలు చేసుకొంటూ వుంటే హాయిగా వుంటుందనుకొని విశ్వసించారు. వీళ్లలోనే మరొక తెగవుంది. అది ఇప్పటికీ వుంది. వాళ్లు వ్యావహారిక భాషా బలం తెలిసిన వాళ్లు, తెలిసి తెలిసి కళ్లు మూసుకొంటూరు. ఎదుటివాళ్లకు ముసుగు వేస్తారు. ముఖానికి మసిపూసి మారేడు కాయనుచేస్తారు. వాళ్లేమంటారంటే, ఇంత ప్రాచీన సాహిత్యం ఈ వ్యావహారికం అంగీకరిస్తే ఏమైపోవాలి? వ్యావహారిక భాష సులువుగా వుంటుంది. అందులో పఠన పాఠనాదు లేముంటాయ్. మీ ఉద్యోగాలేమౌతాయి. పుణ్యం పురుషార్థం దృష్టితో ఈ వ్యావహారిక భాష పనికిరాదు. గ్రాంథికం ఉండాలి, అని అంటూరు. ఇందులో ఎంత బలహీనవాదం ఉందో మేధావులకు చెప్పనక్కరలేదు. పఠన పాఠనాదులంటే పదాలకు అర్థాలు, పద్యాలకు తాత్పర్యాలు చెప్పటంవరకే అనుకొంటే, వ్యావహారికంలో చెప్పవలసిందేమీ ఉండకపోతే పోవచ్చు, కాని విద్య పరిధి విజ్ఞులు గుర్తిస్తారుకదా! అయినా అనేక కారణాలవల్ల గ్రాంథికభాషా రచనం హాయిగా ఉంటుందనీ, అదే స్వీకరింపదగిందనీ, దానినే అర్యభాషగా భావించాలనీ వాదించారు, ఈ గ్రాంథికవాదులు.

స్తబ్ధ జీవితంలో స్తంభ వ్యవస్థలోని యమోల్లంఘనం అసాధ్యం. వ్యావహారిక భాషావాదులు అనేక నియమాలు ఉల్లంఘించవలసిన వాళ్లయ్యారు. వీళ్ల సంఖ్య అందువల్లనే అత్యల్పం, అప్పట్లో, వీళ్లు పాత భాషా వ్యవస్థలో లోపాలు చూచే కళ్లు కలవాళ్లు కావాలి. ఆ లోపం విశదీకరింపగలవాళ్లు కావాలి. అది తప్పు, ఇది ఒప్పు అని చూపే లఘువు తెలుసుకొని వుండాలి. అందులో విమర్శన సాహిత్యం సృజన సాహిత్యం నిర్మింపగల సమర్థులు కావాలి. దీనికంతటికీ, వ్యావహారిక భాషా వైశిష్ట్యం తెలిసినప్పటికీ, దాని నంగీకరించడానికి ఆత్మ ధైర్యం కావాలి అప్పట్లో ఇదేదో కొత్త బెడదగా కొందరు బెదరటం తప్పలేదు. ఈ వ్యావహారిక భాషా ఉద్యమంలో గిడుగు నిర్వహించిన పాత్ర చారిత్రకమయింది. కీకారణ్యంలో త్రోవ చూచుకొంటున్నట్లు, వ్యావహారిక భాషా సిద్ధాంత స్థాపనం చేస్తూ ప్రతి పక్షులతో వాదోపవాదాలు చేస్తూ ఈ భాషా విషయక శాస్త్రీయ దృక్పథం వ్యాసాల ఉపన్యాసాలమూలంగా కలిగిస్తూ తన జీవితంలో ప్రత్యమూల్య క్షణాలను ఈ భాషా ప్రయత్నంలో వ్యయంచేస్తూ గిడుగు వేంకట రామమూర్తి ఈ

భాషోద్ధారకుడయ్యాడు. వ్యావహారిక భాష కావ్యరచనకు సమర్థం కాదన్న వాదాన్ని ఖండించటానికి అన్నట్లుగా, కవితలు, కథలు, వ్యాసాలు, నాటకం వ్యావహారిక భాషలో రచించి, అవెంత సజీవాలో చూపిన గురజాడ అప్పారావు ఈ భాషా స్థాన సంరక్షకుడయ్యాడు. వీళ్లిద్దరు ఒక కాలంలో పరస్పరం చేదోడువాదోడుగా కలిసిమెలసి కృషిచేసి, ఈ భాషోద్యమ మూర్తికి రెండు నేత్రాలుగా ప్రకాశించారు. ఆంధ్రదేశాన్ని అమూలాగ్రంగా పరికించారు. గిడుగు గురజాడకు వ్యావహారికం విషయంలో ఆలోచనశక్తి. గురజాడ గిడుగుకు హృదయశక్తి. ఒకరాలోచన ప్రధాన రచనలు, మరొకరు హృదయ ప్రధాన రచనలుచేసి, విమర్శన సృజన సాహిత్య శిఖరాలుగా నిలిచారు. వీరిరువురి బుద్ధి హృదయాల పునాదిపై నిలిచిన వ్యావహారికం భవిష్యత్పథ దర్శని అయింది. ఈ మహనీయుల నిద్దర్నీ స్మరించేటప్పుడు స్ఫురించే మహాజ్యోతి; మహావ్యక్తి, మహాసంస్థ; సంఘ జీవితం సాహిత్యంలో పునీతం చేయాలనుకొన్న తేజస్వి; బహువిధ రచనలతో ఆంధ్రభారతిని అలంకరించిన మనీషి; తన విశ్వాసానికి రూపకల్పన చేయటం కోసం ఆత్మను దాచుకొన్న దీక్షపరుడు, సంఘ సంస్కర్త, గురజాడలాగానే, గిడుగు రచన అంకితంపొందిన కందుకూరి. మొదట్లో చిన్నయసూరి భాష బాగున్నదనుకొన్న కందుకూరి, తర్వాత ఆ భాష నిష్ప్రయోజనమని గుర్తించి, సులభ గ్రాంథికం వ్రాసి, చిట్టచివరకు వ్యావహారిక భాష ఆధిక్యం గుర్తించటం గమనార్హం.

గిడుగు వేంకట రామమూర్తి పంతులు వ్యావహారిక భాష అంటే ఏమిటో వివరించటానికి, ప్రయోజనం తెలపటానికి, అది అంగీకరింప చేయటానికి యావజ్జీవితం ఖర్చుచేశాడు. అందుకే ఆంధ్రులు ఋణపడ్డారు. తన వాదనకు ఉపయోగపడే కొత్త సత్యం తెలుసుకొంటూనో, కొత్త సాక్ష్యం సంపాదిస్తూనో, కొత్త మెలకువ గ్రహిస్తూనో, ప్రతిక్షణం కృషిచేశాడు. ప్రతిపక్షులతో వాదించటానికి ప్రతిక్షణం శ్రమించాడు, ప్రతిక్షణం పరిశోధించాడు, ప్రతిక్షణం భాషకు అంకితం చేశాడు.

గిడుగు వ్యావహారిక భాషా కృషి స్థూలంగా నాలుగువిధాలుగ విభజింపవచ్చు. ఈ కృషి విమర్శన సాహిత్యానికి పరిమితం. ఈ విమర్శనకు ప్రక్రియలు రెండు. ఒకటి పత్రికలలో వ్యాసం. రెండు వేదికలపైన ఉపన్యాసం. అవసరం అయితే 'తెలుగు' పత్రిక స్థాపించినట్లే, వేదికలు ఏర్పాటు చేసుకోవటంకూడా సాగించి, తను నమ్మినసత్యం వెలువరించాడు. గిడుగు

సాంప్రదాయికవిద్య అభ్యసింపక పోవటంవల్ల ఇంత స్వతంత్రమైన ఆలోచన పెరిగిందేమో అనీ అనిపిస్తుంది. గిడుగు చతుర్విధకృషి ఈ విధంగా చెప్పవచ్చు.

1. భాష మారుతుంది. ఏ కాలంనాటికవి ఆ కాలంనాటి వ్యావహారికం వ్రాశాడు. వ్యావహారికంలో రచనలుచేస్తే భాషాప్రయోజనం బాగా నెరవేరుతుంది. నేడుచేసే రచనల్లో నేటి భాష ఉండాలి. ఒకనాటి భావవుండకూడదు. ఈ విషయం తెలుపవలసిన గిడుగు తద్వివరణం ఒకటి జైత్రయాత్రలాగా సాగించాడు.

పాఠశాలల్లో, కళాశాల్లో ఉపయోగించే గ్రంథాల్లో భాష, వ్యావహారికం కారాదు. అనే ప్రతిపక్షుల వాదానికి వ్యతిరేకంగా 'వ్యవహారికభాషా బహిష్కార నిరసనం'; నన్నయ్య కాలంనాటి వ్యావహారిక భాష, గ్రాంథిక భాషాధోరణులు పరికించే 'రాజరాజు కాలమందున్న తెనుగుభాష'; ప్రాచీనాంధ్ర భాషా వైవిధ్యంచూపే 'ప్రాఁదెనుఁగుఁగమ్మ'; (ఇది ఛందస్సహితం. అచ్చ తెనుగు రచన. బాల కవిశరణ్యంలో ముఖబంధనం ఛందస్సహితం. రెండుచోట్ల వాడిన ఛందస్సు దేశి కాని మార్గకాదని గుర్తింపవచ్చు) తన సంపాదకత్వంలో సాగిన 'తెలుగు' పత్రికలో భాషాప్రయోజనం వివరించిన 'విన్నపం'; వ్యావహారిక రచనావశ్యకాన్ని గూర్చిన ఆంగ్లంలోని 'Introduction' 'How to approximate written and spoken Telugu'; 'Who can fix a living languages'; 'Popular literature' 'A memorandum on modern Telugu'; మొదలైన ఆంగ్లాంధ్ర వ్యాసాలు; అప్పకవీయం విశ్వాసి శశిరేఖ మొదలైన గ్రంథాల ఉపోద్ఘాతాలు; వావిలకొలను సుబ్బారావు పంతులు, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు మున్నగువాళ్లు ప్రయోగించిన భాష సజీవ వ్యావహార భాష కెంతదూరమో నిరూపించిన ఉపన్యాసాలు; గిడుగు వ్యక్తం చేయదలచిన ప్రథమధర్మ ప్రదర్శకమయ్యాయి. ఈ యావత్ రచనలు పరికించింతర్వాత ఎవరికయినా వ్యావహారిక భాషా రచనాధిక్యం స్ఫురించి, వ్యావహారిక రచనా విధానమే, భాషా ప్రయోజన సాధన సమర్థం అనిపిస్తుంది.

2. కొందరు వ్యావహారిక భాషను తిరస్కరించి, గ్రాంథిక భాషను ఉద్ధరించాలని–శవాలను బ్రతికించాలనుకొన్నట్లు–యత్నిస్తున్నారు. తాళ పత్రగ్రంథాలు పరిష్కరిస్తున్నారు. తమ అనుకూల భాషలో ప్రాచీన

గ్రంథాలు ప్రకటిస్తున్నారు. ఇందువల్ల భాషకు అనేక అనర్థాలు కలగాయి. గిడుగు వాటిని వివరించాడు. ప్రాచీన గ్రంథాలు దర్శించాడు. ఉప లభ్యమైన రచనలలోని వచనభాగాలు ఏరికూర్చి ప్రాచీన వ్యావహారిక వచన సంప్రదాయం చూపించాడు. ఇక్కడ గిడుగు చేసింది సంకలనమే అయినా, వ్యావహారిక భాషా ప్రాచీనతకిది ప్రబల తార్కాణమైన కృషి. 'పూర్వులు ఎవ్వరూ వాడుకభాషలో గ్రంథాలు రచించి ఉండలేదు' అనే ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి ఆక్షేపణకు సమాధానంగా; రామాయణ భారత భాగవత వచనగ్రంథాలు, ప్రాచీన లిఖిత గ్రంథాలు, తత్త్వరచనలు, కథలు, అనువాదాలు, దేశ, యాత్రచరిత్రలు, కైఫీయతులు, కోర్టుతీర్పులు, వార్తాపత్రికలు, వ్యాసాలు, సంస్కృతాంధ్ర వ్యాఖ్యానాలు, లక్షణ గ్రంథాలు, వైద్యజ్యోతిష ధర్మశాస్త్రాలు, నిఘంటువులు, శాసనాలు మొద లయిన అనేక ప్రాచీన వచన రచనలలోని భాగాలు స్వీకరించి వ్యావహారి కంలో వ్రాయటంవల్ల సౌలభ్యం ప్రదర్శించాడు గిడుగు.

3. గ్రాంథిక భాషస్వరూపం స్పష్టంగాలేదు. వ్యాకరణాలు అనేకమై, పరస్పర విరుద్ధంగా అసంపూర్ణంగా ఉండటంతో ఏ పదరూపం తప్పో ఒప్పో నిర్ధారణకాలేదు. ఒక ప్రాచీనుడి వ్యావహారికం మరో అర్వాచీ నుడికి గ్రాంథికమయింది. ఒక భాషారూపం పండితులకు వివాద హేతువయింది. ఒక గ్రాంథికవాది గ్రంథంలో తప్పులు మరో గ్రాంథిక వాది చూచి ఆనందిస్తున్నాడు. ఈ పరిస్థితిని గమనించి గ్రాంథికం ఊహాస్తిత్వం కలిగిందనీ, నిర్దుష్టమైన గ్రాంథిక రచనకు అవకాశంలేదనీ, వ్యావహారిక పదరహిత రచనా వ్యవస్థలేదనీ, వ్యావహారిక భాషాస్పర్శ లేకుండా గ్రాంథిక రచన అసాధ్యమనీ, ఇంత అస్తవ్యస్తంగా అవ్యవస్థంగా ఉన్న గ్రాంథికంలో రచించటం అనవసర ప్రయాసఅనీ, వ్యావహారిక భాషలో వ్రాయటం సులభమనీ, తెలిపే విమర్శలు 'మిథ్యాపవాదము', 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము', 'నిజమైన సంప్రదాయము.'

- 7-6-1919 న నెల్లూరి పురమందిరంలో ఆంధ్ర సాహిత్య పరిషదష్టమ వార్షిక సభలో అధ్యక్షోపన్యాసంలో వేదం వేంకటరాయశాస్త్రి కందుకూరి వీరేశలింగం పంతులు 'పుస్తకాలలోని వాక్యాలున్నూ శబ్దాలున్నూ ఉదా హరించి' భాషాదేవికి విషప్రయోగం జరిగిందని, అలా చేసినవాళ్లు దుష్ట ప్రబంధ నిర్మాతలనీ, హాస్యంకోసం పరాచికాలుచెప్పి ఎగతాళిగా పలకటం విన్న సదస్యులందరికీ అది కందుకూరినిగూర్చి అని తెలియదు. అప్పటికి కందుకూరి గతించి పదకొండురోజులు! చిన్నకర్మ!

విద్యార్థులకోసం కందుకూరి వ్రాసిన పుస్తకాలలో వేదం వేంకటరాయ శాస్త్రి తప్పులని ఎత్తిచూపిన పదాలు స్వీకరించి అవి ఎలా ఒప్పులో చెప్పిన గిడుగు కృషి, పాండిత్యం ప్రశంసనీయాలు. జలగ, దవడ, జండా, కాలవ, మనమడు అని కందుకూరి వ్రాసిన పదాలు తప్పు, అవి జెలుగ, దవుడ, జెండా, కాలువ, మనుమడుగా వుండాలని వేదం వేంకటరాయశాస్త్రి భావిస్తే, కందుకూరి ప్రయోగాలు ఉచితమయినవని గిడుగు చేసిన సమర్థనం తెలిపే 'మిథ్యాపవాదం'లో అతని పాండిత్యంతోపాటు భాషాదృష్టి గోచరమవుతుంది.

కొక్కొండ వేంకటరత్నం పంతులు కందుకూరి వీరేశలింగం పంతులు సమకాలికులు. సమస్కంధులు. సమవిరోధులు. ఇరువురూ కళాశాలాధ్యాపకులు. వాళ్లు వాదోపవాదులకోసం పత్రికలే ప్రారంభించారు. కందుకూరి మహా వ్యక్తి. కొక్కొండ మహా పండితుడు. గ్రాంథికవాది. కొక్కొండ అనువదించిన 'ఆంధ్ర ప్రసన్న రాఘవము'లో వేదం వేంకటరాయశాస్త్రి 2568 భాషాదోషాలు చూపించాడు మహా పండితుడైన కొక్కొండ గ్రంథంలో ఇన్ని దోషాలుంటే ఇక గ్రాంథిక రచన దోష రహితంగా అసాధ్యమే కదా! అంతేకాదు అన్ని దోషాలు చూపిన వేదం వేంకటరాయశాస్త్రి గ్రంథంలో గిడుగు దోషాలు చూపించి, దోషరహితంగా గ్రాంథికరచన ఉండదని విమర్శించాడు. 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము' గ్రాంథికవాదుల పాలిటి వజ్రాయుధమయింది.

4. వ్యాకరణకర్తలు, కోశకారులు, పండితులు, ప్రాచీన కావ్యసంతతి పూర్తిగా పరిశీలించకుండా అనేక శబ్దాలను, అపశబ్దాలని ప్రయోగానర్హాలుగా భావించారు. అది తప్పు. ప్రయోగాలు వ్యాకరణాలకంటే బలవత్తరాలు. అనేక కవులు, అనేక పర్యాయాలు ఒక పదం నిర్ణీతరూపంలో ప్రయోగిస్తే, చూచి, అది అపశబ్దంగా భావించటం వ్యాకరణ సంప్రదాయ విరుద్ధం. గ్రాంథికవాదులు ఈ విరుద్ధ విషయాన్ని గ్రహించి, వాదోపవాదాలు చేయటం అనుభవం. గ్రాంథికులు అపశబ్దాలం అనుకొనేవాటిని తీసుకొని, అవినింద్యాలుకావని, అనేక ప్రయోగాలు ఉదాహరించి, ఆ ప్రయోగాల సుశబ్దతను సాధించాడు గిడుగు.

'కూతురిని' 'కూతురికి' 'చేతురు' 'కోతురు' వంటి ప్రయోగాలు గ్రాంథికవాదుల దృష్టిలో, బాలవ్యాకరణకర్త దృష్టిలో అపశబ్దాలు. అవి సుశబ్దాలు అని రుజువుచేయటానికి గిడుగు ప్రాచీన కావ్య ప్రపంచంనుంచి

వందలకొద్ది ప్రయోగాలు చూపుతుంటే, గిడుగు ధర్మదీక్ష, సత్యదృష్టి, భాషా సేవ, పరిశోధన పటిత్వలోకానికి తెలిసి పరమానందం కలుగుతుంది. 'రాజుకు', 'అందుకు' 'అందటికి' 'చాలా', 'ఇంకా' 'అయినా' 'కూడా', 'రెండో' 'మూడో' 'సేనా', 'తలా' 'ఏమీ', 'వద్దు', 'కొద్ది', 'వల్ల', 'ఇరువై', 'వాటి', 'వీటి', 'నేటి', 'వాండ్లు', 'వాళ్లు', 'పట్టుక', 'వద్ద', 'చేయడము', 'కోసము', 'అయితే', 'చేస్తాను', 'చేసింది' వంటి వందలకొలది పదాలు సాధువులని ప్రయోగోదాహరణాలతో చూపితే, గ్రాంథికవాదులే ప్రయోగించారని తెలిపితే, గమనించినవాళ్లు తెలుగుభాషా భవితవ్యం గుర్తించారు. ఈ పదప్రయోగ సాధుత్వ పరామర్శ చేసే 'బాలకవి శరణ్యము' వ్యావహారికభాషకు ఒక విధంగా వ్యాకరణ మయింది. ఈ 'బాలకవి శరణ్యము' వల్ల 'కవులు తమకు సుపరిచితమయిన భాష యథేష్టముగా వాడుకొని, సరస కావ్యములు రచించుటకు ఉత్సాహము కలుగుతుంది. కవులు ప్రయోగించే భాష ఎంత సుపరిచితమై, ఎంత సులభ సాధ్యమై, ఉంటే, కావ్యము అంత సుబోధమై, సహజమై, సరళమై, ఉంటుంది' అని గిడుగు రామమూర్తి పంతులు సప్తతితమ జన్మదినోత్సవ సందర్భంలో ఆ భాషావేత్త రచనలలో లభ్యమయిన వాటినన్నిటిని సంపుటాలుగా ప్రకటిస్తూ శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నం సంపాదకీయ భూమికలో పేర్కొన్న విషయం పరిపూర్ణ సత్యం.

చిన్నయసూరి, బాలవ్యాకరణం గిడుగుకు అనిష్టం. ఈ అనిష్టం అవాచ్యంగా ఎప్పుడు మారలేదు. గ్రాంథికం, గ్రాంథికవాదులు భాషా విషయిక అవ్యవస్థకు చిహ్నాలు. అయితే వ్యవస్థను వ్యతిరేకించాడు కాని, గిడుగు వ్యక్తుల నిందించలేదు. వ్యాసాల్లో ఉపన్యాసాల్లో విమర్శల్లో పరిహాసం ఉంది కాని అది వ్యక్తుల పరిమితిని దాటింది. హేతుబుద్ధి, నిష్పాక్షికదృష్టి, ధర్మచింతన, భాషాభ్యుదయ భావాలతో గిడుగు ఉత్తమ విమర్శకుడు. ఉత్తమ మనీషి. వందేళ్ల పూర్వంనుంచి సాగుతున్న ఈ భాషా సమరంలో తన పాత్ర చారిత్రకంగా నిర్వహించి గతించిన గిడుగు ఆత్మ నేటి వ్యావహారిక భాషాభ్యుదయ పథం చూచి ఆనందిస్తుంది.

[ప్రథమాఖిల భారత ద్రావిడ భాషావేత్తల సమావేశంలో చదివిన ఆంగ్ల వ్యాసానికి మూలం. త్రివేంద్రం. '71]

# ఇతర ప్రచురణలు

| | | |
|---|---|---|
| ఇదా జీవితం?—డా. కొలకలూరి ఇనాక్ | ... | 6.00 |
| ఆశా జ్యోతి—డా. కొలకలూరి ఇనాక్ | ... | 1.90 |
| వేకువ—రావూరి భరద్వాజ | ... | 2.50 |
| ఆడపిల్ల తండ్రిని—డా. చల్లా రాధాకృష్ణశర్మ | ... | 3.00 |
| తెనుగు విందు—డా. చల్లా రాధాకృష్ణశర్మ | ... | 3.35 |
| చందమామ—డా. చల్లా రాధాకృష్ణశర్మ | ... | 0.90 |




SAHITYA VYASALU

By Dr. Kolakaluri Enoch

వెల: రూ. 6.00